# ఆంధ్ర నాటికలు

ఆరుద్ర



దేశి కవితా మండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
మార్చి - 1958
మూడు రూపాయలు
దేశీ ప్రెస్, విజయవాడ



---

సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

ఈ సంపుటిలో:

## పాత్రలు :

| | |
|---|---|
| పానకాలు | మేస్త్రి (కార్మికుడు) |
| అప్పలస్వామి | నౌకరు లేక బంట్రోతు |
| గుమాస్తా | —— |
| అయ్యగారు | యజమాని |
| బాబాజీగారు | మఠాధిపతి |

# విష ప్రయోగం

ఆఫీసులాంటి రంగస్థలం. బాగా డబ్బున్నవాడి కచేరీని స్ఫురింప జేసే అలంకరణాలు. తెర ఎత్తగానే రంగస్థలం ఖాళీగా ఉంటుంది. పానకాలు భయపడుతూ భయపడుతూ ప్రవేశిస్తాడు. ఎవరూ చూడ డం లేదని నిశ్చయించుకున్నాక—అడుగు వేస్తాడు. బల్లమీదఉన్న కూజా దగ్గరకువెళ్ళి జేబులోంచి ఒక పొట్లం తీస్తాడు. కూజా మూత తీసి అందులో పొట్లంలోనిది పోస్తాడు. భయపడుతూనే పోస్తాడు. కూజా మూత పెట్టేసి తొందరగా నిష్క్రమించబోతాడు. ఆ తొంద రలో ఒక కుర్చీనో ఒక టేబిలుమీద సామానో క్రిందపడేస్తాడు. భయపడుతూ ఆ పడిపోయినదాన్ని సరిచేసి వెళ్ళిపోతాడు. తెర.

తెర మళ్ళాలేస్తుంది. లేదా లైట్లు ఆర్పి వెలిగించబడుతాయి.

## అదే రంగస్థలం

అప్పలస్వామి: (ఆఫీసు బంట్రోతు, ఎదురుగుండా ఉన్న గోడమీది - పెండ్యులం గడియారానికి 'మారిపోవు రా కాలం - మారుటదానికి సహజమురా!' అనే సినిమా పాటపాడుతూ కీ ఇస్తూఉంటాడు. కీ ఇచ్చాక పెద్దముల్లు ఆరుదగ్గిరా, చిన్నముల్లు పన్నెండు దగ్గిరా పెడుతూ టైము సరిదిద్దుతాడు. గంటలు కొడతాయి. టైము ఆరున్నర - ఏడు, ఏడున్నర చేస్తాడు.)

పానకాలు: (రంగస్థలానికిగల ఒకే ఒక్క ప్రదేశంగుండా వస్తాడు.) అప్పలస్వామీ! అయ్యగారెప్పుడొస్తారు?

అప్ప : ఎవరది ? ఓ పానకాలా! ఏం పానకాలూ, ఇలా వచ్చావ్ ?

పాన : ఏం లేదు. అయ్యగారొన్సారి చూద్దామని. ఎప్పుడొస్తారు ?

అప్ప : ఎవరికి తెలుసు. ఆయనకి ఇష్టమొచ్చినప్పుడొస్తారు; ఇష్టమొచ్చినప్పు డెళ్తారు.

పాన : ఇవాళ రారంటావా ?

అప్ప : ఎందుకు రారూ ! ఏదో వేళలో వస్తారులే. ఏం, ఎందుకూ ?

పాన : ఎందుకేంటి ? ఆయనొస్తే నా కష్టాలు చెప్పుకుందామని.

అప్ప : ఏంలాభం ? చెప్పుకుంటే వింటారు కనకనా !

పాన : విన్నా - వినకపోయినా ఇవాళ చెప్పుకోనిగాని ఇక్కణ్ణుంచి కదలదలుచుకోలేదు. (సెంటరు కుర్చీలో కాకుండా ప్రక్క కుర్చీలో కూర్చుంటాడు.)

అప్ప : ఏంటి పానకాలూ, నీకు మతిపోయిందేంటి?

పాన : ఇంకా పోలేదుగానీ పోతుందిలే.

అప్ప : అయితే పోయిందిలే. నీకు పూర్తిగా పోయిందిలే !

పాన : నీకెలా తెలుసు ?

అప్ప : లేకపోతే కుర్చీలో ఎందుకు కూర్చుంటావ్ ?

పాన : ఏం కూర్చోకూడదా ! కుర్చీలు కూర్చోడానికి కాకపోతే మరెందుకు ?

అప్ప : కూర్చోడానికే అనుకో ! గాని కూర్చోవలసినవాళ్ళు
వేరే ఉన్నారు.

పాన : వాళ్ళకీ మనకీ తేడా ఏంటి ? బాబుగారు చెప్పినట్టు,
వాళ్ళ చేతికీ అయిదు వేళ్ళే; మనచేతికీ అయిదు వేళ్ళే.
(తన చేతివేళ్ళు చూసుకుంటాడు.)

అప్ప : అయితే-

పాన : అయితే ఏంటి! ఎక్కువ తక్కువ లుండడానికి వీల్లేదు.
అంతా ఒకటే !

అప్ప : మాటల్లో అంతా ఒకటేలే !

పాన : మాటల్లోనేకాదు. ఎప్పుడూ అంతా ఒకటే అవాలి !

అప్ప : నీ వెర్రికాని-ఎలా అవుతాం పానకాలు! ఆళ్ళ పుటక
వేరు. మనపుటక వేరు.

పాన : ఏం వేరులేదు. మనలాగేవాళ్ళూ ఒకతల్లి కడుపున
పుట్టినాళ్ళే. చస్తే మన్నీ తగలెడతారు; ఆళ్ళనీ
తగలెడతారు.

అప్ప : నిజమే – తగలెడతారుగానీ ఆళ్ళని మంచిగంధపు
చెక్కల్తో తగలెడతారని మర్చిపోకు.

పాన : డబ్బుంటే ఎలా తగలేసుకుంటే మనకేం.

అప్ప : అదే నేననేదీని. ఆళ్ళకి డబ్బుంది. మనకిలేదు; ఆళ్ళు
కుర్చీలో కూర్చోవచ్చు. మనం కూర్చోకూడదు.

పాన : కుర్చీలుచేసేది మనమేకదా ! మనం ఎందుకు కూర్చో
కూడదు ?

అప్ప : మిఠాయి దుకాణంవాడు ఎప్పుడేనా మిఠాయి తినడం నువ్వు చూశావా ?

పాన : వాడు తినకపోబట్టే ఇన్ని చిక్కులు. పనిచేసేవాడు అనుభవించటం లేదు కనుకనే ప్రపంచకం ఇట్టా ఏడుస్తోంది. నేను పనిచేస్తున్నాను; అనుభవిస్తాను ?

అప్ప : అనుభవించు. ఎవరొద్దన్నారు. ఈ కుర్చీలోకూర్చున్నందుకకూడా అనుభవిస్తావులే !

పాన : అనుభవిస్తే-అనుభవిస్తా - గానీ కుర్చీలోకూర్చోడం మాన్ను !

అప్ప : కూర్చో బాబూ ! తప్పకుండా కూర్చో !

పాన : చాల్లే ఎటకారం.

అప్ప : ఎటకారం కాదు.

పాన : నాకు తెలుసులే ! నీలాంటోళ్ళు భయపడుతూ ఉండబట్టే మనం ఇలా ఉన్నాం !

అప్ప : ఎలా ఉన్నాం !

పాన : నేను చెప్పడం ఎందుకూ - నీకు తెలీదు కనుకనా !

అప్ప : అయినా చెప్పు ఇంటా !

పాన : మనలో ధైర్యం లేకపోతే మనం ఎప్పుడూ నుంచోనే ఉంటాం. పోనీ ఎప్పుడైనా ధైర్యంచేసి కూర్చుంటే మనలో వాళ్ళే ఆడ్డి కూర్చోకూడదంటారు. అదీ వచ్చిన చిక్కు.

అప్ప : ఈపాటి నాకు తెలవక్కాదు.

పాన : నీకీ విషయాలన్నీ తెలుసా ఏటి ?

అప్ప : తెలవకేం ?

పాన : అయితే నన్నెందుకు కూచోవద్దన్నావ్ !

అప్ప : (నవ్వుతాడు.)

పాన : ఏంటలా నవ్వుతావ్ ! చెప్పు ! నన్నెందుకు కూచో వద్దన్నావ్ !

అప్ప : ఏం లేదులే! కూర్చో! నీ యిష్టంవచ్చినట్లు కూర్చో! బాగా కూర్చో !

పాన : ఏళాకోళం చాల్లే ! నువు కూచోవద్దంటే మానేస్తా ననుకొన్నావా ?

అప్ప : మానొద్దు నాయనా మానొద్దు ! నీకంత సరదాగా ఉంటే ఆ కుర్చీలో కూర్చో (అయ్యగారి కుర్చీ చూపెడ్తాడు.)

పాన : (మాట్లాడడు.)

అప్ప : నీ ధైర్యం ఆ కుర్చీలో కూర్చోడానికి చాల్దా ఏంటి !

పాన : ఏటన్నావ్ !

అప్ప : ఏంలేదు. నీ ధైర్యం ఏపాటిదో తెలిసిందిలే.

పాన : ఆ-నేను వెనక తీస్తాననుకున్నావా! అసలు అయ్యగారి కుర్చీలో కూర్చోడానికే నేనొచ్చా. (లేచాడు. అయ్యగారి కుర్చీలో వెళ్ళి కూచ్చుంటాడు.)

అప్ప : (చప్పట్లు కొడతాడు)

పాన : (మూతి ముడుచుకొని కూచ్చుంటాడు.)

అప్ప : సెభాష్ భేటా ! తెగించావ్.

పాన : (మాట్లాడడు.)

అప్ప : నేను నౌఖరీలో చేరింది మొదలు చూస్తున్నా. అయ్యగారి కుర్చీలో ఎవరూ కూర్చోరు. చివరికి బాబాజీ గారైనా సరే.

పాన : (మాట్లాడడు.)

అప్ప : బాబాజీ గారంటే అయ్యగారికి ఎంత భక్తి! ఆరు గదిలోకొస్తే లేచి నిలబడతారు. దండంపెడతారు. గాని ఈ కుర్చీలో కూర్చోనివ్వరు.

పాన : (మాట్లాడడు)

అప్ప : అయ్యగారి కార్లో ఎవరూ ఎక్కడానికి వీల్లేదు. కానీ బాబాజీగార్ని ఎక్కనిస్తారు. అయ్యగారి మంచినీళ్లు ఎవరూ తాగడానికి వీల్లేదు. అయినా బాబాజీగార్ని తాగనిస్తారు. బాబాజీగారికి యీ ఇల్లేని కుర్చీలో కూర్చున్నావ్.

పాన : (మాట్లాడడు.)

అప్ప : ఆ కుర్చీ అంటే ఏమిటో నీకు తెలుసా! లాభాలు సంపాదించే కుర్చీ. అన్యాయాలు చేసే కుర్చీ. అబద్ధాలు చెప్పే కుర్చీ!

పాన : చాల్లే. కూర్చున్నవాడు మంచాడైతే కుర్చీలో ఏటుంది.

అప్ప : నీకు తెలీదు.

పాన : నాకు తెలుసు. నువ్వేం చెప్పక్కర్లేదు. నేను పాటు పడుతూంటే ఆయన యీ కుర్చీలో కూర్చొని లాభాలు

తీస్తున్నాడు. ఇక మీదట నేనే కూర్చొని నేనే లాభాలుతీస్తా.

అప్ప : అంతా అందలమెక్కేవాళ్ళైతే మోసేవాళ్లెవరు? నీవు కుర్చీలో కూర్చుంటే పనెప్పుడు చేస్తావ్?

పాన : పని చేసేటప్పుడు పని చేస్తా. ఆ తర్వాత కుర్చీలో కూర్చుంటా.

అప్ప : అలాగా! నాకు తెలీదులే!

పాన : నీకు నవ్వుతాలుగా వుందా. ఈ అయ్యగారిదగ్గర పని చేయడానికిముందుకూడా నేనుపాటుపడేవాణ్ణి. అప్పుడు మూణ్ణెల్లుపనిచేస్తే ఏటికేడాదికీ సరిపడే ఆనందాన్ని తయారుచేసేవాణ్ని. నేనూ నా సంసారమే కాకుండా వూళ్ళో వున్నవాళ్ళకి సరిపడే ఆనందాన్ని తయారు చేసేవాణ్ని. ఇప్పుడీ అయ్యగారి దగ్గరకూడా చేస్తున్నా. కానీ నాకూ, నా సంసారానికీ ఆనందం లేదు. నా యిరుగుపొరుగువాళ్లకి ఆనందంలేదు. నేను చేసులాటా చేస్తున్న ఆనందాన్ని మనసారా ఎందుకు అనుభవించలేక పోతున్నానో నీకు తెలుసా! యీ కుర్చీలో కూర్చున్నవాడు అడ్డమొస్తున్నాడు. ఇక మీద అడ్డంరాకుండానే యీ కుర్చీలో కూర్చున్నా.

అప్ప : ఎంతసేపులే. అయ్యగారు రాగానే లేస్తావ్. ఆయన గారు నీమీద వురిమిచూడగానే కార్ఖానాలోకి వెళ్ళి పోతావ్.

పాన : అక్కడే పొరబడుతున్నావ్. ఆ రోజులుపొయ్యాయి. నా కష్టంమీద అయ్యగారు యిళ్ళు కట్టాడు. కార్లు

కొన్నాడు. కాలు మీద కాలేసుకొని యిక్కడ కూచ్చుంటున్నాడు. ఇక మీదట నేనే కూర్చుంటా. నేనే యిల్లుకడతా. కార్లు కొంటా. అయ్యగారు నా మూలంగా అనుభవించేవన్నీ నేనే అనుభవిస్తా.

అప్ప : అలాగా! అయితేకానీ, అయ్యగారి కుర్చీలో కూచ్చున్నావ్. కాబట్టి అయ్యగార్లా టేబిల్ మీద కాళ్ళు పెట్టుకో.

పాన : పెట్టుకుంటాను భయమా ! (టేబిల్ మీద కాళ్ళు పెడతాడు)

అప్ప : అయ్యగార్లా అప్పలస్వామీ అని పిలు.

పాన : పిలుస్తా ! "అప్పలస్వామీ !"

అప్ప : బాబూ ! (చేతులు కట్టుకొని నిలబడతాడు.)

పాన : (మాట్లాడడు.)

అప్ప : ఆ తర్వాత ఏంచేయాలో నీకు తెలియదు.

పాన : తెలియకన్లా !

అప్ప : తెలియకపోతే ఎలా ? (కూజాలో నీళ్ళు గ్లాసులో పోస్తాడు.)

పాన : (భయంగా చూస్తాడు.)

అప్ప : (గ్లాసు తీసుకొచ్చి పానకాలుముందు పెట్టుకుంటాడు.) తాగు. విడిచిపెట్టు చెప్తా !

పాన : నా కక్కర్లేదు.

అప్ప : (నవ్వుతాడు.)

పాన : ఎందుకు నవ్వుతావ్ !

అప్ప : ఏంలేదు. నీ ధైర్యానికి నవ్వొచ్చింది.

పాన : నా ధైర్యానికా ! నా ధైర్యానికేం !

అప్ప : అదికాదు. అయ్యగారి కుర్చీలో కూర్చోడమైతే కూర్చున్నావ్ గానీ, తీరా వారిలా అనుభవించడం వచ్చేసరికి నీకు భయమేసింది. అందుకు నవ్వొచ్చింది.

పాన : నే నందుకు వద్దనలేదు. నాకు దాహం లేదు. అందుకక్కర్లేదన్నా.

అప్ప : నాకు తెలుసులే – ఆరంభశూరత్వమే గానీ అంతకు మించి నువ్వేం చెయ్యలేవు.

పాన : చూస్తావుగా. ఇప్పుడయ్యగారొస్తే పట్టుకు నిలదీస్తా.

అప్ప : (నీళ్ళు కూజాలో పోసేస్తాడు.) సరే యింతవరకు యేదో పిచ్చిచేష్టలు చేశావుగానీ–యింక వెళ్ళు.

పాన : నేను వెళ్ళడానికి రాలేదు.

అప్ప : ఈ లోకంలోకి మనమంతా అందుకేవచ్చాం. వెళ్ళి కార్ఖానాలో పనిచెయ్.

పాన : నేను పని చెయ్యను. అయ్యగారి అంతు కనుక్కునేదాకా నేను పని చెయ్యను.

అప్ప : ఏవిటి ? మళ్ళా సమ్మెచేస్తున్నావా ?

పాన : ఇకమీదట సమ్మెకూడా చెయ్యను. ఒకసారి బుద్ధొచ్చింది. మళ్ళా సమ్మె చేస్తానా ?

అప్ప : ఏం! ఎందుకు చెయ్యవ్ ?

పాన : సమ్మెచేస్తున్నంతసేపూ గడ్డం పట్టుకుని బతిమాలుతాడు. సమ్మె ఆపేశాక జుట్టుపట్టుకు చావబాదుతాడు,

సమ్మోకన్నా మూరైన పద్ధతే యిప్పుడు కనుక్కున్నా.

అప్ప : ఏం – నీ మొహం కనుకొన్నావో !

గుమాస్తా ప్రవేశించుతాడు.

గుమా : ఏం అప్పలస్వామీ, ఇంకా అయ్యగారు దయ చెయ్యలేదా ?

అప్ప : ఇంకా లేదు బాబూ.

పాన : నమస్కారం బాబూ.

గుమా : ఎందుకొచ్చిన నమస్కారాలు నాయనా. కడుపు నిండనా; కాలునిండనా. అదేవిటి పానకాలూ, అయ్యగారి కుర్చీలో కూర్చున్నావ్!

పాన : మీరే కూర్చోమన్నారుకదండీ.

గుమా : ఎవరు–నేనా! నేను నిన్నుకుర్చీలో కూర్చోమన్నా నా. మా బావుంది.

పాన : అదేవిటి! అప్పుడే మర్చిపోయ్యారా. మీరు చెప్ప లేదూ ?

గుమా : ఎవడేనా నవ్విపోతాడు, లే ! లే !

అప్ప : నే నప్పుడే నవ్విపొయ్యానులెండి.

పాన : నువ్వు నవ్వితే నాకేం! లోకం నవ్వినా, తిట్టినా, చన్నీళ్ళు చల్లినా మనం వెనుకదీయగూడదని మీరు చెప్పలేదా బాబూ?

గుమా : ఏదో ఉపన్యాసంలో చెప్పేననుకో; చెప్పేనుకదా అని చేసెయ్యడమే ?

పాన : చెయ్యడానికి కాకపోతే మరి చెప్పడ మెందుకు బాబూ !

అప్ప : విని సంతోషించడానికి.

పాన : నిన్నెవరూ అడగలేదు. మహా తెలిసినట్టు చెప్తున్నావ్.

అప్ప : తెలుసుకనకనే చెప్తున్నా !

పాన : నీకేం తెలుసు?

గుమా : ఎవరి కెంత తెలిస్తే ఏంలాభం. ప్రయోజన ముండొద్దూ. మన దరిద్రానికి కారణం నాకు తెలుసు. మన ఆకలికి సరిపడ్డ అన్నం ఎందుకు దొరకదో; మనకి ఆనందం ఎందుకు అందుబాటులో లేదో నాకు బాగా తెలుసు. అయితే ఏం లాభం? మన చిక్కులు పోతాయా ?

పాన : అయ్యగారి కుర్చీ మనం ఆక్రమించుకుంటే అన్ని చిక్కులూ తొలగిపోతాయని మీరేకదా చెప్పారు.

గుమా : నిజమే ననుకో !

పాన : అయితే అడ్డుచెప్తా రెందుకూ?

గుమా : పర్యవసానం నేను చెప్పేదే కాని పద్ధతిమటుకూ ఇది కాదు.

పాన : పర్యవసానం రైటైతే పద్ధతి ఏదైతేనేం బాబూ !

అప్ప : అలాగా ! మీ అబ్బని అయ్యా అని పిలవడంలోనూ అమ్మ మొగుడా అని పిలవడంలోను నీకేం తేడా కనబడదన్నమాట!

పాన : నోరుముయ్.

అప్ప : ఏం, నే నెందుకు నోరు మూసుకోవాలీ! నీలా మాట్లాడే స్వతంత్రం నాకూ ఉంది.

పాన : లేదని నేనన్నా!

అప్ప : అయితే ఎందుకు నోరు ముయ్యమన్నావ్?

పాన : అందరి మంచికోసం – నే నయ్యగారి కుర్చీలో కూచుంటున్నా. అడ్డొచ్చినాళ్ళని అడ్డం రాకుండా చెయ్యడం అందరికీ మంచిదే.

అప్ప : సువ్వొక్కడివీ మంచిదనుకోగానే సరా? అందరి మంచికోసం చేస్తున్నా నన్నావు కదా, అందర్నీ అడిగే చేస్తున్నావా?

పాన : మన మంచి కోసం పడే వాన మనతో చెప్పి పడుతున్నదా ఏం?

అప్ప : వాన తుఫానయితే మంచల్లా చెడ్డవుతుంది. ఏమంటారు బాబూ.

గుమా : సరైనమాటన్నావు? పానకాలూ, ఇక్కడితో ఇది కట్టిపెట్టి అక్కణ్ణుంచి లే!

పాన : నేను లేవను.

గుమా : అయ్యగారొస్తే అందరికీ ప్రమాదం. మన ఉద్యోగాలు ఊడుతాయి. జాగర్త.

పాన : ఉద్యోగాలేం ఊడవ్? ఊడగొట్టిందికి ఇవాళతో ఇంక అయ్యగా రుండరు.

గుమా : ఏం? ఎందుకుండరూ. ఏమిటి నీ ఉద్దేశం.

పాన : నన్నేం అడక్కండి.

అప్ప : నిన్నుగాకపోతే ఇంకెవర్ని అడగమన్నావు.

పాన : ఏం అడక్కండి-చూస్తూఉండండి !

గుమా : మా బాధుంది. మా ఉద్యోగాలు పోతూవుంటే చూస్తూ ఉండమన్నావా ?

పాన : లేకపోతే మీకుటుంబాలు పస్తుపడుకొంటూఉంటే చూస్తూ ఊరుకుంటారా. నేను కార్ఖానాలో మన అందరికీ సరిపోయే ఆనందం తయారుచేస్తే దాన్ని ఈ అయ్యగారు దాచేసి తాళం బిగించడం చూస్తూ ఊరుకుంటారా! మీకు ధైర్యము లేకపోతే నాకైనా ఉన్నందుకు సంతోషించండి.

అప్ప : సంతోషించాం లే ! అక్కడితో ఆపు.

గుమా : నీకు అర్థంకాదు పానకాలూ. నా పెళ్ళాం పిల్లలు పస్తు పడుకోడం చూడ్డం నాకు సరదా అనుకొన్నావా ? మూడు రోజులనుంచి మా యింట్లో వంటలేదు.

అప్ప : అయ్యో అదేంటిబాబూ!

గుమా: ఏమిటంటే ఏమి చెప్పమన్నావ్! ఎటుచూసినా అప్పలవాళ్ళు!గంపెడు సంసారం ఒక్కచేతి మీదుగా గడవాలి. నెల్లాళ్ళజీతం పదిరోజులకి బొటాబొటీగా సరిపోతుంది. మూడునెల్ల ఇంటద్దెబాకీ. [illegible]వాడు ఈనెలజీతం కడుపుకు పెట్టుకున్నాడు. మా కడుపులు కొట్టాడు.

పాన : ఇకమీద ఇలాంటి బాధలుండవు.

గుమా: ఏమిటో పెర్రి. భవిష్యత్తు బాగా ఉంటుందని కలలు కనడం తప్ప మరేంలేదు. ఆశలు నంజుకొంటూ కోరికలు నమలుతూ ఎన్నాళ్ళు కడుపునింపుకోడం! అప్పలస్వామి, రెండురోజులనుంచి పచ్చి మంచినీళ్ళు తాగలేదంటే నమ్ముతావ్.

అప్ప : ఆ నిజమే !

గుమా: నిజమే అప్పలస్వామీ! కడుపున పుట్టినవాళ్ళూ కట్టుకొన్నదీ కటిక ఉపోషాలుండడంచూస్తూ మంచినీళ్ళు తాగడానికేనా మనసొప్పుతుందా అప్పలస్వామీ ?

అప్ప : అవును- మనసొప్పదు బాబూ. నాచిన్నప్పుడు మా యింట్లోకూడా ఇట్టాగే జరిగింది. మేం పస్తు పడుకోడం చూళ్ళేక మా అయ్య ఉరిపోసుకు చచ్చిపోయాడు.

గుమా: అవును. అంతకన్న ఎవరేం చెయ్యగలరు?

అప్ప : అదేవిటి బాబుగారూ! అన్నీ తెలిసిన మీరుకూడా అలా అంటారు.

గుమా: ఏం చెయ్యమంటావ్? దరిద్రం తెలివితేటల్ని చంపేస్తుంది. ఆకలి మానాభిమానాల్ని తినేస్తుంది.

పాన : ఇకమీదట్నుంచి మనలో ఎవరికీ ఆకలిదప్పులుండవ్!

అప్ప : చావే - ఇకమీద ఏమవుతుందో ఎవరిక్కావాలి. ఇప్పటి సంగతి చూసుకొందాం. బాబుగారూ ముందు మంచినీళ్ళిస్తా. కొంచెం తాగండి.

అప్పలస్వామి కూజా దగ్గరకు వెళ్తాడు
పానకాలు అటేపు భయంగా చూస్తాడు

గుమా: ఇయ్యి నాయనా, పుణ్యముంటుంది.

అప్పలస్వామి గ్లాసులో నీళ్ళు వంపుతాడు.

పాన : అప్పలస్వామీ ! (అరుస్తాడు)

అప్పలస్వామి పానకాలువేపు ఆశ్చర్యంగా చూస్తాడు.

పాన : అవి అయ్యగారి మంచినీళ్ళు.

అప్ప : నాకు తెలుసు !

పాన : అవి మరెవరూ తాగడానికి వీల్లేదు.

అప్ప : అందరూ ఒకటే నన్నావ్; అప్పుడే పరగడుపా !

పాన : లేదు–ఆనీళ్ళు ఇంకొకళ్ళు తాగకూడదు.

అప్ప : నౌఖరీలో చేరిన దగ్గరనుంచీ నాకడుపు కొడుతున్నా– అయ్యగారికి నేను ద్రోహం చెయ్యలేదు. నేనుకూడా మారానుగానీ, నువ్వు మారలేదు.

పాన : నేనెప్పుడో మారానుగానీ ఆ నీళ్ళాయన తాగడానికి వీల్లేదు.

అప్ప : ఈ పిచ్చాడితో పంటిగాని మీరు తాగండి బాబూ. (అప్పలస్వామి గుమాస్తాకి గ్లాసు అందిస్తాడు. గుమాస్తా తీసుకొంటాడు. పానకాలు భయంగా చూస్తాడు. గుమాస్తా గ్లాసు ఎత్తుతాడు. పానకాలు మరీ భయంగా చూస్తాడు. గుమాస్తా నోటిదగ్గర పెట్టుకుంటాడు)

పాన : తాగొద్దు. (అని అరుస్తాడు)

గుమా: (కొంచం ఆగి మళ్ళా నోటిదగ్గర పెట్టుకుంటాడు. పానకాలు మెరుపులాగా ఆగ్లాసును కొట్టేస్తాడు. అది క్రిందబడి బ్రద్దలవుతుంది. అందరు నిశ్చేష్టులవుతారు)

గుమా: ఏమిటి పానకాలూ, ఇది!

పాన : (తనచేతులలో మొగం దాచుకుంటాడు)

గుమా: ఎందుకు చేశావో చెప్పు. మాట్లాడవేం?

పాన : (ఏడుస్తాడు)

గుమా: ఎందుకు ఏడుస్తావ్, చెప్పు.

పాన : అవి అయ్యగారి మంచినీళ్ళు. ఆయనతప్పించి ఎవరూ తాగకూడదు.

అప్పు : వీడితో ఏముదండి? వీడికి పిచ్చెక్కింది.

పాన : అవును, నాకు పిచ్చెక్కింది. మనమంతా దరిద్రంతో ఎందుకు బాధపడాలో తెలియక పిచ్చెక్కింది. ఈ అయ్యగారి బాధ పడలేక పిచ్చెక్కింది. ఆనందాన్ని తయారుచేస్తూ అది అనుభవించలేక పోతున్నందుకూ, ఆకలితో మాడుతున్నందుకూ,—అవును నాకు పిచ్చెక్కింది. కాని నా పిచ్చితో మనబాధలన్నీ తీరిపోతై. అయ్యగారిని రానీయండి. ఆయన వచ్చాక ఏమి జరుగుతుందో చూడండి. ఆ తరువాత మన కష్టాలు గట్టెక్కుతాయ్. (దూరంగా కారు హారన్.) అదుగో కారొచ్చింది. ఆయనింక వస్తారు.

పానకాలు అయ్యగారి కుర్చీలో కూర్చుంటాడు.
అప్పలస్వామి గాజుముక్కలు ఏరుతాడు.

గుమా: పానకాలు ! ఆ కుర్చీలోంచి లే!

పాన : (లేవడు)

గుమా: చెప్తే నీక్కాదు!

పాన : నాకేం చెప్పకండి. మన ఆశలు తీరడానికింక ఆట్టే కాలం లేదు.

గుమా: సరే కానీ – ఏమవుతుందో అదే అవుతుంది. చెప్తే వింటావు కనుకనా ?

గుమాస్తా వెళ్ళి పోతాడు.

పాన : (కాళ్లుతీసి టేబిలుమీద పెడతాడు. నోట్లో బీడీ పెట్టుకొని వెలిగిస్తాడు.)

అప్ప : (చురచుర చూస్తాడు.)

పాన : ఏవిటలా కోపంగా చూస్తావు !

అప్ప : లేకపోతే గారాబంగా చూడమనా నీవుద్దేశం ?

పాన : ఇప్పుడు కాదులే ! కొంతసేపు పోయాక నువ్వే అభిమానంగా చూస్తావు !

అయ్యవారు ప్రవేశిస్తారు. పానకాలు చూసి నిర్ఘాంతపోతాడు. ఆగి

అయ్య : ఏరా ! ఏవిటది ! కళ్లు నెత్తిమీద కొచ్చాయా ?

పాన : (చెక్కు చెదరకుండా) ఎవరికి !

అయ్య : ఆ ! ఎంత పొగరు ! ఆ కుర్చీలో ఏం చేస్తున్నావు?

పాన : కూర్చున్నాను.

అయ్య : లే అక్కణ్ణుంచి.

పాన : లేవడానికి కూర్చోలేదు.

అయ్య: అప్పలస్వామి !

అప్ప : అయ్యా !

అయ్య : వాణ్ణి అక్కణ్ణుంచి యీడ్చేయ్ !

పాన : మీ తరంగాదు. నా కంఠంలో ప్రాణం పోయినా నే నిక్కణ్ణుంచి కదలను.

అయ్య: అప్పలస్వామీ !

అప్ప : అయ్యా !

అయ్య : పోలీసుల్ని పిలు !

అప్ప : అయ్యా !

పాన : పిలిపించినందుకు ఖర్చులు దండగ తప్పించి – లాభం ఉండదు.

అయ్య : (ఏం చెయ్యడానికీ తోచక) ఇంతకీ అక్కడ కూర్చోడంలో నీ ఉద్దేశ్య మేవిటి ?

పాన : అలా అడగండి చెప్తాను. ఇకమీదట్నుంచి ఇక్కడ పనిచేసే వాళ్ళలో హెచ్చు తక్కువ లుండటానికి వీల్లేదు. వింటున్నారా ! ఇకమీదట్నుంచి అంతా ఒకటే !

అయ్య : నీ మొహం ! అదెలా వీలవుతుంది.

పాన : బేషుగ్గా వీలవుతుంది.

అయ్య : వీల్లేదు. నేను డబ్బుపెట్టాను. మిమ్మల్ని పోషిస్తున్నాను. అంచేత–

పౌన : మమ్మల్ని పోషిస్తూ ఉంటే ఇంతదాకా వచ్చేది కాదు. పోషిస్తున్నట్టు నటిస్తూ మాడుస్తున్నావు. ఆర్నెల్ల కిందట జీతాలు తగ్గించావు ! మూడునెల్ల నుంచీ ఆ తగ్గించిన జీతంకూడా ఇవ్వడానికి తిప్పు తున్నావు ! ఈనెల అసలే ఎగేశావు !

అయ్య : నన్నేం చేయమన్నావు ! మార్కెట్టు పడిపోయింది. వ్యాపారం బాగులేదు.

పౌన : మార్కెట్టు పడగొట్టింది ఎవరయ్యా ! నువ్వుకాదూ?

అయ్య : అవన్నీ వ్యాపార రహస్యాలు ! నీ కెందుకూ !

పౌన : నాకు కాకపోతే మరెవడికి కావాలి ! నేను రోజూ రెండు చేతులా సరుకు తయారు చేస్తున్నానే–అది అమ్మకుండా ఎందుకు దాచేస్తున్నావు ?

అయ్య : లేకపోతే రేపొద్దుననుంచి మంచిధర రావద్దూ?

పౌన : ఇవాళున్న ధర కమ్మినా నీకు నూటికి మూడువందల రెట్లు లాభం వస్తుందిగా !

అయ్య : అది లాభమేమిటి ? ఒకటికి పదింతలు రావలసినది రాకపోతే నష్టంకాదూ ? అయినా ఈ విషయాలు నీతో నేను మాట్లాడవలసిన పనిలేదు. నేనిచ్చిన జీతంతో నే చెప్పినట్టు పనిచెయ్యాల్సిందే.

పౌన : నేను చెయ్యను !

అయ్య : చెయ్యక అడుక్కు తింటావా ?

పౌన : అడుక్కుతినే ఖర్మేం–హాయిగా బదుకుతా !

అయ్య : ఎలా బతుకుతావు !

పాన : నాచేతిలో విద్యుంది. ఆనందం తయారుచేస్తా: అనుభ వించినంత అనుభవించి మిగతాది అమ్ముకుంటా !

అయ్య : తయారు చెయ్యడానికి పెట్టుబడి నీ కెవరిస్తారు ?

పాన : ఇచ్చేవాళ్ళు కో అంటే కోటిమంది ! కోటేశ్వరరావు గారు కబురు పెట్టారు !

అయ్య : ఏవిటీ, కోటేశ్వరరావు నీకు పెట్టుబడి పెడతా నన్నాడా ! ఎంతమోసం ! వీడిమీద వ్యాపార సంఘంలో రిపోర్టిస్తా !

పాన : నువ్వు మమ్మల్ని చేస్తున్న మోసంకన్న ఎక్కువ మోసమా !

అయ్య : దాని కేంగాని ! ఏ షరతులుమీద నీకు పెట్టుబడి పెడతానన్నాడు?

పాన : అవన్నీ నీకు అనవసరం. నేనుచెప్పే షరతులకి నువ్వు ఒప్పుకుంటే నీదగ్గర నేను పనిచేస్తాను. లేకపోతే నాదారి నాది !

అయ్య : ఏవిటా షరతులు !

పాన : లాభాల్లో నాకూ; నీకూ ఆరణాలభాగాలు–తతిమ్మాది తక్కిన పనిచేసే వాళ్ళకీ !

అయ్య: వీల్లేదు !

పాన : అయితే నీదగ్గర పనిచేయడానికి నాకూ వీలుండదు.

అయ్య : ఉండుండు ! నీకు ఆరణాల వాటా ఇస్తానుగాని మరేం అడక్కు.

పాన ; తక్కినవాళ్ళ సంగతో !

అయ్య: వాళ్ళగొడవ నీకెందుకు! నీ సంగతేదో నువ్వు చూడు.

పాన : పనికిరాదు !

అయ్య: ఉండు-ఆలోచించనీ !

పాన : ఆలోచించుకోండి !

అయ్య: (పచార్లు చేస్తాడు. రెండుమూడుసార్లు పచారుచేశాక) సరే ! ఒప్పుకొన్నా ! తరవాత ప్లీడర్ని పిలిపించి కాగితాలు రాయిస్తా ! నువ్వెళ్లి పనిచెయ్ !

పాన : నా షరతు లప్పుడే అయిపోలేదు.

అయ్య: హిరణ్యాక్షవరాలు ఇంకా వున్నాయ్ !

పాన : ఇంతవరకు వచ్చిన లాభాలు ముందు పంచిపెట్టు.

అయ్య: ఆ !

పాన: అవును.

అయ్య: ఛీ ! ఆ కోటేశ్వరరావు దగ్గరకే ఛీ ! ఇలాంటి గొంతెమ్మకోర్కెలకి ఒప్పుకొని పెట్టుబడిపెట్టేవాడు శుద్ధ వెధవ ! వెళ్ళు.

పాన : సరే ! వెళతా ! (వెళుతూవుంటాడు)

అయ్య: ఆగు !

పాన : ఏం !

అయ్య: నీ కిదేమైనా బాగుందా ! ఇక మీదట లాభాలు పంచమన్నావ్ ! సరేనన్నా ! పూర్వం నేను కష్టపడి గడించినవికూడ పంచమంటే ఎలా !

పాన : నువ్వేం కష్టపడ లేదు !

అయ్య: నేను కష్టపడకపోతే అంతంత లాభాలు వస్తాయా !

పాన : అసలు నేను కష్టపడితేనేకదా నువ్వు వ్యాపార మంటూ చేయగలిగావు !

అయ్య: దీనికి ఒప్పుకుంటేనే సరిపోతుందా; ఇంకేమైనా షరతులున్నాయా ?

పాన: లేకేం ! ఉన్నాయి !

అయ్య: ఏవిటిబాబూ ! ఏవిటా షరతులు !

పాన : నేను బతికుండగా నువ్వుచచ్చిపోతే నీ లాభాలు నీ కొడుక్కి చెందగూడదు !

అయ్య: ఆ ! ఏమిటీ ! అప్పలస్వామి !

అప్ప : అయ్యా !

అయ్య: కొంచెం మంచినీళ్ళివ్వు.

అప్ప : అయ్యా !

అయ్య: (ముఖంమీద చెమట తుడుచుకుంటాడు.)

అప్ప : మన్నించాలి బాబయ్యా! గళాసువిరిగిపోయింది. ఇంకో కటి పట్టుకొస్తా. (వెళ్ళుతాడు.)

పాన : (అప్పలస్వామి వెళ్లాక) పొరబాటైంది. నాదేతప్పు.

అయ్య: ఏవిటాతప్పు !

పాన : ఆ గళాసు నేనే విరగ్గొట్టా !

అయ్య: గళాసేవిటి ? నా వ్యాపారాన్నే విరగ్గొట్టేస్తున్నావ్!

పాన : ఇందులో మాత్రం నా తప్పేంలేదు. నువ్వే విర గ్గొట్టుకొంటున్నావ్ ! మించిపోయిం దేం లేదు ! నా షరతుల కొప్పుకో—నీ వ్యాపారం సాగుతుంది.

అయ్య: నా కంఠంలో ప్రాణం ఉండగానా ! చచ్చినా ఒప్పు కోను.

పాన : అయితే చావ్ ! నువ్వు ఒప్పుకోవని నాకు ముందే తెలుసును !

అయ్య: వెళ్ళు-ఇక్కణ్ణుంచి వెళ్ళు !

పాన : (వెళుతూ ఆగి) మంచిసీళ్ళు కావాలన్నావ్‌గా ! ఆ కూజాలోవి తాగు !

అయ్య: నువ్వు నాకేం సలహా యివ్వనక్కర్లేదు. అంత అవ సరమైతే నేనే తాగ్గలను.

పాన: అవసరమే లే తాగు !

అయ్యగారు కూజా దగ్గిరకి వెళ్తాడు; బాబాజీగారు ప్రవేశిస్తారు.

బాబాజీగారు: రాధేశ్యాం ! రాధేశ్యాం !

అయ్య: దండాలు బాబాజీగారూ, దండాలు !

బాబా: కృష్ణార్పణమస్తు !

అయ్య: (కూజా మళ్ళీపెట్టేసి) నమస్తే గురూజీ !

బాబా: ధనకనకవస్తువాహనాది ఐశ్వర్యప్రాప్తిరస్తు. అదేం నాయనా ! అలావున్నావు ?

అయ్య: ఏం చెప్పమంటారు గురూజీ ! పొద్దున్నే లేచి యెవరి ముఖం చూశానో గానీ—

బాబా: అదేమిటి నాయనా! పొద్దున్నే లేవగానే మా ఫోటోని చూడమన్నానుగా—చూడ్డం లేదా!

అయ్య: చూస్తున్నాను గురూజీ!

బాబా: అయితే విచార మెందుకు నాయనా! నీకేం భయం వుండదు.

అయ్య: ఈ పానకాలు నన్ను బతికుండగానే చంపేస్తున్నాడు.

బాబా: రాధేశ్యాం! రాధేశ్యాం! (పానకాలుతో) నిజ మేనా నాయనా?

పాన: నిజమేనండి, బాబాజీగారూ!

బాబా: ఏ విధంగా నాయనా?

అయ్య: లాభాల్లో తనకి అరణాల వాటా యిమ్మన్నాడు. ఇస్తానన్నాను. అక్కడితో సంతృప్తిపడాలా—లేదా? తక్కిన పనివాళ్లకి పావలా వాటా యివ్వమన్నాడు. పోసీ దానికీ వప్పుకున్నా.

బాబా: రాధేశ్యాం! రాధేశ్యాం! మా మఠం సంగతి యిద్దరూ మరచిపొయ్యారన్నమాట.

పాన: లేదు బాబాజీ గారూ! మీ సంగతి నేను మరచిపో తానా? కావలిస్తే నా అరణాల వాటాలో మఠానికి సగం యిచ్చేస్తా.

బాబా: కృష్ణార్పణమస్తు! సరే—యిద్దరూ ఆ షరతులకు వప్పుకుంటే ఇంక జగడ మెందుకు?

అయ్య: అంతటితో వూరుకుంటాడా? ఇంకా చచ్చినన్ని షరతులు పెట్టాడు. పాతలాభాలుకూడా పంచాలట.

నేను చస్తే నా లాభాలు నా కొడుక్కి చెందకూడ దట. ఏమైనా బాగుందా ?

బాబా: అజ్ఞానం ! అజ్ఞానం ! వర్గకలహం అజ్ఞానం. నాయ నా!పానకాలూ ! యజమానులూ, పనివాళ్లు యిలా దెబ్బలాడుకోవచ్చా ? మీలో మీరు సామరస్యంగా ఉండాలి. నైతికపునరుద్ధరణ మనకి ముఖ్యం. నేను చెప్పినట్టు మీరు వింటారా ?

పాన : చిత్తం - బాబాజీగారూ ! మీరేంచెస్తే అది వింటా! ఇంతకు ముందల్లా మీరు చెప్పినట్లు నడుచుకో లేదాండీ ?

బాబా: నాకు తెలుసు నాయనా ! నువ్వు బుద్ధిమంతుడివి ! ఏమయ్యా ! తండ్రీ ! నువ్వుకూడా నే చెప్పినట్టు వింటావా ?

అయ్య: చెప్పండి-వింటాను.

బాబా: అయితే సరే ! నాయనా ! పానకాలూ; వువ్వు కొంచెంసేపు ఆవలవుండు. నేను నీ తరఫున న్యాయ న్ని వప్పిస్తా ! (పానకాలు కొంచెం అనుమానంగా చూస్తూ నిలబడిపోతాడు.)

బాబా: ఏం నాయనా ! నాయందు నీకు నమ్మకం లేదూ?

పాన : ఎంతమాటన్నారండీ బాబాజీగారూ ! మీలో నాకు నమ్మకం లేకపోవడమేమిటండీ ? (వెళ్తాడు)

బాబా: రాధేశ్యాం ! రాధేశ్యాం !

అయ్య: అమ్మయ్య !

బా బా: ఈ కూలి వెనవకింత ధైర్యంఎక్కణ్ణుంచివచ్చింది. చెప్మా!

అయ్య: మీరు నిద్రపోతూవుంటే రాకేం చేస్తుంది.

బాబా: ఆ!

అయ్య: అవునుమరి - మీరు వీళ్ళలాంటివాళ్ళను భయ భక్తులతో అట్టేపెడతారని ఎక్కడలేని డబ్బాబ మీ ముఖాన కొడుతున్నా. మీరు నిద్రపోతూవుంటే వీడు ధైర్యం చెయ్యడా యేం?

బాబా: అయితే నాపని నేను చెయ్యటంలేదనా నీతాత్పర్యం.

అయ్య: కాక, మీరు మీ పనిచేస్తూవుంటే - వీడు మరొ కళ్ళ చెప్పుడుమాటలువిని ఎందుకింత తెలుగుగుమీరి పోతాడు?

బాబా: ఇప్పుడేనా మించిపోయింది లేదు. నేను సర్ది పెడతా! ఇంతకీ ఎవరి అండ చూసుకొని వీడింత తెగించాడు?

అయ్య: ఆ కోటేశ్వరరావు వీడికి మదుపు పెడతానన్నా డట. ఆ ఆసరా చూసుకొని వీడు నన్ను బెదిరిస్తు న్నాడు.

బాబా: అలాగా! (ఆలోచిస్తాడు)

అయ్య: ఏమి టాలోచేస్తున్నారు?

బాబా: (మాట్లాడడు)

అయ్యవారు కూజా దగ్గరికి వెడతారు. ఎత్తబోయేసరికి అప్పలస్వామిప్రవేశించి ఆగిపోతాడు. వీళ్ళుమాడరు.

బాబా: ఆం— సరైన మార్గం దొరికింది! వీడు యెప్పటిలాగే కిక్కురు మనకుండా నీదగ్గర పనిచేసేట్టు చేస్తా—మఠానికెంత సమర్పించుకుంటావ్ ?

అయ్య: మామూలుగా యిచ్చేది యిచ్చుకుంటా.

బాబా: ఇది మామూలు సమస్యకాదు.

అయ్య: మరెంత కావాలీ ?

బాబా: మామూలుగా యిచ్చేదానికి పదింతలు.

అయ్య: అమ్మో అంతే! ఆశ కంతుండాలి గురూజీ! రెట్టింపు తీసుకోండి.

బాబా: లాభంలేదు. పదింతలకి దమ్మిడీ తక్కువలేదు.

అయ్య: సరే. అలాగే కానివ్వండి.

బాబా: ముందు చెక్కు రాసివ్వు !

అయ్య: (విధిలేక రాస్తాడు)

బాబా: నువ్వు కొద్దిసేపు అవతలవుండి పానకాల్ని పంపించు. నేను అన్నివిషయాలు మాట్లాడుతా !

అయ్యవారు చెక్కు యిస్తాడు.

బాబా: కృష్ణార్పణమస్తు.

అయ్యవారు నిష్క్రమిస్తాడు. అప్పలస్వామి ప్రవేశిస్తాడు.

బాబా: ఎవరూ ? పానకాలూ !

అప్ప: నేనండీ—అప్పలస్వామిని!

బాబా: ఏం నాయనా ! మఠానికిరావడం మానేశావు?

అప్ప: చావడానికికూడా తీరుబాటు లేదు. ఏం చెయ్యమన్నారు గురూ !

బాబా: రాధేశ్యాం! రాధేశ్యాం! భగవన్నామస్మరణ చెయ్యడానికి తీసుబాటెందుకు నాయనా! మనస్సులో స్మరిస్తే మతానికి రానక్కర్లేదు. పోనీ మనస్సులో స్మరించుకొంటున్నావా?

అప్ప : చిత్తం - మనస్సులో యెప్పుడూ అనుకుంటూనే వుంటానండీ!

బాబా: మంచిది! చాలా మంచిది.

పాన : (ప్రవేశించి) ఏం సెలవు బాబాజీగారూ!

బాబా: చూడు నాయనా, పానకాలూ! నువ్వు చాలా తొందరపడ్డావు.

పాన : ఎలా బాబాజీగారూ?

బాబా: చెప్తా-యీ కోటేశ్వరరావుకూడా వ్యాపారస్తుడేనా?

పాన : చిత్తం!

బాబా: వ్యాపారస్థుడనగానే-వాడికి లాభాలేకద ముఖ్యం.

పాన : చిత్తం!

బాబా: నీవల్ల తనకి లాభం వుంటుందనేకదా, కోటేశ్వరరావు నిన్ను రమ్మన్నాడు.

పాన : అవునండి.

బాబా: కానీ అతడికి లాభం వుండదు.

పాన : అదెట్లా బాబాజీగారూ?

బాబా: తొందరపడకు చెప్తా — నువ్వు కంపెనీలో ఏం చేస్తున్నావ్?

పాన : ఆనందం తయారు చేస్తున్నా.

బాబా: ఈ సంగతి ఎంతమందికి తెలుసు.

పాన : శానామందికి తెలుసేమో !

బాబా: లేదు–చాలా కొద్దిమందికే తెలుసు. ఈ కంపెనీ వాళ్ళు ఆనందం తయారుచేస్తున్నారని లోకానికి తెలుసు. కాని, కంపెనీలో పానకాలు చేస్తాడో, అప్పలస్వామి చేస్తాడో, వెంకన్న చేస్తాడో, ఫుల్లయ్య చేస్తాడో లోకానికి అక్కర్లేదు. ఏం–ఏమంటావు ?

పాన : ఏమో బాబాజీగారూ !

బాబా: కోటేశ్వర్రావు నిన్ను పిలిచాడంటే యెందుకో తెలుసా! తనకి లాభంలేకపోయినా మీ అయ్యగారికి నష్టం కలిగించడానికి – కానీ అక్కడే పొరబడ్డాడు. మీ అయ్యగారికి నష్టంరాదు.

పాన : ఎందుకు రాదండీ–నేను యింకో కంపెనీలో ఆనందం చేసి చవగ్గా అమ్మితే అయ్యగారికి తప్పకుండా నష్టం వస్తుంది.

బాబా: పొరబడుతున్నావు నాయనా – పొరబడుతున్నావు. మన మతంలో దేవుడు మోక్షం యిస్తాడంటే నువ్వు ప్రార్థిస్తున్నావు. తక్కిన మతాలలోకూడా ఆ మోక్షమే యిస్తాడన్నా యితర మతాల దేవుళ్ళని నువ్వు ప్రార్థిస్తున్నావా ?

పాన : లేదు.

బాబా అలాగే, యీ కంపెనీవాళ్ళ ఆనందానికి అలవాటు పడ్డ వాళ్ళు ఇకొక కంపెనీవాళ్ళ ఔషధాన్ని నమ్ముతారా? నమ్మరు?

పాన : కానీ నేనువెళ్ళిపొయ్యాక అయ్యగారిదగ్గర ఆనందం ఎవరు తయారు చేస్తారు? చిట్కా- నా వొక్కడికే తెలుసు.

బా బా: భ్రమ ! మీ అయ్యగారు ఆనందం అని సీసాలలో మంచినీళ్ళుపోసి అమ్మినా లోకింకొంటుంది. కంపెనీ ముఖ్యం నాయనా !

పాన : ఆ !

బా బా: అవును తండ్రీ ! కోటేశ్వరరావుకీ మీ అయ్యగారికీ విరోధంవుంది గాబట్టి యీరా విగంగా పగదీర్చుకుందా మనుకున్నాడు. కానీ లాభం లేదు.

పాన : అంతేనా ?

బా బా: అవును. కానీ పాపం కోటేశ్వరావుకి తను వేసిన పథకం పారదని తెలియలేదు.

పాన : ఏమో బాబాజీగారూ ! ఆయన నాకు సమానంగా వాటా యిస్తానన్నారు. రమ్మన్నారు.

బా బా: నష్టాలొస్తాయని అతనికి తెలుసు. అందులో సమానంగా వాటా యిస్తానన్నాడు కాబోలు ! ఆనందానికికూడా ఇప్పుడు మించిపోయింది.

పాన : అదేమిటి బాబాజీగారూ !

బాబా: అవును నాయనా ! కోటేశ్వరరావు గంటక్రిందట చచ్చిపొయ్యాడు.

పాన : ఆ !—ఇప్పుడు నా గతేంకాను బాబాజీగారూ !

బా బా: రాధేశ్యాం. రాధేశ్యాం.

పాన : చెప్పండి బాబాజీగారూ. నాకు దిక్కేవిటో చెప్పు!

బాబా: నాకాళ్ళు పట్టుకొన్నట్టే మీ అయ్యగారి కాళ్ళు పట్టుకో. అదే దిక్కు !– అప్పలస్వామీ !

అప్ప : గురూ !

బాబా: కొంచెం మంచితీర్థం ఇయ్యి నాయనా !

అప్ప : చిత్తం.

పాన : (భయంగా) బాబాజీగారూ !

బాబా: భయపడకు నాయనా !

పాన : అదికాదు బాబాజీగారూ ! అప్పలస్వామి వద్దు ! బాబాజీగారు, నేను వేరే నీళ్ళు తీసుకొస్తా. అవి తాగండి (వెళ్తాడు.)

బాబా: పిచ్చితండ్రి ! ఏ నీళ్లైతే నేం! అప్పలస్వామి, మంచి తీర్థం ఇయ్యి !

అప్ప : చిత్తం. (ఇస్తాడు.)

బాబా: రాధేశ్యాం ! రాధేశ్యాం ! (తాగుతాడు)

బాబా: మీ అయ్యగారు అడిగితే కోటేశ్వర్రావుతోపనుండి వెళ్ళానని చెప్పు !

అప్ప : చిత్తం !

బాబాజీగారు వెళ్ళిపోతాడు
అప్పలస్వామి గ్లాసు కడుగుతాడు
పానకాలు ప్రవేశిస్తాడు

పాన : ఏరీ, బాబా గా రేరీ ! అప్పలస్వామీ – బాబాజీగా రెక్కడ !

అప్ప : వెళ్ళిపొయ్యారు !

పాన : మంచినీళ్ళు తీసుకొచ్చానే!

అప్ప : నేనిచ్చా-తాగి వెళ్ళారు.

పాన : ఆ మంచినీళ్ళిచ్చావా ! ఆ కూజాలోవే !

అప్ప: ఇంకొక కూజా ఇక్కడ లేదు.

పాన : ఎంత పనైంది ! ఎంత పనైంది ! నే నివ్వొద్దన్నానుగా !

అప్ప: ఏమిటా కంగారు !

పాన : నీకు తెలియ దప్పలస్వామీ ! నేను పాపిష్టాణ్ణి. చేతులారా బాబాజీగార్ని చంపేశాను. అటువంటి మంచి వార్ని అన్యాయంగా చంపేశాను. ఇంక నా బతుకెందుకు ?

కూజా తీసుకొని గడగడ తాగేస్తాడు.

పాన : (సోఫాలోపడి) అప్పలస్వామీ ! ఇంక నేను బతకను.

అప్ప: ఏవిటి పానకాలు-ఏవిటిది !

పాన : అప్పలస్వామీ ! నాకో మాటిస్తావా ? నాపెళ్ళాం బిడ్డలకు దిక్కులేదు. పాపం ! వాళ్ళను ఓకంట కనిపెడుతూ ఉండు !

అప్ప: అసలు సంగతేవిటి ?

పాన : అయ్యగార్ని చంపేద్దామని ఆ కూజాలో విషం కలిపాను. అయ్యగారు కాకుండా బాబాజీగారు ఆ నీళ్ళు తాగారు.

అప్ప: విషమూ!!

పాన : అవును అప్పలస్వామీ! పాపిష్టాణ్ణి-విషం కలిపాను.

అప్ప: ఎప్పుడు?

పాన : పొద్దున్నే-నివ్వింకా కచేరీకి రాకముందు. నేను తవ్వుకొన్న గోతిలో నేనే పడ్డా!

అప్ప: ఓరి పిచ్చివాడా! భయపడకు! కచేరీకి రాగానే పాచి నీళ్లు పారబోసి కొత్తనీళ్ళు పెట్టా!

పాన : (దిగ్గునలేచి) నిజంగా! అయితే బాబాజీగారు చచ్చిపోలేదన్నమాట!

అప్ప : ఆయనెందుకు చస్తాడూ! చావకుండా బతికున్న కోటేశ్వర్రావుతో మాట్టాడటానికి వెళ్ళాడు.

పాన : ఆ! కోటేశ్వర్రావు యింకా బ్రతికేఉన్నాడా?

—: తెర :—

పాత్రలు :

రక్షకభటుడు
కుర్రాడు
న్యాయవాది
గుమాస్తా
ప్రాసిక్యూటరు
జడ్జి
బంట్రోతు
దానయ్య
శ్రీమంతుడు
శాసనసభ్యుడు
కార్మికుడు
శాస్త్రజ్ఞుడు
కవి

---

# దేవుని ఎదుట

రంగం ఏ కాలానిదో చెప్పేందుకు వీలులేనిదిగా అలంకరించ బడింది. ప్రేక్షకులకు ఎదురుగా రంగం మధ్య ఉన్న తాసనం సింహాసనం మాదిరిగా వుంది. జానపద చిత్రాలలో మాదిరి దర్బారును స్ఫురింపచేస్తుంది. కాని సింహాసనానికి కుడిప్రక్క ఒక చిన్న టేబుల్‌పై కర్ర సుత్తి, తాళ్ళతక్కెడ ఉన్నాయి. రంగస్థలానికి ఎడమవైపు ఒక వేదికవుంది. అది కోర్టు బోను అనుకోడానికి వీలు లేనట్లు కటకటాలు సగం విరిగిపోయాయి. ఆ వేదిక ముందు, క్రింద, బజారులో మనిషి తూకంతూచుకునే యంత్రం వుంది. ఎడమప్రక్క గోడనానుకొని ఒక పెద్ద యినుప పంజరం వుంది. అందులో ఒక వ్యక్తి బంధింపబడ్డాడు. అతనికి కాళ్ళకి గంతలు, చేతులకి బేడీలు, నోటికి తాళం వున్నాయి. రంగస్థలంమధ్య ఒక బడి కుర్రాడు కోదండం వేలాడుతూ వుంటాడు. సింహాసనం ముందు నేలమీద గుమాస్తాల డెస్కుబల్ల, చిరిచాప వుంటాయి, వీటినుండు ఒక మేజాకి రెండుప్రక్కలా, రెండు కుర్చీలుంటాయి. పంజరం దగ్గర ఒక రక్షక భటుడు వుంటాడు. చారిత్రక చిత్రాలలోమాదిరి కవచం, అధునాతన పద్ధతులలో యినుపబూట్లు, తలకి ఎర్రటోపి, భుజాన గద, తాళ్ళతో కట్టిన బుగ్గ మీసాలు.

తెర ఎత్తాక యీ ముగ్గురూ తప్ప ఎవ్వరూ కనిపించరు. రక్షక భటుడు ఆవలించి రెండు మూడుసార్లు అటూ యిటూ పచార్లు చేస్తాడు. వేదికదగ్గరకువచ్చి తూకం యంత్రంమీద నిలుచుంటాడు. రెండవవైపునుంచి దిగి సింహాసనం దగ్గరికి వస్తాడు. ముందు డెస్కు బల్లమీదవున్న బొతుకలం తీస్తాడు. దానితో గాలిలో ఏదో వ్రాసి మళ్ళా అక్కడే పెట్టాడు. పంజరం దగ్గరకొచ్చి లోపలికి తొంగి

చూస్తాడు. మళ్ళీ బయలుదేరిన చోటకేవచ్చి నిలబడి గద భుజంమార్చి మీసం మెలివేసి 'హుషార్! హాహాహుషార్' అని కేకవేస్తాడు. కోదండం తీయబడిన కుర్రవాడు "ఎయ్ నోర్మోయ్" అని అరుస్తాడు. రక్షకభటుడు కుర్రాడిదగ్గరకు వస్తాడు.

  

రక్షకభటుడు: ఏం అబ్బాయ్! బాధగావుందా?

కుర్రాడు: ఛప్ నోర్మూయ్!

ర. భ: ఒళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడు.

కు: కళ్ళు నెత్తిమీద కొచ్చాయ్!

ర. భ: పళ్లు రాలగొడతా.

కు: పీడా పోయె-కానీ!

ర. భ: ఏయ్ నాలుగు తగలాలా ఏం?

కు: నాదగ్గరకు వచ్చావ్వా, నీ పుచ్చె ఎగురుతుంది జాగ్రత్త!

ర. భ: చూస్తా.

కు: కానీ!

రక్షకభటుడు దగ్గరకువస్తాడు - కుర్రాడు ఏమిచేస్తాడు అనే ధీమాతో. కుర్రాడు ఏమీచేయలేదు. రక్షకభటుడు మరీదగ్గరకువచ్చి అరికాలులో గిలిగింతలు పెట్టాడు, 'కితకితకితకిత గిలిగింతా' అని. కుర్రాడు కాళ్ళతో రక్షకభటుడి కడుపులో తంతాడు. రక్షకభటుడు 'అమ్మో' అని వైకొలగుతాడు.

ర. భ: తల్లుముండమొయ్యా! ఏం వూపుగా తన్నావ్.

కు: ముందే చెప్తే విన్నావా?

ర. భ: అబ్బాయీ! నీకూ నాకూ దెబ్బలాట ఎందుకూ? ఇక్కడవున్నదే యిద్దరం. ఏదోపిచ్చాపాటీ మాట్లాడు కొందాం. నిన్ను దింపుతా (దింపుతాడు.)

కు: దింపు కాని, నాతో ఏమీ మాట్లాడక్కర్లా. వాడితో మాట్లాడు. (పంజరంలో మనిషిని చూపుతాడు)

ర. భ: (వికటంగా నవ్వుతాడు) యీడితోటా? యీడి తోటా? (మళ్ళీ నవ్వుతాడు.)

కు: ఏం, అతనుమట్టుకు మనిషి కాదూ?

ర. భ: యీడు మనిషేంటి?

కు : ఎందు కాకూడదూ?

ర.భ : చేతికి బేడీలు, నోటికి తాళం, కళ్ళకి గంతలూ, ఇంకా యీడు మనిషేంటి?

కు : చెవుల్లో దూది పెట్టలేదుగదా? మాట్లాడు! వింటాడు.

ర. భ: ఓరి కుర్రసన్నాసీ! మాటకిమాట బదులు చెప్ప నోడితో మాటాడి ఏం లాభం?

కు : అసలు నువ్వెందుకు మాట్లాడాలి?

ర. భ: నువ్వ గాలెందుకు పీల్చాలి?

కు : నువ్వ నాతో మాట్లాడగూడదు తెలుసా?

ర. భ: నా డ్యూటీ నాకు తెలుసులే.

కు : అయితే ఎందుకు మాట్లాడుతున్నావ్?

ర. భ: ఎవరు చూశారులే.

కు : అసలు నువ్వెందుకు మాట్లాడాలీ అంటా?

ర. భ: నేను నీ బాబుని.

కు : అబద్ధం – నాకు తండ్రి లేదు.

ర. భ: నాకు కొడుకూ లేడనుకో.

కు : మరి అయితే నువ్వు... ...

ర. భ: ప్రతీ పెద్దాడికో కొడుకుండాలి; ప్రతీ చిన్నాడికో బాబుండాలి. నీకు బాబూ లేడు; నాకు కొడుకూ లేడు. కాబట్టి నువ్వు నా కొడుకువి; నేను నీ బాబుని.

కు : నీ కొడుకు నవడానికి నాకు ఇష్టంలేదు.

ర. భ: యిలా కోదండం వేలాడ్డం నీ కిష్టమా ఏంటి?

కు : ఓ నాకిష్టమే!

ర. భ: అదేంటి?

కు : భూమిమీద నించోడం కన్నా యిదే బాగుంది. గాలిలో చక్కగా వూగొచ్చు, ఈదొచ్చు.

ర. భ: నీ కర్మం:

కు : నాతో మాట్లాడేవని తెలిస్తే నీకేమి శిక్ష వేస్తారు?

ర. భ: కోదండం తీయిస్తారు.

కు : అయితే నేను ఫిర్యాదు చేస్తాను.

ర. భ: ఆ ఆ ఆ...నీ పుణ్యముంటుంది చెప్పకు.

కు : చెప్తా... చెప్తా— అధికార్లు రానీ.

ర. భ: ఒద్దొద్దు నాబాబువు గదూ.

కు : కోదండం తీస్తే ఎంత ధుమాగా వుంటుందను కొన్నావ్?

ర. భ: నాయ న్నాయనా! నాకు భయమేస్తుంది.

కు : భయమెందుకూ?

ర. భ: కాలికింద భూమి లేకపోతే భయమేయదూ?

కు : నాకు వెయ్యాదేం మరి?

ర. భ: నాకు తెలీదు. (సైకిల్ గంట వినబడుతుంది)

ర. భ: ఎవరో వస్తున్నారు.

కు : రానీ. చెప్తాను;

ర. భ: చెప్పకు.

కు : చెప్తాను.

ర. భ: మహా బెదిరిస్తున్నావ్! చెప్పుకో నీ మాట ఎవరు నమ్ముతారు. (తాడు పైకి లాగుతాడు)

కు : నీమాటేనా నమ్ముతారు?

ర. భ: ఆ! మరి కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, ... ఇప్పటివాడినా? నా సర్వీసు నాలుగు యుగాలది. నామాట నమ్మరా మరీ. అయినా సాక్షు లేరీ?

కు : అడుగో. అతడు చెప్తాడు.

పంజరంలో మనిషి చేడీలచేత్తో పంజరాన్ని వూపుతాడు.

కు : సాక్ష్యం చెప్తాడు. ఒప్పుకోన్నావు. జాగ్రత.

న్యాయవాది ప్రవేశిస్తాడు 20 వ శతాబ్దపు దుస్తులు.

న్యాయవాది: ఒప్పుకున్నావూ? అమ్మయ్య !

కు : ఏమిటి. ఒప్పుకోడం ఏమిటి?

న్యా : నేరం చేసినట్టు ఒప్పుకోవూ?

కు : నే నొప్పుకోను.

న్యా : ఒప్పుకో. నామాట వినూ.

కు : అదేమిటి? మీరు నాతరఫున వకీలుకరూ?

నా : నీ తరఫు వకీల్నే.

కు : అయితే నన్ను ఒప్పుకోమంటారేం?

న్యా : అవును, ఒప్పుకో. నేరంచేశానని ముందు ఒప్పుకుంటే ఆ తర్వాత నేను నువ్వు నేరం చేయలేదని వాదిస్తా.

కు : ఏమిటీ వింత పద్ధతి?

న్యా : అంతే. ముద్దాయి నేరం ఎలాచేశాడో తెలిస్తే,అలా చేయలేదని వాదించవచ్చు.

కు : మీకో దండం. మీరు నాతరఫున వాదించక్కర లేదు.

న్యా: వీల్లేదు. భూమి పుట్టినప్పటినుంచీ ప్రతి విషయానికి ఎడాపెడా వున్నాయ్. వాద ప్రతివాదనలు యీ కోర్టు రివాజు. నువ్వు వద్దన్నా నేను వాదించి తీరాలి. దేవుడు నాకు తిండి కల్పిస్తున్నాడు కాబట్టి వాదించి తీరుతాను.

గుమాస్తా ప్రవేశిస్తాడు. నీరుకావి పంచె, ముతకఖద్దరులాల్చీ, చారల కోటు,కాళ్ళకిబూట్సు పిలకకి పువ్వు-రూపాయికాసంత కుంకంబొట్టు.

గుమాస్తా: దాశరథీ కరుణాపయోనిధీ-నీ తస్సాదియ్యా! ఏమయితేనేం, యింకో రోజుకూడా మా ప్రాణాల మీదికి తెచ్చావ్. సరే నీదయ యిలా తగలాడ్డాది.

న్యా : ఏమిటి? గుమాస్తాగారూ దేవుణ్ణి తిడుతున్నారు!

గు ; తిడతానా, తిట్టి పోపెడతానా. లోకంలో మంచి వుద్యోగాలన్నీ అందరికీ పంచిపెట్టి యీ గుమాస్తా గిరీ నాకంటగడతాడా! వీణ్ణేం చేస్తే పాపంవుందీ?

న్యా : జాగ్రత్తండోయ్. మీ తిట్లన్నీ స్వర్గంలో వినబడితే ప్రమాదం.

గు : సింగినాదం - ఏమిటా ప్రమాదం ? మహా తీసేస్తే ప్రాణాలు తీసేస్తారు. నేనుకోరేదీ అదే. నేను కోరు తున్నాను గాబట్టి అది చెయ్యకుండా యీ వుద్యోగం తీసేస్తాడూ! మరీ మంచిది. ఈ రెండిటికన్నా వాడి మొహం వాడేమిచేస్తాడు.

ర.భ : ఏంటండోయ్, మాటలు మా జోరుగా ఒదులుతు న్నారు. మీరుకాబట్టి వూరుకొన్నా మరోడు దేవుణ్ణి తిడితే ఎంటనే బేడీలు ఏసేస్తా ఏటనుకొన్నారో.

గు : ఏడిశావు పోవోయ్. మన తిట్లువిని నన్ను పుట్టించిన జేజెమ్మే ఏమీ చేయలేదు. ఇహ నువ్వు చేసేదేమిటీ మట్టిగడ్డలు.

ర.భ : ఏంచేస్తానో చేతికి బేడీలు పడ్డాక తెలుస్తాది.

గు : బేడీలు వేస్తావూ ? బే-డీ-లు. వెయ్యి. దమ్ములుంటే వెయ్యి.

కు : ఇదిగో నా ఒళ్ళు హూనమవుతోంది. దించండి.

గు : ఏమిట్రా కక్రసన్నాసి. నీ ఏడుపేమిటీ ?

కు : బాధగా వుంది. కిందకి దించండి.

ర.భ : యీల్లేదు,

కు : మరి యిందాక దించావే ?

గు : ఏవిటీ...! ఏవిటీ...! ఇందాక నిన్ను కిందికి దించాడూ !

కు : అవును; దించాడు.

గు : ఖరాఖండీగా, ఖచ్చితంగా డ్యూటీచేసే పోలీసువాణ్ణి హద్దుమీరేడూ ? బావుంది. మా బావుంది. (రక్షక భటుడితో) నాయనా ! ఆ గద పారేసి టోపీ ఆ దేవుడికే పెట్టి శెలవు పుచ్చుకో. కటిక పాషాణం లాగుండ వలసిన నీ గుండె కరగడం మొదలెడితే యీ దేవుడిగారి రాజ్యం అష్టేకాలంవుండదు.

ప్రాసిక్యూటరు ప్రవేశిస్తాడు. ఇరవయ్యో శతాబ్దపు దుస్తులు.

ప్రాసిక్యూటరు: ఏమిటి మాంవగారూ! దేవుణ్ణిదీవిస్తున్నారు.

గు : ఆ ! ఏమీలేదు నాయనా ! మన పోలీసు వెంకట స్వామి...

ర.భ : బాబ్బాబు మీ కొక దండం.

ప్రా : ఏమి టేమిటి... ఏమైనా నేరం గాని చేశాడా ? చెప్పండి. చెప్పండి. పోలీసు వాణ్ణి ప్రాసిక్యూటు చేసి చాలా కాలమయింది.

గు : అబ్బే ! ఏం లేదు. ఈ కుమ్రనాగమ్మనీ... కిందికి దించాడట.

ప్రా : ఆ ! స్వామిద్రోహం. సెక్షన్ ఆరువేల నాలుగు వందల యాభై రెండు. డ్యూటీలో పోలీసువాడు

ముద్దాయిమీద కరుణ చూపెట్టడం కల్పబుల్ హోమిసైడ్ కన్న హెచ్చు నేరం.
(న్యాయవాదితో) ఏం భాయీ సాహెబ్?... అంతేనా?... ఉంతేనా? ఏం మాట్లాడరూ.

న్యా : ఆ. ఏమంటారూ ?

ప్రా : పోలీసువాడు ముద్దాయిమీద కరుణ చూపెట్టడం నేరం కదా ?

న్యా : అబ్బే...

ప్రా : పక్షపాతం మానేసి చెప్పండి. ఏమిటి మళ్లా ఆలోచిస్తున్నారు ? ఆ బోధపడ్డది...ఈ నేరం విచారణకొస్తే ఎలాగ సమర్థించి, ముద్దాయి తరఫున వాదించాలో ఆలోచిస్తున్నారు. అంతేగదూ ?

గు : కొంపదీసి పోలీసువాడ్ని గూడా బోను ఎక్కిస్తారా ఏమిటి ?

ప్రా : ఎక్కిస్తానా, ఎక్కించి చూపెడ్తానా. న్యాయం న్యాయమే, నేరం నేరమే.

ర.భ : అయితే యీ గుమాస్తాగార్ని కూడా ఎక్కించండి. ఈయనగారి నోటికి మరీ హద్దులేకుండా పోతూంది. దేవుడిగార్ని ఒకటే తిట్టడం.

గు : ఇదుగో వెంకటస్వామీం ! యీ కుళ్ళుమోత్తనమే వద్దంటా. నీమీంద కేసువస్తున్నదని ఏడుపు గాని, నా మీంద పెట్టలేదని ఏడుపెందుకూ ?

ప్రా : అవసరమొస్తే గుమాస్తాగారిమీద కూడా కేసు పెడతా. ఏమండీ గుమాస్తాగారూ? వెంకటస్వామి కేసులో మీరు సాక్ష్యమివ్వాలి. చెప్పండి. రాసుకుంటా. మీరు, పోలీసు వెంకటస్వామి, ముద్దాయి తరతరాల విద్యార్థిని కోదండం వేలాడుతుండగా కిందికి దింపడం చూశారుగదూ?

గు : నేను చూడలేదు.

ప్రా : మొహమాట పడకండి. చెప్పండి.

గు : మొర్రో నేను చూడలేదంటే..

ప్రా : ఇదుగో, మర్యాదగా చెప్తేచెప్పారు. లేకపోతే... సాక్ష్యం యివ్వడంలో సర్కారు వారితో సహాయ నిరాకరణ చేస్తూవున్నందుకు మీ మీద కేసు పెడతా.

గు : నేను చూడలేదు. ఈ కుర్రాడు చెప్పగా విన్నాను. ఆ మాట కావల్సివస్తే రాసుకోండి. అలా సాక్ష్యం చెప్తాను.

ప్రా : (ఆలోచించి) మీరు పి డబ్ల్యు రెండు అవుతారు. వెంకటస్వామీ, యీ అబ్బాయిని దించు. ఇతనిని నీ మీద పి డబ్ల్యు ఒకటిగా నేను వేసుకుంటా.

ర.భ : మరి యిప్పుడు మీరు దింపిస్తున్నారు. ఇది నేరం కాదా ఏం?

ప్రా : ఇది నేరంకాదు. ఒక ఆసామి నేరస్థుడని రుజువు చెయ్యడంలో సర్కారువారికి తోడ్పడుచున్నాడు. దించు.

ర.భ : దిగరా బాబూ, దిగు.

గు : దిగు! దిగు! నాగన్న — దివ్యసుందరనాగ! నీదే అదృష్టం పో.

ప్రా : ఏం అబ్బాయ్, నిన్ను పోలీసు వెంకటసామి దింపాడా.

కు : దింపాడు.

ప్రా : ఎందుకు దింపాడూ?

కు : మీరు దింపమన్నారు గాబట్టి.

ప్రా : ఇప్పుడు గాదు, మొదటిసారి.

కు : ఓ అప్పుడా! అప్పుడునాతో బాతాఖానీకొడుతూ...

ప్రా : ఏమిటీ? బాతాఖానీ కూడానా? ముద్దాయితో బాతాఖానీ. సెక్షన్ పదివందల అరవై నాలుగు. ఇంకో నేరం.

గు : చచ్చాం పో.

ప్రా : ఆఁ, బాతాఖానీ కొడుతూ...

కు : నేను తన కొడుకునట. తనునాకు బాబట. అందుకు...

ప్రా : ఏమిటీ? ఏమిటీ? నేరస్థుడయిన సొంత కొడుకుమీంద నేరస్థుడని తెలుసుండీ దయా దాక్షిణ్యాలు చూపెట్టాడా? సెక్షన్ అయిదు వేల ఎనిమిది వందలమ్ఫైరెండు. ఇంకో నేరం.

గు : ఈ యేడు సంకురమయ్య పోలీసువాళ్ళమీందే వడుస్తున్నాడు.

న్యా : ఆగండి ప్రాసిక్యూటర్ గారూ ఆగండి. పోలీసు వెంకటసామి నేరం చెయ్యలేదు. చెయ్యలేదని నేను రుజువు చేస్తాను.

ప్రా : చేసేదేదో నేను కేసు పెట్టాక చెయ్యండి.

న్యా : అసలు కేసే లేందే పెట్టడమెందుకూ! పోలీసు వెంకట స్వామి నేరం చెయ్యలేదు సరిగదా; పైపెచ్చు సర్కారుకే, దేవుడికే సేవచేశాడు. కోదండం వేలాడు తూన్న కుర్రాణ్ని కిందికి దింపాడూ అంటే పోలీసు వాళ్ళకుకూడా గుండె, దయాదాక్షిణ్యం వుందీ అని రుజువుచెయ్యడానికి. ఇక స్వంత కొడుకుని కరుణించ డంలో ఒక మహాసత్యాన్ని అతడు పునరుద్ఘాటిం చాడు. ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే - అన్న సామెతకి పుంభావంగా ఇతడు ఉపమానం; సర్కారు వాళ్ళు రాక్షసులనుకాకుండా మనుష్యులనే పోలీసు వాళ్ళుగా నియమిస్తున్నారనీ, దేవుడు పోలీసు వాళ్ళలోగూడా దయాదాక్షిణ్యాలు, ముఖ్యంగా పుత్రవాత్సల్యం పెట్టాడనీ ఇతడు తన చర్యలవల్ల లోకానికి చాటాడు. ఇతడు చేసిన ఈ ప్రశంసనీయ మైన సేవకి కనీసం నాలుగైదు మెడల్సు ఇవ్వాలి.

వెనక బిళ్ళ బంట్రోతుతో జడ్జీ ప్రవేశిస్తాడు.

జడ్జీ : హియర్-హియర్.

అంతా: యువర్ ఆనర్

జ. : చాలా బావుంది. సర్కారు భృత్యులని చాలా చక్కగా సమర్థించారు. మిమ్మల్ని అభినందిస్తున్నా.

న్యా : ధన్యోస్మి !

ప్రా : యువర్ ఆనర్! క్షమించాలి. పోలీసువెంటస్వామి చాల ఘోరమైన నేరం చేశాడు. అవకాశ మిస్తే రుజువు చేస్తా!

జ : నాన్సెన్స్! సీజర్స్ వైఫ్ ఈజ్ ఎబౌ సస్పిషన్. సీజరు. పెళ్ళాం నేరం చెయ్యదు. పోలీసువాడు నేరం చేశాడన్న వాళ్ళే నేరం చేసినట్టులెక్క. ఓకే క్లియర్!

ప్రా : యువర్ ఆనర్! సాక్ష్యం దాఖలు చేసుకుంటూ.

జ : కేస్ డిస్మిస్డ్!

ప్రా : కేసు నే నింకా విప్పందే.

జ : కోర్టుని నిందిస్తున్నారు. జాగ్రత్త!

ప్రా : విధేయుణ్ని! క్షమించాలి.

ర.భ : అయిందా అయ్యగారి పని.

జ : (ఈపాటికి సింహాసనం చేరుకుంటాడు. కూర్చొని) గుమాస్తా! కేసులు తియ్యి. ఒక్కొక్కటీ పిలు

ప్రా : ఒక్క క్షణం యువర్ ఆనర్, ఈ గుమాస్తామీద కూడా ఒక నేరం ఆరోపిస్తున్నా.

జ : ఏమిటీ!

ప్రా : చిత్తం. ఈయన దైవదూషణ చేస్తున్నాడు.

జ : ఓ. అదా! అది నేరంకింద లెక్కకాదు.

ప్రా : లేదు యువర్ ఆనర్! సెక్షన్ ఒకటి క్లాజు ఒకటి— శిక్షాస్మృతిలో మొదటి నేరం ఇది.

జ : నో. రూలు ఎనిమిదివందల అరవై నాలుగు ప్రకారం గుమాస్తాకి పెర్మిట్ యివ్వడం అయింది.

ప్రా : కాని, యువర్ ఆనర్, నోటికొచ్చినట్టూ వాగుతిడు తున్నాడు.

జ : వాక్స్వాతంత్ర్యం! వాక్స్వాతంత్ర్యం! దేవుడి రాజ్యంలో వాక్స్వాతంత్ర్యం అందరికీ వుంది.

ప్రా : గాని, యిటీవల చట్టంలో అది రద్దయింది యువర్ ఆనర్.

జ : నో. ఒక్క పత్రిక వాళ్ళకితప్ప తక్కిన వాళ్ళకు వాక్స్వాతంత్ర్యం వుంది.

ప్రా : అందరికీ యిష్టమొచ్చినట్లు మాట్లాడడానికి పెర్మిట్లు యిస్తే ప్రమాదం, శాంతి భద్రతల ప్రకారం.

జ : కేస్ డిస్మిస్డ్!

ప్రా : చిత్తం.

జ : గుమాస్తా! కేసు పిలవండి–మొదటి కేసు–.

గు : (బంట్రోతుతో) తరతరాల విద్యార్థి.

బం : (ముందుకొచ్చి – గట్టిగా) తరతరాల విద్యార్థిగారూ! తరతరాల విద్యార్థిగారూ! తరతరాల విద్యార్థిగారూ!

వి : ప్రెజెన్సార్!

బం : (విద్యార్థిని జోనెక్కిస్తూ) ఎక్కు!

గు : (దగ్గరకువచ్చి) చెప్పు. దేముని ఎదుట వగైరా–వగైరా.

వి : దేముని ఎదుట వగైరా–వగైరా–

జ : (సినిమా డైరెక్టరులాగ) కట్.

అందరూ ఎలాగున్నవాళ్ళు అలాగే వుండిపోతారు

జ : స్టార్ట్ ప్లీజ్! నిశ్శబ్దం. రెండు యీలలు వినిపిస్తాయి.

జ : హే! పరలోకమందున్న జగత్పితా!

అందరూ: (కుర్రాడు మినహా) హే! పరలోకమందున్న జగత్పితా!

జ : నీ సంతానమయిన మేము

అం : నీ సంతానమయిన మేము

జ : నీ పేరుమీదుగా యిక్కడ

అం : నీ పేరుమీదుగా యిక్కడ

జ : నీవు చేయవలసిన న్యాయవిచారణ

అం : నీవు చేయవలసిన న్యాయవిచారణ

జ : నీ అనుమతిమీద—నీతరఫున

అం : నీ అనుమతిమీద—నీ తరఫున

జ : నిష్కామకర్మగా చేస్తున్నాం.

అం : నిష్కామకర్మగా చేస్తున్నాం.

జ : అయినా – నీ సంతానమయిన మాకు

అం : అయినా – నీ సంతానమయిన మాకు

జ : ఈ అన్యాయవిచారణ అనే వ్యాపారంలో

అం : ఈ న్యాయవిచారణ అనే వ్యాపారంలో

జ : మన కంట్రాక్టు ప్రకారం

అం : మన కంట్రాక్టు ప్రకారం.

జ : ధనకనకవస్తు వాహనాదులు యిచ్చి,

అం : ధనకనకవస్తు వాహనాదులు యిచ్చి,

జ : అన్యాయాలూ – అబద్ధాలు గుర్తించే సత్తువా

అధ : అన్యాయాలూ - అబద్ధాలూ గుర్తించే సత్తువా
జ : ఇవ్వగోరుతున్నాం
అం : ఇవ్వగోరుతున్నాం.
జ : ఇంతే సంగతులు - చిత్తగించవలెను.
అం : ఇంతే సంగతులు - చిత్తగించవలెను.

జ : కలం తాజా, నీవు నీ ముప్ఫయి మూడుకోట్ల గుమాస్తాలద్వారా ఎప్పటికప్పుడు యీ లోకంలో జరిగే విషయాలు టెలివిజన్ మొదలైన యంత్రాల సాక్ష్యాలవల్ల తెలుసుకొంటున్నావు. మేము నీ యెదుట చేసే యీ న్యాయవిచారణలో ఏమైనా లోపాలుంటే వెంటనే ఆకాశవాణి ద్వారా మాకు ఇన్‌స్ట్రక్షన్సు పంపవలసింది. ఈ హామీ యిస్తానంటే మేము నిష్పూచీగా పనిచేయగలం కాబట్టి యీ రోజు విచారణ మొదలుపెట్టమని మాకు ఆజ్ఞ యివ్వవలసింది.

గు : ఒక చిన్న మనవి. పరలోకమందున్న ఓ దేముడిగారి గుమాస్తా! నేను పడుతున్నపాట్లు నువ్వు రోజూ చూస్తూవూరుకోవడం ఏం బాగులేదు. బ్రాంచాఫీసులోని గుమాస్తాల పాట్లు హెడ్డాఫీసులోని బంట్రోతుకి కూడా వినోదం అన్న సంగతి నాకు తెలుసుగాని దయచేసి ఈ కోర్టుతీర్పులు లిఖించడానికియంత్రాలు నా మొఖానకొట్టు.

జ : ఓ పరలోకమందున్న జగత్పితా! నీ ఆర్డరుకోసం వేచి వున్నాం

నిశ్శబ్దం. అందరూ తలలు పైకెత్తి నిరీక్షిస్తూవుంటారు. ఆకాశ
వాణి అధికారయుక్తంగా "మొదలెట్టండి." అని గర్జిస్తుంది.

జ : థాంక్స్ మిస్టర్ దేముడూ జిందాబాద్!

అం : మిస్టర్ దేముడూ జిందాబాద్ (మూడుసార్లు)

కు : మిస్టర్ దేముడూ ముర్దాబాద్ !

జ : సైలెన్స్ !

నిశ్శబ్దం

జ : మొదలెట్టండి. (ఆకాశవాణిని ఇమిటేట్ చేస్తాడు)

గుమాస్తా బోనులోవున్న కుర్రవాణ్ని ప్రమాణం చేయిస్తాడు.

గు : దేముని ఎదుట——

కు : నేను చెప్పను.

గు : చెప్పు-చెప్పితీరాలిరా, కుర్రకుంకా !

కు : నేను చెప్పను-నాకు నమ్మకం లేదు.

గు : ఏడిశావ్ ! చెప్పు: మా కందరికీ నమ్మకం తగలడే
చేస్తున్నామా ఏమిటి? లాంఛనాలు - లాంఛనాలే.

కు : అయితే చెప్పాననుకో.

జ : (స్టాప్ వాచీ నొక్కి-) సరే అనుకొన్నాం. మొద
లెట్టండి.

ప్రా : నీ పేరేమిటి?

కు : నాకు తెలీదు.

ప్రా : చూశారా యువర్ ఆనర్. తరతరాల విద్యార్థి అంటే
ముందుకొచ్చినవాడు ఇప్పుడు తన పేరేమిటో తనకు
తెలీదని అబద్ధం చెప్తున్నాడు.

జ : అదంతా నాకు తెలీదు. అతడిచేత నిజం చెప్పించే పూచీమీది. నేరం ఋజువుచేస్తే శిక్ష నేను వేస్తా.

ప్రా : అయితే సరి. (కోపంగా) నీపేరేమిటి ?

కు : నేను చెప్పను.

ప్రా : (బడిపంతులులాగ) చెప్పవూ! ఎలాచెప్పవో చూస్తా. (బల్లమీంద బెత్తంతీసి) పట్టు-చెయ్యిపట్టు.

న్యా : అన్యాయం అన్యాయం. ఐ అబ్‌జెక్ట్ యువర్ ఆనర్ సర్వాధికారాలువున్న కోర్టువారు శిక్ష విధించాలి గాని ఈ ప్రాసిక్యూటరు యిలా కోర్టు సమక్షంలో కుర్రాణ్ని దండించడం అల్ట్రావైరస్.

జ : అబ్జక్షన్ ఓవర్‌రూల్డు. విద్యార్థిని దండించే అధికారం స్కూల్లో టీచరుకి, ఇంట్లో తండ్రికీ వున్నది. కానివ్వండి.

ప్రా : (కుర్రాడితో) పట్టు, చెయ్యిపట్టు.

కు : నేను పట్టను పో. నీ బాబుతో చెప్పుకో.

ప్రా : ఊఁ ! (కాలిమీంద కొడతాడు)

కు : ఓరి నీ ముండా మొయ్యా——చెప్తా కోర్టుకు.

బ : (స్టాప్ - వాచ్ నొక్కి) టైమప్. లాభం లేదు. నాలుగు వాక్యాలలో నేరం ఏమిటో ప్రాసిక్యూషన్ వారు చెప్పి, వాదం దాఖలు చేసుకోవాలి.

ప్రా : చిత్తం! ఈ తరతరాల విద్యార్థి అనేవాడు చెప్పిన చదువు చెప్పినట్టు నేర్చుకోవడంలేదు. రాజకీయాలతో సంబంధం పెట్టుకొని చెడిపోతున్నాడు. పెట్టిన వరవళ్ళు పెట్టినట్టూ దిద్దటంలేదు. "ఈ సామాజిక

ధర్మాలనే వాడండి" అని ఒరనడిపెట్టే "వాడం" అని దిద్దుతున్నాడు. వీడిని శిక్షించాలి.

జ : ముద్దాయి యీ నేరాన్ని ఎలాగా ఒప్పుకోడని మాకు తెలుసు. వాడు అబద్ధాలకోరని కూడా తెలుసు. అంచేత ప్రశ్నించటం మానివేస్తున్నాం.

న్యా : యువర్ ఆనర్. ముద్దాయి నేరం చెయ్యలేదని నేను వాదిస్తా. ఆదిలో మనిషికి చదువురానప్పుడు నిన్న నేర్చుకొన్న విషయం నేడు మారిపోతూ వుండేది. నిన్నటి పాపం ఇవాళ పుణ్యం; నిన్నటి మంచివాడు యివాళ చెడ్డవాడు. కాబట్టి నిన్నటి ఒరవడి యివాళ...

జ : టైమ్—

న్యా : యువర్ ఆనర్. కేసు సాంతం వాదించ నివ్వండి.

జ : టైంలేదు. నాకు యిదొక్కటే కేసు అనుకొన్నారా? మీ ప్రతివాదన దాఖలు చేసుకోండి. తీర్పు చెప్పాలి.

ప్రా : ఇదిగో నా వాదన (ఒక కాగితాల బొత్తి యిస్తాడు.)

న్యా : ఇదిగో నా ప్రతివాదన (ఇంకొక కాగితాల బొత్తి యిస్తాడు)

గుమాస్తా వాటిని తీసుకొని జడ్జికి యిస్తాడు. వాటిని తన ప్రక్కన వున్న త్రాసులో వేసి తూస్తాడు.

జ : వాదన బరువుగావుంది గాబట్టి ముద్దాయి నేరం చేశాడని తేలింది; (లేచినుంచుని ఏడుకొండలవాడి ఫోజు

లో) తరతరాల విద్యార్థి పాపియని నేను ప్రకటిస్తు న్నాను.

అం : (చూపుడు వేలితో చెయ్యి దూసి మూకుసార్లు చూసి 'పాపి' అని కుర్రాణ్ని నిందిస్తారు)

జ : నేరస్తుడు ఎన్నిపౌన్లు పాపం చేశాడో చూడండి!

గుమాస్తా వెళ్ళి కుర్రాణ్ణి తూకం యంత్రంమీద తూస్తాడు.

గు : నూటయిరవైపౌన్లు మహాప్రభో!

జ : నేరస్థుడు 120 పౌన్లు పాపం చేశాడుకాబట్టి నూట యిరవై జన్మలదాకా—ఈ సమాజం గోడలకి గోడ కుర్చీ వెయ్యాలని నేను శిక్ష విధిస్తున్నాను.

కు : నేను గోడకుర్చీ వెయ్యను.

జ : ధిక్కారమును సైతునా!

కు : (బిక్క-మొగం వేసి) కావలిస్తే కోదండంతీయించండి. గోడకుర్చీమట్టుకు వేయించొద్దు.

జ : నీ కిష్టమొచ్చిన శిక్ష వేస్తారేం రమ్మనీ! అనుభవించు.

ఈ లోపున గుమాస్తా బాతు కలం తీసికొచ్చి విద్యార్థి నుదుట శిక్షరాయడం మొదలెడుతాడు.

కు : (ఏడుస్తూ) మీ యిష్టం. మీ యిష్టమొచ్చిన మరే శిక్షయినా వెయ్యండి. గోడకుర్చీ మట్టుకు వద్దు. ఈ సమాజం గోడలు చాలా పాతవి. చన్రుడు రాలుతూ— యుద్ధాల వానలకీ, సంస్కరణల గాలి దుమారానికీ దెబ్బతిన్నాయి. ఇవి నేడో రేపో పడిపోతాయి. ఈ గోడలకు గోడకుర్చీ నేను వెయ్యను. ఈ గోడలు

నామీంద పడతాయి. నాకు తెలుసు. అవి నామీంద పడి నేను చచ్చిపోతే మీకు సంతోషం – నేను గోడ కుర్చీ వెయ్యను. ఇవి గోడలుకూడా కావు–జగన్నాటక రంగంలోని సైడుకర్టెనులు. వీటికి దాపూ, దన్నూ లేవు. తంతే పడిపోతాయి. వీటిని ఆనుకొని గోడకుర్చీ ఎలా వేయమంటారు?

ప్రా : ఈ బుద్ధి, ఒరవళ్ళు తప్పు దిద్దుతున్నప్పుడు లేదేం మరి!

(కుర్రాడు మాట్లాడుతున్నప్పుడు, గుమాస్తా లలాట లిఖనం పూర్తిచేసి, జడ్జిదగ్గరికి తీసుకువెడతాడు. జడ్జి కుర్రవాడికి శిరగోపం పెడతాడు. కుర్రవాడు ఏడుస్తూ వచ్చి గోడకుర్చీ వేస్తాడు.

జ : రెండో కేసు.

గు : దరిద్రాల దానయ్యగారు.

బం : దరిద్రాల దానయ్యగారూ– (అని మూడుసార్లు కేక వేస్తాడు. ఆడియన్సులో ఇంతసేపూ కూర్చొన్న ఒకవ్యక్తి స్టేజి ఎక్కుతాడు. తిన్నగా వెళ్ళి బోనులో నిలుచుంటాడు.)

గు : (వస్తాడు.)

దానయ్య: దేవుని ఎదుట – ప్రమాణం చేసి అంతా నిజం చెప్తాను. అబద్ధం చెప్పను.

గు : ఈయన పాత దొంగే–సరి!

ప్రా : ఏమండీ దానయ్యగారూ! మీ పేరేమిటండీ!

దా : ఏదో తమలాంటి పెద్దలు - అభిమానంతో దరిద్రాల దాసయ్య అని పిలుస్తారు.

ప్రా : మీతండ్రి పేరు ?

దా : మీ కేస్సెలవియ్యండి. నేను కాదంటానా ?

ప్రా : సరి. మీరెవరో మాకు తెలుసు; మేమెవరిమో మీకూ తెలుసు. ఈ లాంఛనాలు ఎందుకు ?

దా : అవును, ఎందుకూ ?

ప్రా : మీరు మొన్న తింటున్న అన్నంలో కొంత ఎవరో మత్తివాడికి దానంచేశారా ?

దా : చేశాను బాబూ ! బుద్ధిగడ్డితిని, చేశాను.

ప్రా : యువర్ ఆనర్, ముద్దాయి నేరం ఒప్పుకొంటున్నాడు.

న్యా : యువర్ ఆనర్. ప్రాసిక్యూషన్ వారు నేరం యేమిటో ఋజువు చేయలేదు.

ప్రా : డిఫెన్సువారు యింత 'లా' తెలియని దద్దమ్మలని నాకు తెలియదు. తెలిస్తే మళ్ళీ అంతా యేకరువు పెట్టేవాణ్ని. సెక్షన్-వెయ్యిన్ని తొమ్మన్నూట ఆరు వదల పదకొండు ప్రకారం దేముడు సృష్టించిన ఈ ప్రపంచంలో పిడికెడు అన్నానికికూడా కొరత వుందని ఋజువు చెయ్యడం మహాపాపం. ముద్దాయి ఒక పిడికెడు అన్నదానం చేసి యీ నేరం చేశాడు.

న్యా : యువర్ ఆనర్, ముద్దాయి చాలా ఉత్తముడు, ఎవరికీ ఏ అపకారం చేసి వుండలేదు. ఆఖరికి ఎన్నడూ ఒక ఈగని కూడా చంపలేదు.

ప్రా : ఈగని చంపకపోవడం కూడా నేరమే. ఇతడు ఏ ఈగనైతే చంపలేదో; ఆ ఈగలే అంటువ్యాధుల్ని వ్యాపింప చేస్తున్నాయి, అది వేరే ఒక కేసుగా నేను ఆరోపిస్తాను.

న్యా : యువర్ ఆనర్ ప్రాసిక్యూషన్ వారు ...

దా : బాబ్బాబు. మీకూ మీ పెద్దలకు వెయ్యి దండాలు, వాదించకండి. ఇక్కడ 'ఊ' అంటే తప్పు, 'ఆ' అంటే తప్పు. 'నారాయణా' అంటే బూతుమాట-వాదించి ఏం లాభం? పడి పూరుకోవడమే. మీరు ఏదేనా వాదిస్తే అందులో రంధ్రాన్వేషణ చేసి కొత్త నేరాలు పుట్టిస్తారు. మీరేం వాదించవద్దు. బాబూ-ప్రాసిక్యూటర్ గారూ, మీరు చెప్పిన నేరాలన్నీ నేను చేసినట్లే లెక్క. ఈ విచారణ తతంగం ఎందుకూ! రోజూ ఒకసారివచ్చి, యిన్‌జక్షన్ పుచ్చుకొన్నట్లు నెత్తిమీద శిక్ష రాయించుకు పోతా. మరి కానివ్వండి దయచేసి.

జ : దట్స్‌గుడ్. ఎన్ని పౌన్లు నేరం చేశాడో చూడండి.

దా : కిందటిసారి నూటరెండు పౌన్ల నేరం చేశాను. మళ్ళీ తూచాలి అంటే చూడండి.

ప్రా : తూచాలి. ఏమో! ఈలోపున హెచ్చు అవ గూడదూ!

గు : వీడి శ్రాద్ధం — గూ తింటున్న తిండికి బలవడం కూడానా! ఏదీ దానయ్యా ఎక్కు? (చూసి) చచ్చాం ఫో, నూటఒక్క పౌన్లే.

ప్రా : బహుశా యంత్రం పాడయిందేమో, ఎందుకేనా మంచిది, పాత లెక్కనే శిక్ష వేయించండి.

భా : బాబూ! శిక్ష ఒక్క జన్మలోనైనా తగ్గితే తగ్గినట్టే.

జ : నేరస్థుడు పాపి. అందుకుగాను నూటరెండు జన్మలు గర్భ దరిద్రం శిక్ష వేస్తున్నాం.

అం : (మళ్ళీ నిందిస్తాడు. 'పాపి' అని మూడుసార్లు అంటాడు.)

గు : దానయ్యా, తరువాత రా శిక్ష రాస్తా.

దా : పోన్లే బాబూ! ఇవాళదీ రేపటిదీ రేపే రాద్దువుగాని. (పోతాడు)

జ : తరువాత కేసు.

గు : అన్నదానాల ఆగర్భ శ్రీమంతుడుగారు.

బం : (బంట్రోతు మూడుసార్లు కేక వేస్తాడు)

ఆడియన్సులోనుంచి మరొకడు వస్తాడు.
జడ్జీ గద్దె దగ్గ ప్రత్యుత్థానం చేస్తాడు.

జ : రండి...రండి, దయచేయండి...దయచేయండి.

శ్రీమం: (మందహాసం ప్రసాదిస్తాడు)

జ : (కుర్చీ చూపి) విశ్రమించండి. మీకు శ్రమ యిస్తున్నాం. కాని చూడండి, డ్యూటీ డ్యూటీయే!

శ్రీమం: మ్ ం.

జ : (సింహాసనం ఎక్కి) ఇంట్లో అంతా కులాసాగా వున్నారుగదా!

శ్రీమం. మరేం.

జ : మీ పెద్దామ్మాయికి పురుడొచ్చిందా?

శ్రీమం: మరేం.

జ : ఏం పిల్ల?

శ్రీమం: మొగపిల్లోడు.

జ : మీ పేరే పెడతారా?

శ్రీమం: మరేం.

జ : బారసాల ఎప్పుడు?

శ్రీమం: రేపు.

జ : ఆహా – ఏదీ – ప్రాసిక్యూటర్ గారూ కానివ్వండి. (ముద్దాయితో) మరేమనుకోకండి—— లాంఛనం లాంఛనమే.

శ్రీమం: మరేం.

ప్రా : ముద్దాయిగారు సెక్షన్ వెయ్యిన్ని తొమ్మనూటఆరువందల పదకొండు ప్రకారం నేరంచేశారు. 'దేవుడు సృష్టించిన యీ ప్రపంచంలో పిడికెడు అన్నానికి కొరతవుందని' అర్థం వచ్చేటట్టు పేదలకి అన్నదానం చేశారు.

న్యా : యువర్ ఆనర్ అసలు ఇందులో కేసే లేదు. ముద్దాయిగారు ఒక పిడికెడు అన్నంకన్నా ఎక్కువే దానం చేశారు. దేముడు సృష్టించిన యీ ప్రపంచంలో కడుపునిండా అన్నానికి కొరత వుందని అందరికీ తెలుసు. ఒక పిడికెడు అన్నం దానంచేస్తే వెయ్యి తొమ్మనూటఆరువందల పదకొండు ప్రకారం

కేసు పెట్టవచ్చు. ముద్దాయిగారు ఒక పిడికెడుకన్నా ఎక్కువే దానం చేశారు. కాబట్టి యీ సెక్షన్ వర్తించదు. కావున కేసుచెల్లదు.

జ : హియర్ ! హియర్ ! కేస్ డిస్మిస్డ్!

న్యా : య్యువర్ ఆనర్ !

జ : యస్.

న్యా : ఈ కేసులవల్ల మా క్లయింటుకి పరువు నష్టం కల్గింది.

శ్రీమం: మరేం.

న్యా : కాబట్టి కోర్టువారు...

జ : అవునౌను. ఎన్ని పౌన్లు నష్టం అయినదో చూడండి.

గుమాస్తా చూస్తాడు.

గు : రెండువందల యిరవై రెండు పౌన్లు.

జ : అయితే వీరికి రెండువందల యిరవై రెండు జన్మలు ధనకనక వస్తువాహనాదులు సమృద్ధిగా వుండాలని యీ కోర్టువారు దేముడికి సిఫార్సు చెస్తున్నారు! శ్రీమంతుడుగారూ! క్షమించండి. స్వర్గనుంచి ఆర్డరు రాగానే నష్టపరిహారం మీకు చెల్లిస్తాం. ప్రస్తుతం భూలోకంలో పుణ్యంలేదు. స్టెర్లింగు మారకం లాగానే పుణ్యం మారకంకూడా కొంచెం యిబ్బందిగా వుంది.

న్యా : కేసు పరిష్కారం అయిన వెంటనే నష్టపరిహారం యిప్పించడం భావ్యం.

శ్రీమం: మరేం తొందరలేదు. అక్కడనే ఉంపించండి. వక్కీ యేనా గిట్టుబాటు అవుద్ది. యెంటనే-మనపద్దుల్లో జమ ఏస్తే సాలు.

జ : జమ కట్టిస్తా.

శ్రీమం: చక్రవడ్డీ సుమండీ! మర్సిపోయేరు.

జ : అబ్బెబ్బే!

శ్రీమం: యెళ్ళొస్తా! (స్టేజిపైపు దిగబోతాడు.)

జ : ఇటు. ఇటు. కోర్టు ఖర్చులతో మిమ్మల్ని యింటికి పంపిస్తాం. వెళ్ళండి.

శ్రీమం: వస్తా. (పోతాడు)

జ : తరువాత కేసు.

గు : కాయకష్టం కార్మికుడు.

బం : (కాయకష్టం కార్మికుడు. అని ముమ్మారు అరుస్తాడు.)

ర. భ: హాజర్ పెడతా హుజూర్. (పంజరం దగ్గరికి వెళతాడు.)

(ప్రేక్షకులలో నుంచి ఒక వ్యక్తి చాలా జోరుగా వస్తాడు. అతడు శాశ్వత శాసనసభ్యుడు.)

శా. శా: నమస్తే-నమస్తే-(టైమ్ చూసి) నాకట్టే టైమ్ లేదు. మళ్ళా హోటల్ పనివాళ్ళ సంఘం మీటింగులో మాట్లాడాలి. నామీంద ఏదో అభియోగం తెచ్చారట. ఏడిస్చ-అదేదో త్వరగా కానివ్వండి.

జ : యస్. ముందు వీరి కేసే కానివ్వాలి. ఏదండీ ప్రాసిక్యూటరుగారూ, వీరిమీద ఏమిటండీ నేరం వుంది?

ప్రా : వీరు శాశ్వత శాసన సభ్యుడుగారు. ఎన్నికల వాగ్దానాలు నిలబెట్టుకోలేదని కేసు.

శా. శా: సరి. సరి. ఇదా!

న్యా : యువర్ ఆనర్, ముద్దాయి—

శా. శా: ఉండవయ్యా, మన్య్నువ్వొకడివి. నేను వాదించుకుంటాను. అయ్యా! ఘనతవహించిన నేను - ఘనతవహించిన కోర్టువారికి ఘనకార్యంగా చెప్పుకొనేదియేమిటంటే - నామీంద తీసుకొచ్చిన కేసులో యీషణ్మాత్రం నిజంలేదు. నేను ఎన్నికల వాగ్దానాలు నిలబెట్టుకోవడంలేదని ఏ ఫుంఢాకోరు అనగలడో నాకు బోధపడటంలేదు. ఫుండాకోరుఅన్నమాట సభలో వాడవచ్చునని ఎస్కిమో శాసన సభలో రూలింగువుంది. అందుచేత వాడుతున్నా. ఇక ప్రస్తుతానికి ఎన్నికలప్పుడు నేను ఏమిటి వాగ్దానం చేశానో నాకు జ్ఞాపకం వుంది. ఆ వాగ్దానాలు నేను సభ్యుణ్ణై అయిన మీందట ఏడాదిలోనే పూర్తి చేశాను. నేను యిచ్చిన వాగ్దానాలు ఏమిటయ్యా అంటే-మా బావమరిదికి వుద్యోగం వేయిస్తానన్నాను. మా తమ్ముడికి సర్కారు సొమ్ము వ్యాపారంలో మదుపు పెట్టిస్తానన్నాను. మా పినతల్లి కొడుక్కి బస్సురూట్లు యిప్పిస్తానన్నాను. మా

పిన్నత్తగారి తోడికోడలు కొడుక్కి సిమెంటు పర్మిట్లు యిస్తానన్నాను. ఇవన్నీ చేశానా; లేదా? కాబట్టి నేను ఎన్నికల వాగ్దానాలు నిలబెట్టుకోలేదని నేరం ఆరోపించడానికి ఎవడికి గుండెలున్నాయి! ఇక ప్రజలకిచ్చిన వాగ్దానాలా-సామెత. నాలుగువందల అరవైనాలుగు ప్రకారం యింటగెలిచి రచ్చగెల వాలి. నేను యింకా యింట గెలవలేదు. ఎన్ని సాక ర్యాలు చేసినా మా బంధువులు యింకా సణుగు తూనే వున్నారు. కాబట్టి ప్రజలకి నేను యిచ్చిన వాగ్దానాలు పూర్తి చేయవలసిన కాలం యింకా రాలేదు. అది వచ్చింది అని తెలియగానే ఒకడు చెప్పక్కర్లేకుండానే నేను అవి నెరవేరుస్తా. ఇంతటితో విరమిస్తున్నా - శెలవు.

జ : హియర్! హియర్! పరువునష్టం కింద వీరికి-

శా. శా: అవన్నీ తర్వాత చూసుకొందాం లెద్దురూ. నాకు వేరే పనివుంది. వస్తా. (ఆడియన్సులోకి వెళ్ళి చర చర నడచి వెళ్ళిపోతాడు.)

జ : (ఆడియన్సు గోలచేస్తే - సైలెన్స్ అని కేకవేసి) తరువాత కేసు.

గు : కాయకష్టం కార్మికుడు.

బం : కాయకష్టం కార్మికుడు-(మూడుసార్లు అరవాలి)

ర. భ : హాజరు పెడుతున్నాను హుజూర్.

పంజరంలోనుంచి నడిపించి తీసుకొచ్చి బోను ఎక్కిస్తాడు.

జ : ఈ ముద్దాయి చేసిన నేరం యేమిటో దబ్బున చెప్పండి

ప్రా : లాంఛనాలు కానివ్వవద్దా యువర్ ఆనర్ ?

జ : అయినట్టే లెక్క!

ప్రా : తమరే అలా శెలవిస్తే అంతకన్నానా! నేరం ఏమిటో మనవి చేసుకుందునా. వీడు కార్మికుడు.

న్యా : యువర్ ఆనర్ – ప్రాసిక్యూషన్ వారి భాషని నేను ఆక్షేపిస్తున్నా. ముద్దాయిని 'ఆయన' 'వారు' అని మర్యాదగా పిలవకపోతే, నీచంగా 'వీడు' అనకూడదు. 'అతడు – ఇతడు' అని కొంచెం గౌరవంగానే పిలవాలి.

ప్రా : కాయకష్టం చేసుకొనే కూలి వెధవకి గౌరవం కూడానా ?

న్యా : యువర్ ఆనర్ ఐ అబ్జెక్ట్ !

జ : అబ్జెక్షన్ ఓవర్ రూల్డ్! డిఫెన్సు వారు కోరిన 'అతడు' 'ఇతడు' అన్న పదాలలలోకూడా 'డు, ము, వు, లు' ప్రథమ విభక్తేవుంది. ప్రాసిక్యూషన్ వారు వాడుతున్న 'వీడు' అన్న పదంలోకూడా ప్రథమావిభక్తేవుంది. అందుచేత అట్టే తేడాలేదు.

న్యా : యువర్ ఆనర్ ప్రాసిక్యూషన్ వారి నిరసన భావనకి నేను ఆక్షేపం తెలియజేస్తున్నా. 'కాయకష్టం చేసుకునే కూలి వెధవకి గౌరవంకూడానా' అని ప్రాసిక్యూషన్ తరఫువారనడం బేసబబు, ప్రాసిక్యూషన్

వారికి కాయకష్టం తెలియదు. వారికి తెలిసిందల్లా వాయికష్టం మట్టుకే.

ప్రా : యువర్ ఆనర్ ఐ అబ్ జెక్ట్ !

జ : అబ్ జెక్షన్ ఓవర్ రూల్డ్ !

న్యా : కాయకష్టం చేసుకొనేవాడు మన దేశానికి వెన్నెముక. అతడు లేకపోతే మన బువ్వ నోట్లోకి వెళ్ళడం మాట అటుంచి అసలు కంచంలోకి పడదు

జ : చాలించండి. ఇవన్నీ అందరికీ తెలుసు. ప్రాసిక్యూషన్ వారూ! కానివ్వండి.

ప్రా : వీడు కార్మికుడు. వీడు మనకెన్నెన్నో విధాల పనికొచ్చే పరిశ్రమలు, సౌకర్యాలు మొదలైనవాటిని మహారాజశ్రీ పెట్టుబడిదారులు పెడుతూవుంటే, అవన్నీ తనని దోచుకొని పెట్టుబడిదారులు పెట్టారంటున్నాడు.

న్యా : అది అక్షరాల నిజం, పెట్టుబడిదారులు కార్మికుల శ్రమశక్తిని దోచుకొని పరిశ్రమలు పెడుతున్నారు.

ప్రా : నీ మొహం! శ్రమశక్తిని దోచుకోవడం ఏమిటి? దోచుకుందికి అందులో ఏముంది? డబ్బా దసకమా? నగా, నాణేలా? గొడ్డులాగపనిచెయ్యడం తప్ప...

న్యా : నా మొహంకాదు - ప్రాసిక్యూటర్ వారి మొహమే. యువర్ ఆనర్ గొడ్డులాగ పనిచెయ్యడం ఎందువల్ల జరుగుతున్నదో-దాన్నే దోచుకోవడం అంటారు; పెట్టుబడిదారులు కాలుమీద కాలువేసుకొని

కూర్చుంటే, కార్మికుడు గొడ్డులాగ ఎందుకు పని చెయ్యాలి?

ప్రా : అది వాడికర్మ.

న్యా : కాదు. పెట్టుబడిదారుల నిరంకుశత్వం.

ప్రా : పనిచెయ్యడం మానెయ్యమను! చేసిన పనికి డబ్బు పుచ్చుకోవడం లేదూ?

న్యా : చేసిన పనికి సరిపోయినడబ్బు ఎక్కడ యిస్తున్నారు! డబ్బు చాలడంలేదుగనక హెచ్చు యిచ్చేదాకా పనిచెయ్యం అని అంతా కలిసి కట్టుగా అడిగితే, 'అది సమ్మె, దేశద్రోహం' అని మీరేకద నేరం ఆరోపిస్తున్నారు ?

జ : ప్రాసిక్యూషన్ వారు- డిఫెన్సువారు విషయాంతరాల లోనికి వెళ్ళుతున్నారు. కేసు ఏమిటో వాదించండి.

ప్రా : చిత్తం-నేను కేసే వాదిస్తున్నా. ఈ మొనగాడే శ్రమశక్తి, గుడ్డూగుడుసూ అనిమొదలెట్టాడు. వీడు-యీ కార్మికుడున్నాడే-వీడు ఆ పరిశ్రమలన్నీ తన వంటున్నాడు. లక్షలకి లక్షలు పెట్టుబడిపోసి పరిశ్రమలు స్థాపించినవాళ్ళంతా మట్టికొట్టుకు పోవాలంటాడు. వాళ్ళు లాభాలు తినకుండా అవన్నీ తనకే ఇచ్చివేయాలంటాడు.

న్యా : కార్మికుడు పనిచేయకపోతే అసలు లాభాలు ఎక్కడ నుంచి వస్తాయి?

ప్రా : మీకు మీ వాదనకూడా సమంగారాదు. అసలు 'కార్మికుడు అర్ధాకలి తిండి తింటేనేగాని లాభాలు అంటూ వుండవు' నేర్చుకోండి.

జ : మళ్ళా విషయాంతరం-

ప్రా : విధేయుణ్ణి. ఇక ప్రస్తుతానికి వద్దాం. ఈ కార్మికుడు ఆ పరిశ్రమలు తనవి అని ఆక్రమించుకోకండా చేతికి మట్టుకు బేడీలు వేయించాం. అదీకాక - వీడు పరిశ్రమలలోగాక యితర వ్యావృత్తులలోకూడా అతిగా ప్రవర్తిస్తున్నాడు. వీడు తాజమహాల్ కట్టేప్పుడు రాళ్లెత్తిన కూలీ. వీడు వూరుకోకండా మహాశిల్పులు చెక్కిన రాళ్ళతోబాటు తన పేరున్న రాయికూడా మోసుకొచ్చాడు. ఆ కట్టడం కట్టడంలో తనకి వంతు వుందంటాడు. మహాశిల్పుల పేర్లే కనబడకుండా కళాఖండాల్ని నిర్మిస్తూవుంటే యీ కోన్‌కిస్కాగాడి పేరు చరిత్రాత్మకమైన కట్టడంమీద వుండాలంటాడు.

జ : సైంలేదు. నేరాలని - వాదాన్ని మీరు దాఖలా చేసుకోండి.

ప్రా : చిత్తం. (గుమాస్తాకి యిస్తాడు.)

జ : ప్రతివాదాన్ని మీరు దాఖలు చేసుకోండి.

న్యా : పోండి. నా ఉత్సాహాన్ని మీరు చెడగొట్టారు. కార్మికుల కష్టాలని, సమాజంలో వాళ్ళ పాత్రను సమర్థిస్తూ పదహారు పేజీల వుపన్యాసం రాసుకొచ్చా.

అది చదవడానికి వీలులేకుండాచేశారు, ఇందండి,
(కాగితాల బొత్తి గుమాస్తాకి యిస్తాడు.)

ప్రా : నేను ప్రాసిక్యూటరుగా వుండక, డిఫెన్సు తరఫున
వుంటే అరవై పేజీల వుపన్యాసం రాసేవాణ్ని.

జ. : (వాద ప్రతివాదనలు తూచి) ముద్దాలు నేరస్థుడు-
ద్రోహి!

అం : ద్రోహి (అని మామూలు తతంగంతో నిందిస్తారు.)

ర.భ : (తూకం వేస్తాడు) నూటడెభ్భయి పౌనులు.

జ : అయితే నూటడెభ్భయి జన్మలు-వీడు ఏయంత్రాల
పరికరాలతో పనిచేస్తాడో; వాటికి యజమానిగా
వుండగూడదు. అన్ని జన్మలలోనూ వీడు అర్థాకలి
తిండి తింటూ పెట్టుబడిదారులకి లాభాలు గడించి
పెట్టాలి. ఇక బేడీలు తీసెయ్యవచ్చు.

గుమాస్తా వెళ్ళి యిది ఉలాటన లిఖిస్తాడు.

జ : కేసు పరిష్కారం అయిపోయిందిగాబట్టి యీ కేసు
విషయంలో వాదప్రతివాదనలు చేసిన మిమ్మల్ని
అభినందిస్తున్నా. డిఫెన్సు చాలా బాగుంది.

ప్రా : వాడి మొహం. ఏడిసినట్టేవుంది. నేనే డిఫెన్సుగా
వుంటే ఎంత చక్కగా వాదించేవాణ్ణి! నాకు
సాంఘిక అర్థశాస్త్రాలు క్షుణ్ణంగావచ్చు. కాబట్టే -
కార్మికుడు నేరస్థుడని ఎక్కడా లోటుపాట్లు రాకుండా
తెలివిగా వాదించగలిగాను, సాంఘిక, ఆర్థిక శాస్త్రాలు

రాకపోతే, ఈ డిఫెన్సుని నెగ్గగలమా-ఏమయినా-
నేను ఎటువైపు వుంటే ఆపక్షం గెలిచితీరాలి.

స్యా : చాల్లే సంబడం! ప్రాసిక్యూషన్ అఘోరించినట్టే వుంది. నేనే ప్రాసిక్యూటర్నయితే ఎంత ఘాటుగా నేరం ఆరోపించేనాణ్ని! నా నేరారోపణ విన్నాక ముద్దాయిని ప్రతిజన్మలోనూ వురితీయాలని జడ్జికి అనిపించేటట్టు వాదించనూ!

జ : సరే, తరువాత కేసు తీద్దాం.

ఈలోపున గుమాస్తా వ్రాయడం, శఠగోపం
పెట్టడం వగైరా పూర్తవుతూ వుంటుంది.

జ : ఏమయ్యా గుమాస్తా, నిద్దరపోతున్నావా? తరువాత కేసుతియ్యి.

గు : తీస్తున్నా మహాప్రభో, తీస్తున్నా. అమాంబాపతు అన్నీ శాస్త్రజ్ఞుడు.

బం : అమాంబాపతు అన్నీ శాస్త్రజ్ఞుడు-

ముమ్మారు అరుస్తాడు.

ర. భ: హాజరు పెడుతున్నాను హుజూర్.

అని పంజరంలోని మనిషి సేహాజరు పెడతాడు.

జ : వేగం ఇతడినేరం ఏమిటో తేల్చి చెప్పండి.

ప్రా : చిత్తం. ఇతగాడు కళ్ళతో అన్నీ చూసేస్తున్నాడు. ప్రకృతి రహస్యాలన్నీ కనిబెడుతున్నాడు. మునులకీ, ఋషులకీగాని సాధ్యంగాని అణిమాది అష్టసిద్ధులు కనిపెడుతున్నాడు. కనిపెట్టి తనమట్టుకు వాడుకుంటే

భావున్ను. ప్రతి అంట్ల వెధవకీ అందుబాటులో వుండే
టట్టు చౌకగా వాటిని చేస్తున్నాడు. దూరదృష్టి,
దూరశ్రవణం, దూరగమనం మొదలైనవి కారు
చౌక-చచ్చు చౌక చేస్తున్నాడు. అదృష్టవశాత్తు
వీడు కనిపెట్టినవన్నీ మన పెట్టుబడిదారులు కొనేసి
స్వంతం చేసుకొంటున్నారు కాబట్టి సరిపోయింది.
లేకపోతే—

జ : ఇంతకీ కేసు ఏమిటో, నేరం ఏమిటో చెప్పటం
లేదు.

ప్రా : నేరం మనవిచేస్తున్నా. ఈ శాస్త్రజ్ఞుడు కళ్ళతో అన్నీ
చూసి కిటుకులన్నీ అలగాజనానికి చెప్పేస్తున్నాడు.
కరువు కాటకాలని దేముడుకాక, వ్యాపారస్థులే సృష్టి
స్తున్నారని చెప్తున్నాడు. అన్నిటికన్నా గొప్ప నేరం,
దేముడే లేడనీ,—వున్నా ఆయనకి ప్రజలు పాపం
చేస్తున్నారో; పుణ్యం చేస్తున్నారో అక్కర్లేదనీ
చెప్పుతున్నాడు. కాబట్టి వీడు అసలు రహస్యాలు
చూడకుండా కళ్ళకి గంతలు గట్టాం.

న్యా : యువర్ ఆనర్ ఐ అబ్జెక్ట్! శాస్త్రజ్ఞుడు కళ్ళతో
కన్నా, మెదడుతో ఏ విషయాన్నయినా కనిపెడ
తాడు. కాబట్టి నిత్య జీవితంలో ఆయన కళ్ళని కాక,
మెదడుని దండిస్తే భావుంటుంది. ఇది మాట వరస
కన్నానుగాని శాస్త్రజ్ఞుడు యింకా నేరస్థుడని ఋజువు
కాలేదు. కాబట్టి ప్రాసిక్యూషను వారు నిజంగా
శాంతి భద్రతల నిమిత్తం శాస్త్రజ్ఞుణ్ణి అదుపు ఆజ్ఞ

లలో వుంచాలంటే కళ్ళకి బదులుగా మెదడుని కట్టు దిట్టం చెయ్యాలని నా సలహా.

ప్రా : అమ్మా, శాస్త్రజ్ఞుడి మెదడుని అదుపాజ్ఞలలో పెట్ట డమే! వీల్లేదు. వాడి మెదడుకి సంపూర్ణమైన స్వాతం త్ర్యం యివ్వాలి. అప్పుడు గాని వాడు పెట్టుబడిదా రుకు నూటికి వెయ్యిరెట్లు లాభాలు సంపాదించే యంత్రాలు కనిపెట్టడు. అప్పుడుగాని నగరాలకు నగరాలు తుడిచిపెట్టుకుపోయే యాటంబాంబు లాంటి మారణయంత్రాలను కనిపెట్టడు. మన సమాజానికి ప్రాణవాయువు అయిన మహారాజశ్రీ పెట్టుబడిదారులకు కావలసినవన్నీ శాస్త్రజ్ఞుడు కళ్ళుమూసుకు కనిపెట్టాలి. అదే మాకు కావలసినది. అందుకే వాడికి కళ్ళుకట్టాం.

జ : శాస్త్రజ్ఞుడి నేరం ఏమిటో మరోసారి చెప్పాలి.

ప్రా : వీడు యోగ రహస్యాలన్నీ ప్రజలకుచెప్పేస్తున్నాడు. అందరికీ అందుబాటులోకి తెస్తున్నాడు. అందుచేత సృష్టి రహస్యాలు బోధపడిన ప్రజలు, పెట్టుబడిదా రులమీద తిరుగబడుతున్నారు. శాస్త్రపరిశోధనలు తమ మంచికే కావాలంటున్నారు. దీనివల్ల పెట్టుబడి దారులకీ, తద్వారా దేముడికీ నష్టం. దేముడికి నష్టం కలిగించే పనులు చేస్తున్నాడు గాబట్టి వీడుద్రోహి!

న్యా : యువర్ ఆనర్. శాస్త్రజ్ఞుడు పెట్టుబడిదారులకి పరమ విధేయుడిగా పనిచేస్తున్నాడని నేను ఋజువుచేస్తాను. అవకాశంయివ్వండి. మారణయంత్రాలు కనిబెట్టడం మొదలైనవాటిల్లో-

ప్రా : ఈ విషయాలు కావయ్యా ... రసాయనిక శాస్త్రం - భౌతిక శాస్త్రం మొదలైనవాటిలో శాస్త్రజ్ఞుడు విధి లేక పెట్టుబడిదారుల ఆడాలో వున్నాడు. తక్కిన శాస్త్రాలలో, సాంఘిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, మానసికశాస్త్రం మొదలైన విషయాలలో ...

న్యా : ఆ విషయాలలో గూడా పెట్టుబడిదారులు గీసిన గిరిలోనే.

జ : క్లైమక్స్! వాద ప్రతివాదనలు దాఖలు చేసుకోండి.

న్యా : డిఫెన్సుగా వాదించాలంటే నాకు ఛాన్సు రాకుండా వుంది.

జ : మీరు వాదించదలచుకొన్నదంతా కాగితం మీద రాసి నా కెందు కివ్వకూడదు.

న్యా : రాశాననుకోండి; నోరారా చెప్పొద్దూ?

ప్రా : ఇదుగో నా నేరారోపణ.

న్యా : ఇదుగో నా ప్రతివాదం.

జ : (తూచి) శాస్త్రజ్ఞుడు ఏ పెట్టుబడిదారుల వుప్పుతో పరిశోధనలుచేస్తున్నాడో, ఆ పరిశోధనలు ఆ పెట్టుబడి దారుల వినాశనానికే ఉపయోగించాలని ప్రయత్ని స్తున్నాడు కాబట్టి ద్రోహి. ఇంత స్వామి ద్రోహం చేసినవాడికి యిన్ని జన్మలు అని శిక్ష కాకుండా, ప్రతి జన్మలోనూ వర్తించే శిక్ష వేస్తున్నా. వీడు కనిపెట్టేవి వీడ్ని తినేస్తాయి. వీడు ఎప్పుడూ స్వతం త్రుడిగా వుండగూడదు, వీడి భాష ప్రజలకి అర్థం

కాగూడదు. ఇంకా చాలా శిక్షలు వీడిమీద వేస్తాను. ఇవన్నీ లలాటాన లిఖించడానికి కావలసిన యంత్రపరికరాలు మన దగ్గర లేవు. కాబట్టి శాస్త్రజ్ఞుల్ని పుట్టించేటప్పుడు యీ శిక్షలతో పుట్టించమని స్వర్గానికి నేను సిఫార్సు చేస్తున్నాను. ఇప్పుడు వీడి కళ్ళ గంతలు విప్పివేయవచ్చు.

ర.భ : (విప్పేస్తాడు)

గు : ఎంతో పెద్ద శిక్ష నుదుటిమీద వ్రాద్దామని ఎన్నాళ్ళనించో సంబరపడుతున్నా. అది కాస్తా చెట్టెక్కిపోయింది. ఓ పరలోకమందున్న గుమాస్తా పెద్దమ్మా- ఆ యంత్రాలేవో పంపిస్తే నీ పుట్టిం మునిగింది ?

జ : తరువాత కేసు.

గు : కలకాలం కవిగారు.

బం : కలకాలం కవిగారు- (ముమ్మారు కేకేస్తాడు)

ర.భ : హాజరు బాబయ్యా ! ఇదుగో (పంజరంలో వ్యక్తినే చూపిస్తాడు)

జ : ఈయన నేరాలేమిటి ?

ప్రా : ఒకటేమిటి! ఒకటో స్టేషనుదగ్గరనుంచి పదహారుకోట్ల అర్వైనాలుగు లక్షల డెబ్బయి రెండువేల నాలుగు వందల ముప్ఫయిరెండో స్టేషనుదాకా ఎన్ని నేరాలున్నాయో అన్ని నేరాలూ చేశాడు.

జ : ఒక్కడు యిన్ని నేరాలు ఎలా చేస్తాడు. ఫ్రమంటీ, డిఫెన్సువారు వాదించరేం?

న్యా : నా వల్లకాదు. కవి తరఫున ఎవడు వాదించగలడు. నేను వాదించను.

జ : వాదించండి.

న్యా : నా ఎత్తు ధనంపోసినా నేను వాదించను. కేసంతా అయిపోయాక - నా డిఫెన్సువల్లే కేసు పోయిందని వీడు నన్ను దుమ్మెత్తి పొయ్యడానికా ?

జ : డిఫెన్సు లేకుండా కేసేమిటి ? వాదించి తీరాలి.

న్యా : నేను వాదించాలా ? వాడే వాదించుకొంటాడు.

జ : సరే, వాడి నోరు విప్పండి.

ప్రా : వద్దు వద్దు. వాడినోరు విప్పితే ప్రమాదం.

న్యా : చూశారా ? ప్రాసిక్యూషనువారే కవిగారి నోటికి భయపడుతున్నారు.

జ : అయినా విప్పి తీరాలి. న్యాయవిచారణ న్యాయ విచారణే !

ప్రా : నా మాట వినండి. శాంతిభద్రతలదృష్ట్యా కవినోరు విప్పడం క్షేమంకాదు.

జ : అయినా విప్పితీరాలి. విప్పు.

ర.భ : (విప్పుతాడు.)

కవి : (గొంతు సవరించుకొని)

ఇంక్విలాబ్ జిందాబాద్ !

ఇంక్విలాబ్ జిందాబాద్ !

ప్రా : చూశారా! ఇలాగ నోరిప్పాడో లేదో, అప్పుడే ఎంత

మృదుమధురమైన పలుకో - నా మాట వింటారా మరి.

జ : ఏయ్ కవీ! సజావుగా మాట్లాడుతావా; మళ్ళా నోరు కట్టేయ మంటావా ?

క : నన్నెవ్వరాపలే రీవేళా!
నా ధాటికెవ్వరోర్వ లే రీవేళా!

అయినా యిది న్యాయస్థానం గాబట్టి, మీ అన్యాయ సూత్రాలకి కట్టుబడే, మాట్లాడటానికి ప్రయత్నిస్తా! ఏదయ్యా ప్రాసిక్యూషనూ; నేను చేసిన నేరం ఏమిటి?

ప్రా : నేరమా! నేరం అంటావేం? నేరాలు అను.

క : ఒకటో ఒకటికన్న హెచ్చో - ఏదో ఏడు. ఒక్కొక్కటే ఖండిస్తా. ఎన్ని నేరాలు చేశానేం?

ప్రా : ఒకటా - సెక్షన్ ఒకటినుంచి పదహారు కోట్లఅర వై నాలుగు లక్షల డెబ్బయి రెండువేల నాలుగు వందల ముప్ఫయి రెండో సెక్షను దాకా ఎన్ని నేరాలు వున్నాయో అన్నీ చేశావు.

క : నీ కోర్టు భాషలో గాకుండా ప్రజాభాషలో ఆ నేరాలేమిటో అఘోరించి ఏకరువు పెట్టు. సమాధానం చెప్తా.

క : ఎన్ని రకాల నేరాలు చెయ్యడానికి వీలుందో అన్ని రకాల నేరాలూ నువ్వు చేశావు.

క : నేను ప్రత్యక్షంగా చెయ్యలేదు.

ప్రా : నువ్వుచేస్తే ఒకటీ, నువ్వురాసిన పుస్తకాలలోని పాత్రలు చేస్తే ఒకటీనా ? కవిత్వం ఏమిటి ? కల లాంటిది. జీవితంలో సమకూరని విషయాలు, తీరని వాంఛలు మనం కలలో తీర్చుకొంటాం. కలలో చేసిన పాపం కూడా పాపమే ! కాబట్టి నువ్వు పుస్తకాల్లో నీ పాత్రలచేత చేయించిన నేరాలన్నీ నువ్వు చేసినట్టే లెక్క.

జ : ఒక్క వ్యక్తిమీద ఇన్ని నేరాలు !

ప్రా : ఒకొ్క్కక్కటీ మనవి చేసుకుంటా. ఈ కవిగాడు దేముడు సృష్టించినప్రకృతిలో సుందరమైన-సూర్యోదయం - సూర్యాస్తమయం - సెలయేను, మలయమారుతం, వికసించిన పువ్వులు, కిలకిలారావంచేసే పక్షులు మొదలైన విషయాలమీద కాకుండా ఆకలి, కడుపుమంట, కరువుకాటకం, తిరుగుబాటు, విప్లవం, అంతర్యుద్ధం మొదలైన విషయాలమీదే కవిత్వం వ్రాస్తున్నాడు. దేముడు సృష్టించిన సృష్టిలో బాధాకరమైనవాటిమీదే తప్ప పక్షులు మొదలైన వాటి మీద కవిత్వం చెప్పకపోవడం ఒక నేరం.

క : నేను పక్షులమీద కవిత్వం చెప్పలేదని ఎవరనగలరు? నేను పక్షులమీదకూడా కవిత్వం చెప్పాను.

ప్రా : మహా చెప్పావ్. కిరాతుడు చంపిన పక్షిమీద వ్రాశావు. లేకపోతే పంజరంలో కొట్టుకొంటున్న పక్షితో కార్మికుణ్ణి సరిపోల్చావ్. అంతేనా ?

క : నా యిష్టం; నా యిష్టమొచ్చినట్టు రాస్తా. నువ్వెవరివి మధ్యఅడ్డడానికి. నా కళ్ళకు ఏదికనబడితే దాని మీద రాస్తా. నా కళ్ళకి చాలా కనబడుతున్నాయి. చాలీచాలని తిండితో చెమటోడ్చి చేనూడ్చికష్టించే కర్షకులూ; ధనిక స్వామికి దాస్యంచేసే, యంత్ర భూతముల కోరలులోమే కార్మికులూ, కష్టం చాలక కడుపు మంటచే తెగించి సమ్మెలు కట్టేవాళ్లు, శ్రమ నిష్ఫలమై, జన నిష్ఠురమై నూతిని గోతిని వెదికే వాళ్లు, లోహరాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కసలేవాళ్ళు అనేకులింకా అభాగ్యులంతా కనిపిస్తారు. ఇంకా ఏం కనిపిస్తాయా? ధనరాసులప్రక్కే దారిద్ర్యం-సుజ్ఞానపు క్షేత్రంలోనే అజ్ఞానపు బ్రహ్మ జెముడు డొంకలు, ఆశ ప్రక్కనే నిరాశ – ఆనందం ప్రక్కనే ఆక్రందనం – వినోదంలోనే విషాదం-అడుగడుగునా విఘ్నాలు-ఆశలకు అవాంతరాలు-ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్ళు-అభిప్రాయాలకి సంకెళ్ళు- ఆలోచనలకి బేడీలు – ఆదర్శాలకి ఉరితాడు-ఉత్సాహానికి కంట్రోలు-ఉద్దేశాలకి రేషనుయిహంలో నోవేకెన్సీ-పరంలో నో ఎడ్మిషన్-కళ్ళకు కటకటాలు-కనికరానికి కారాగారం-కడుపులోకి కంకర-తలరాతలు వంకర-నలుప్రక్కలా బానిసత్వం-పది వైపులా బాధలు-ఇవన్నీ చూసి వీటికి కారణమైన స్వార్థపరులనీ, వాళ్ళకి తాళం వేసే

వాళ్ళనీ తిడుతూ, వాళ్ళుపోవాలని, మనస్ఫూర్తిగా ఆశించి, దున్నేవాడికి భూమి--పనిచేసేవాడికి-పని ముట్టు- ప్రాణాలతో వున్నవాడికి ప్రమోదం-కావాలని, రావాలని కష్టవీరులకు, కర్మవీరులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ స్వస్తివాక్యములు సంభావిస్తూ, స్వర్ణ వాద్యములు సంరావిస్తూ దీర్ఘశృతిలో, తీవ్ర ధ్వనితో విప్లవ శంఖం వినిపిస్తున్నా! బ్రతుకుకాలి, పనికిమాలి, శనిదేవత రథచక్రపు టిరుసులలో పడి నలిగిన దీనులకీ, హీనులకీ, కడుపునిండా తిండీ-కట్టుకోడానికి, కప్పుకోడానికి బట్ట-తిండీ, ప్రేమా, తీరుబాటు యిచ్చే సంఘంకోసం కలలుకంటున్నా-పని చేసేవాడే బ్రతకడానికి అర్హుడు అని చాటుతున్నా. క్రాంతి పథంమీద కదులు, సంఘ రథంమీద ఎగురు, జయపతాక నా గీతం-యువపతాక నా ప్రాణం-మహారథం కదిలింది, మహానగం పగిలింది. జగన్నాథ-జగన్నాథ-జగాన్నాథుని రథ చక్రాల్-భూమార్గం పట్టిస్తా: భూకంపం పుట్టిస్తా.

జ : నొక్కండి. వీడి నోరు నొక్కండి.

కవి : కనబడలేదా-మరో ప్రపంచపు కణకణ మండే త్రేతాగ్ని (అంటూ వుండగానే పోలీసు అతని నోరు కట్టేస్తాడు)

ప్రా : నేను చెపితే విన్నారు గాదు. ఇప్పటికేనా తెలిసిందా; వీడు చేసే న్యూసెన్సు.

ఆకాశవాణి మాట్లాడుతుంది.

ఆకాశవాణి :

ఆకాశవాణి కాలింగ్! అతి ముఖ్యమైన ప్రకటన-అంతా సావధానంగా వినండి. ఆకాశవాణి కాలింగ్-భూలోకమందున్న నరులారా! ఇక్కడ మాస్వర్గంలో అనుకోకుండా వున్నట్టుండి విప్లవం వచ్చింది. పాత దేముడు స్థానే కొత్త దేముడు వచ్చాడు. కాబట్టి పాత ప్రభుత్వం బదులుగా కొత్త ప్రభుత్వం వచ్చింది. దేముడుగారు తాము సృష్టించిన ప్రపంచంలోని ప్రజలను తమ పేరుమీదుగా తమ ఎదుట శిక్షించ డానికి కొత్త ప్రతినిధిని నియమించారు. ఇవాళనుంచే భూలోకంలో దేముడుగారి పేరుమీదుగా న్యాయ విచారణ చేయడానికిగాను కార్మిక-శాస్త్రజ్ఞుని నియ మించడం అయింది. ఆయన వెంటనే డ్యూటీలో జాయినయి న్యాయ విచారణ చేయాలి. ఇక్కడ స్వర్గంలో మేమంతా టెలివిజన్ సెట్లు పెట్టుకొని భూలోకంలో జరిగేది యధావిధిగా చూస్తూనే వుంటాం. కార్మిక శాస్త్రజ్ఞుడిగారికి పాత దేముడు గారి ప్రతినిధి అధికారం అప్పచెప్పాలి.

రంగస్థలంమీద కలకలం. కవి నోరు విప్పుతారు. బేడీలు తీసేస్తారు. రక్షక భటుడు సెల్యూట్ చేస్తాడు. ప్రాసిక్యూషను, డిఫెన్సువారు నమస్కరిస్తారు. జడ్జి సింహాసనం దిగివచ్చి, తన గౌను కార్మిక శాస్త్ర జ్ఞుడికి యిచ్చి షేక్ హేండ్ చేస్తాడు. గోడకుర్చీ వేసినకుర్రాడు యెగిరి గంతేస్తాడు. కార్మిక-శాస్త్రజ్ఞుడు సింహాసనం దగ్గరికి వస్తాడు. న్యాయవాది ప్రాసిక్యూటరుగా- ప్రాసిక్యూటర్ న్యాయవాదిగా మారుతారు.

కు : కార్మిక శాస్త్రజ్ఞుడికీ—
అంతా: జై.

ముమ్మారు జై కొడతారు.

కా : సోదరులారా! కొత్త దేముడి ప్రతినిధిగా నేను డ్యూటీలో చేరుతున్నా. కొత్తగా ప్రమాణం తీసికొని న్యాయ విచారణ చేయడం మొదలు పెడతా. (అధికార యుక్తంగా) సైలెన్స్.

నిశ్శబ్దం.

కా : హే పరలోకమందున్న జగత్పితా!
అం : హే పరలోకమందున్న జగత్పితా!
కా : నీ సంతానమయిన మేము!
అం : నీ సంతానమయిన మేము!
కా : నీ పేరుమీదుగా యిక్కడ,
అం : నీ పేరుమీదుగా యిక్కడ,
కా : నీవు చేయవలసిన న్యాయవిచారణ
అం : నీవు చేయవలసిన న్యాయవిచారణ
కా : నీ అనుమతిమీద—నీతరఫున.
అం : నీ అనుమతిమీద—నీ తరఫున.
కా : నిష్కామకర్మగా చేస్తున్నాం.
అం : నిష్కామకర్మగా చేస్తున్నాం.
కా : అయినా, నీ సంతానమయిన మాకు,
అం : అయినా, నీ సంతానమయిన మాకు,

కా : ఈ న్యాయవిచారణ అనే వ్యాపారంలో
అం : ఈ న్యాయవిచారణ అనే వ్యాపారంలో
కా : మన కంట్రాక్టు ప్రకారం
అం : మన కంట్రాక్టు ప్రకారం
కా : ధనకనకవస్తు వాహనాదులూ,
అం : ధనకనకవస్తు వాహనాదులూ,
కా : అన్యాయాలూ, అబద్ధాలు గుర్తించే సత్తువయిచ్చి,
అం : అన్యాయాలూ, అబద్ధాలూ గుర్తించే సత్తువయిచ్చి,
కా : మమ్మానందింప జేయగోరుతున్నాం.
అం : మమ్మానందింప జేయగోరుతున్నాం.
కా : ఇంతే సంగతులు.
అం : ఇంతే సంగతులు.
కా : చిత్తగించవలెను.
అం : చిత్తగించవలెను.
కా : హెయిల్ దేముడు (నాజీ వందనంచేస్తాడు.)
అం : హెయిల్ దేముడు (నాజీవందనం చేస్తాడు.)

కార్మికుడు కూర్చుంటాడు; అందరూ కూర్చుంటారు.

కా : కేసు తియ్యండి. ముద్దాయిని పిలవండి. నేరం ఆరోపించండి.
గు : చిత్తం.
ప్రా : యువర్ ఆనర్ క్షమించాలి. ఎలాంటి వాళ్ళమీద కేసు తీసుకురావాలో, ఎటువంటి నేరాలు రుజువు చేయాల్లో తెలీదు, గవర్నమెంటు మారిందిగనుక.

కా : మరేం భయంలేదు. ఎవరిమీదైనా ఎవరైనా నేరం ఆరోపించవచ్చు. దేశద్రోహులను మేం కనికరించం.

కు : ఎవరిమీదేనా, ఎవరేనా నేరం ఆరోపించవచ్చు-అంటే నేను కొంతమందిమీద ఆరోపిస్తా-ఆరోపించనా?

కా : ఊఁ, కానీ.

కు : ఈ మాజీ జడ్జీగారిమీద-

కా : తప్పు, తప్పు, కూడదు.

కు : ఏం? ఆయన పాత హయాంలో చిత్త మొచ్చినట్లు శిక్షలువేశాడు! నిరపరాధులను దండించాడు. అర్థం లేని నేరాలకి అంతకన్నా అర్థంలేని శిక్షలువేశాడు. జన్మజన్మాలకీ ఆ శిక్షలు వర్తించేటట్టు చూశాడు. మరి వీడిని దండించాలి.

కా : అబ్బాయీ! నువ్వు కుర్రాడివి. నీకు తెలీదు. పాత సాంఘిక వ్యవస్థలో ధర్మాల ప్రకారం ఆయన వర్తించారు. అది ఆయన తప్పుగాదు. ఆ సాంఘిక ధర్మాల తప్పు !

కు : మరీ పెట్టుబడిదారుల అడుగులకి మడుగులొత్తాడు. అది ద్రోహంకాదూ?

కా : ఈ క్షణం అది ద్రోహమే. కాని అతడు కిందటి క్షణంలో తప్పు చేశాడు. అప్పుడు అది తప్పు కాదు. ఆ సాంఘిక వ్యవస్థ చెడ్డదే. అందుకే అది పోయింది. దానిస్థానే కొత్తదేముడిగారి రాజ్యం

వచ్చింది. ఈ రాజ్యంలో పెట్టుబడిదారులు వుండరు, అంతా ప్రభుత్వమయిన దేముడి గారి దే!

కు : పోనీ ఆ జడ్జీగారిమీద కేసు పెట్టకూడ దంటే మానేస్తా. ఈ పోలీసువాడిమీద నేరం ఆరోపిస్తా—

కా : తప్పు, తప్పు.

కు : తప్పేంటి-తప్పు! వీడు ఎన్ని ద్రోహాలు చేశాడు. ఎన్ని అత్యాచారాలు చేశాడు. బానిసలు స్వాతంత్ర్యంకోసం పోరాడినప్పుడు గర్భిణీ స్త్రీలను సైతం కనికరించలేదు. స్త్రీ పురుషులనీ యువకులనీ, పిల్లల్నీ, ముసలివాళ్ళనీ, అందరినీ సమానంగా లాఠీలతో చావమోదాడు. జైళ్ళలో పెట్టాడు. తుపాకులు పెట్టి కాల్చాడు. మానభంగాలు చేశాడు...

కా : నాన్సెన్స్. అది చేసినవాడి తప్పుగాదు. చేయించినవాడి తప్పు. చేయించినవాళ్ళ హయాం పోయింది.

కు : చేయించినవాడు చెయ్యమన్నా వీడు స్వంత సరదాకోసం హెచ్చుచేశాడు.

కా : సీజర్స్ వైఫీజ్ ఎబౌ సస్పిషన్. సీజరు పెళ్ళాం నేరం చేయదు. పోలీసువాడు నేరంచేశాడన్నవాళ్ళే నేరం చేసినట్టులెక్క. టేక్కేర్.

కు : ఆ! మీరంతా మారిపోయారే? వెనుకటి హయాంలో ప్రభువులు ఏమాట లన్నారో; ఆ మాటలే మీరూ అంటున్నారు. కవిగా మీరు అన్నమాటలని మీరు అప్పుడే మరచిపోయారా? చేనూడ్చేవాళ్ళకి;

చెమటోడ్చేవాళ్ళకి, కష్టంచేసి కడుపు నింపుకోలేని వాళ్ళకి మీరు ప్రతినిధికదా. వాళ్ళని హింసించిన వాళ్ళమీద పగ తీర్చుకోరా! పెట్టుబడిదారుల డబ్బునీ, భూమినీ బీదలకు పంచిపెట్టరా.

కా : ఇకమీదట స్వంతఆస్తులు ఎవరికీ ఉండవు. అంతా ఆ దేముడిదే. అందరూ దేముడికోసం కష్టపడి పని చేయాలి. పూర్వం పెట్టుబడిదారీ దేముడి హయాం లోని పనికన్నా హెచ్చు పని, ఆ నాడు పుచ్చుకొన్న జీతాలకన్నా తక్కువ జీతాలకి చెయ్యాలి. నోరెత్తితే అది నేరం.

కు : ఏమి టిదంతా? మీరు ఫాసిస్టులా?

కా : పెద్ద కబుర్లు చెప్పకు.

కు : ఏమిటో అనుకున్నా. కోళ్ళని తినేవాడు పోతే, గొర్రెల్ని తినేవాడు వచ్చాడు.

కా : షటప్.

ప్రా : యువర్ ఆనర్ ఈ అబ్బాయి నేరస్థుడు. పాతహయాం లో యీ అబ్బాయికి గోడకుర్చీ శిక్ష వేశారు. అది తప్పించుకొన్నాడు.

కా : పాత హయాంలో వాళ్ళు వేసిన కొన్ని శిక్షలు మేము ఆమోదిస్తున్నాం. ఈఅబ్బాయి గోడకుర్చీ వేయాలి.

కు : ఎంతమార్పు! ఏమండోయ్. మీరు కవిగా చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకోండి.

కా : కవి ఎవడు ? విప్లవంరాగానే కవి అవసరం తీరిపో యింది. పుస్తకాలన్నీ కాల్చేయండి. నేను చెప్పిన విజ్ఞానమే అందరికీ యివ్వాలి. ఏయ్ పోలీస్ ! యీ కుర్రవాడిచేత గోడకుర్చీ వేయించు.

కు : నేను ఎదురు తిరుగుతా. ఇకమీదటకూడా - ధనరా సుల ప్రక్కే దారిద్ర్యం - సుజ్ఞానపు క్షేత్రంలోనే అజ్ఞానపు బ్రహ్మజెముడు డొంకలు - ఆశ ప్రక్కనే నిరాశ - ఆనందం ప్రక్కనే ఆక్రందనం - వినోదం బదులు విషాదం - అడుగడుగునా విఘ్నాలు, ఆశ లకు అవాంతరాలు - ఆశయాలకు ఆనకట్టలు - ఆవే శాలకు చన్నీళ్ళు - అభిప్రాయాలకు సంకెళ్ళు - ఆలోచనలకు బేడీలు ...

కా : ఏయ్ - వీడి నోరునొక్కు.

ర.భ : (కుర్రాడి నోరు నొక్కుతాడు.)

కు : (నోరు నొక్కేలోపున)

దీర్ఘశ్రుతిలో - తీవ్రధ్వనితో
విప్లవశంఖం - వినిపిస్తానోయ్.

రక్షకభటుడు నోరుకట్టేస్తాడు.

కా : పడిశాడు. ఏయ్ పోలీస్, వీడి కళ్ళకు గంతలు, చేతికి బేడీలు వేసి పంజరంలో పెట్టు.

ర.భ : జరూర్ హుజూర్ !

కళ్ళకి గంతలు కడుతూండగా తెర.

—□—

## పాత్రలు:

జడ్జి - జగన్నాథం
భార్య - సీతమ్మ
కూతురు - ప్రమీల
ఇనస్పెక్టర్ - ప్రసాద్
డాక్టర్ - రామారావు
విశ్వనాథం
లోకనాథం
స్నేహితుడు - రంగనాథం

# న్యాయాధికారి

జడ్జి జగన్నాథంగారి యింటిలో—కచేరీగది. నోట్లో
గుడ్డలు కుక్కి—కాళ్ళూ, చేతులూ కట్టిన ఒక స్త్రీ
కుర్చీలో ఉంది. జడ్జిగారు టెలిఫోను చేస్తున్నారు.

జడ్జి : హలో హలో - ఈజ్ దట్ పోలీస్ స్టేషన్ ? నేను జడ్జీ జగన్నాథాన్ని - మాట్లాడుతున్నా. ఎవరది - ఇనస్పెక్టరేనా - జాగ్రత్తగా వినండి, చాలాకాలం నుండి నేరాలుచేస్తూ, ఘోరాలుచేస్తూ, తప్పించుకొంటున్న వ్యక్తిని పట్టిస్తాను. మా ఇంటికి రండి. అవును తప్పించుకొంటున్న వ్యక్తిని పట్టిస్తాను. అర్జెంటు - అవును మా ఇంట్లోనే! తొందరగారండి. ఆ-ఆ-అన్నీ ముఖాముఖీ చెప్తాను రండి.

టెలిఫోను పెట్టేసిన తప్పుడు.

జ : ఇంక భయం లేదు. వస్తారు పోలీసులు. న్యాయం జరుగుతుంది. నువ్వు మొత్తుకొన్నా, ఏడ్చినా ఏం లాభంలేదు. న్యాయం జరిగితీరాలి. పోలీసు లొచ్చి న్యాయం జరిగేదాకా నీ కట్లు విప్పను. అంతదాకా ఇలాగే పడివుండు.

ప్ర : నాన్నా - నాన్నా ! ఏమిటిది ?

జ : న్యాయం—న్యాయం—జరిపించడానికమ్మా.

ప్ర : నీకు మతి పోయినట్టుంది. అమ్మని కుర్చీకేసి కట్టే వెందుకు.

జ : న్యాయం జరిపించడానికమ్మా.

ప్ర : చాల్లే నాన్నా, విప్పు. నోట్లోగుడ్డలు కూడాకుక్కావు.

జ : విప్పకు. వద్దు – ప్రమీలా – వద్దు. మీ అమ్మ న్యాయానికి, ధర్మానికి అడ్డుగా వస్తున్నది. అంచేతే కట్టేను. పోలీసు లొచ్చేదాకా విప్పొద్దు. అదుగో విప్పొద్దంటే!

ప్ర : ఉండు నాన్నా, నీకు నిజంగా మతిపోయింది.

జ : (నవ్వి) మతిపోలేదు. ప్రమీలా– మతి పోలేదు. బుద్ధొచ్చింది. పరిగెత్తుకొంటూ పరిగెత్తుకొంటూ బుద్ధొచ్చింది. పరుగు పరుగున చెంగు చెంగున.

ప్ర : ఊరుకో నాన్నా! అమ్మా! అమ్మా! ఎలా ఉందమ్మా. గొంతుక నొప్పెడుతూందా? మంచినీళ్లు తేనా?

సీ : (సన్నగా హీనస్వరంతో) వద్దమ్మా. ఏమండీ పోలీసులకి ఫోనుచేసే దేమిటండీ?

జ : నేరంచేసిన వ్యక్తి పోలీసులకి స్వాధీనం కావాలి. వాళ్ళే ఆరోపణ చేస్తారు. న్యాయాధికారి వింటాడు, శిక్ష వేస్తాడు. ఇది ప్రొసీజరు... పద్ధతి.

సీ : చాల్లెండి. కోరి కోరి కొరివితో తలగోక్కుంటా నంటారేవండీ. నా మాటవిని___

జ : నీమాట? ఆడదానిమాట ఎప్పుడూ వినకూడదు. ఆడదానిమాట వింటే అధోగతే. 'స్త్రీ బుద్ధిః ప్రళ

యాంతకః' అని పెద్దలే అన్నారు. నీమాట చస్తే వినను.

ప్ర : పోలీసులేమిటమ్మా, ఏం జరిగింది చెప్పు?

సీ : మీ నాన్నగారు పోలీసులకి ఫోనుచేశారు.

జ : అవును చేశాను. వాళ్ళిప్పుడే వస్తారు.

ప్ర : ఎందుకు?

జ : ఎందుకేమిటి? న్యాయం, న్యాయం జరిపించడానికి. అందుకు పోలీసులు మొదటిమెట్టు.

ప్ర : ఏమిటో ఏం బోధపడకుండా ఉంది. అమ్మా ఏమిటమ్మా ఇదంతా. నాన్నా ఏమిటి? ఎందుకు-ఎందుకిదంతా? అమ్మ నెందుకు కట్టేశావు? నోట్లో గుడ్డలెందుకు కుక్కావు?

జ : అడ్డొస్తుంది. అనవసరంగా జోక్యం కలిగించుకొంటున్నది. కాళ్ళా వేళ్ళా పడింది. కావలసినపని కానివ్వకుండా కాల్చుకుతినడం మొదలెట్టింది. కనికరించకుండా కట్టిపారేశాను. దేముడిచ్చాడు కాదా అని నోరుచేసుకోడం మొదలెట్టింది. నోరు నొక్కేశాను. గుడ్డలు కుక్కేశాను. కుక్కిన పేనులాగ కూర్చుంది. కామ్‌గా పోలీసులకి ఫోనుచేశాను.

ప్ర : అంత అగత్యం ఏమొచ్చింది? స్వంతభార్యను...

జ : ప్రమీలా, నీకు తెలీదు. కట్టుకున్న పెళ్ళాంకానీ, కన్నతండ్రేగానీ, కడుపున పుట్టిన కొడుకే అవనీ, న్యాయానికీ ధర్మానికీ అడ్డొస్తే కనికరించకూడదు. హరి

శ్చంద్రుడేం జేశాడు? కాటిసుంకం చెల్లిస్తేగాని కన్న కొడుకునైనా కాల్చడానికి వీల్లేదని కరడుకట్టిన హృదయంతో కటువుగా కాలదన్నాడు. తాళికట్టిన ధర్మపత్ని తలకొట్టడానికికూడా తటపటాయించలేదు. తయార్ అన్నాడు. అదీ సత్యవాక్య పరిపాలన అంటే. అదీ ధర్మ సంస్థాపన అంటే.

ప్ర : అంతా హరిశ్చంద్రులేనా.

జ : అవాలి. అవును. అంతా హరిశ్చంద్రులవాలి, అప్పుడే ప్రపంచం బాగుపడుతుంది. న్యాయం జరుగుతుంది.

ప్ర : ఏమిటి నాన్నా, మాటిమాటికీ న్యాయం న్యాయం అంటావు. నువ్వు రిటైరు అయిపోయావుగా.

జ : అవును. అయ్యాను- రిటైరయ్యాను, నిన్నతో రిటైరయ్యాను.

సీ : అయినా- యీ లేనిపోనివి తెచ్చిపెట్టుకొంటా రేమండీ!

ప్ర : నీ కెందుకు నాన్నా-రిటైరయ్యావు. రామా కృష్ణా అనుకోకుండా.

జ : అక్కడే పొరబడుతున్నావు. న్యాయం జరిపించడం నిన్నటిదాకా నాఉద్యోగధర్మం; నేటినుంచీ వ్యక్తి ధర్మం. అందుకే చిత్తశుద్ధి, పాపభీతి, దేశభక్తిఉంటే ప్రతి పౌరుడూ చెయ్యవలసిన పనిచేశాను. పట్టుబడకుండా తప్పించుకొంటున్న వ్యక్తిని పట్టిస్తానని పోలీసులకి ఫోనుచేశాను. వస్తారు, నెరవేరుస్తారు.

ఇనస్పెక్టరు : నమస్కారం జడ్జిగారూ, నమస్కారం.

జ : వచ్చావా—నూరేళ్ళాయుస్సు.

ఇ : ఏమిటి, అర్జంటుగా రమ్మని ఫోను చేశారే.

ప్ర : ఏం లేదు ప్రసాద్—నాన్న వట్టినే—

జ : వట్టినే రమ్మనలేదు. గట్టి కారణం ఉంటే రమ్మన్నాను.

సీ : ఆయన మాటలకేం బాబూ, ఏం లేదు వెళ్ళిపో

ఇ : అదికాదండీ—జడ్జిగారు ఫోను చేశారు.

సీ : అదేం లక్ష్యపెట్టకు. వారేవో—

ప్ర : అవును ప్రసాద్. నాన్న ఊరికే—

జ : ఊరికే కాదంటూ వుంటే.

ప్ర : దయచేసి నువ్వెళ్ళు ప్రసాద్.

ఇ : కాదు ప్రమీలా.

ప్ర : నేను చెబుతున్నానుగా, ప్రసాద్-

జ : ఇనస్పెక్టర్ ప్రసాద్! నువ్వు మా బంధువుగా-మిత్రుడిగా-మా అమ్మాయిని పెళ్ళిచేసుకొనే యువకుడిగా ఈ యింటికి రాలేదు. ఉద్యోగ ధర్మంలో వచ్చావు. అది నెరవేర్చి మరీ వెళ్ళు. నీ డ్యూటీని నువ్వు నెరవేర్చడంలో బంధుప్రీతి, పక్షపాతం చూపెట్టావంటే పై అధికారులకి నిన్ను గురించి రిపోర్టు చేస్తాను. జాగ్రత్త.

ఇ : అయితే సరే, చెప్పండి జగన్నాథంగారూ! ఎందుకు పిలిపించారు?

జ : ఎందుకు పిలిచానో ఫోనులో చెప్పానే.

ఇ : చెప్పారు. మళ్లా చెప్పండి. అక్కర్లేదు. ఎవరా వ్యక్తి? నేరాలుచేసి పట్టుబడకుండా తప్పించు కొంటున్న వ్యక్తి ఎవరు?

జ : ఎరెస్టు చేస్తావా?

ఇ : చేస్తాను.

జ : ఎవరైనా చెయ్యాలి సుమా.

ఇ : ఊ... చే—స్తా—ను. చెప్పండి, ఎవరా వ్యక్తి?

జ : నేనే.

ఇ : ఎవరు ! మీరా?

ప్ర : నాన్నా, నువ్వా ?

జ : అవును— నేనే ఆ వ్యక్తిని.

ఇ : నమ్మలేకుండా ఉన్నాను, మీరు నేరాలు చేసి తప్పించుకొంటున్నారంటే, ఎవరేనా నవ్విపోతారు ?

జ : కాదు. మొగంమీద ఉమ్మిపోతారు. గుప్పెడు దుమ్ముతీసి నామీద జల్లిపోతారు ?

ప్ర : ఏమిటి నాన్నా ఇదంతా? నువ్వు నేరాలు చేయుడ మేమిటి; అమ్మని కుర్చీకి కట్టెయ్యడమేమిటి ? నాకేం బోధపడడంలేదు.

ఇ : అయోమయంగా వుంది మీ అమ్మగార్ని కట్టేరా ?

జ : అవును కట్టేను. అడ్డొస్తే కట్టాను.

ప్ర : అంతేనా! అమ్మేదో నేరం చేసిందని వప్ప చెబు తున్నా వనుకొన్నా. అయినా అంతా అదోలా

ఉంది. అమ్మాయినా, నువ్వాయినా ఏం నేరాలు చేస్తారు?

ఇ : అవును. మీరేం నేరం చేశారండి?

జ : నేనేం నేరాలు చేశానో మీకు తెలియదు. ఎవరికీ తెలియదు. అంతా నేను మంచివాణ్ణనే అనుకొంటారు. పరువుతో పదవితో పలుకుబడితో నా నేరాలు కప్పిపుచ్చాను. అయినా పాపం పండక తప్పదు. నిజాన్ని దాచలేం. ఎప్పుడో ఒకప్పుడు దొరికిపోక తప్పదు. ఇవాళ కాకపోతే రేపు—ఇక్కడ కాకపోతే అక్కడ—దొరికిపోక తప్పదు.

సీ : ఏమండీ! ఏమిటీ వేదాంతం?

జ : ఏయ్, నువ్వు అడ్డురాకు.

సీ : అదికాదండీ.

జ : అదికాదు లేదు, ఇదికాదు లేదు. ఊరుకో! ఇనస్పెక్టర్ ప్రసాద్! ఏవయ్యా ఇనస్పెక్టర్, ప్రసాద్! నన్ను అరెస్టు చేస్తావా; లేదా?

ఇ : ఏం నేరం చేశారో తెలియందే, వారంటు లేందే; ఎల్లా చెయ్యను?

జ : ఏ నేరం చెయ్యకుండానే యాభై అయిదేళ్ళు నిండాయంటావా? నేను నేరం చేశానయ్యా. తప్పించుకు తిరుగుతున్నానంటే వినిపించుకోవేం... ఏం మాట్లాడవ్? చేస్తావా; లేదా?

ఇ : ఉండండి. ప్రమీలా, ఇలారా, చిన్నమాట.

జ : ఎక్కడికీ, ఎందుకు? పక్కకి వెళ్ళి మాట్లాడ్డమేం, నాముందే మాట్లాడండి. నాకు లేని భయం మీ కెందుకు?

ఇ : అదికాదులెండి. రా ప్రసూనా.

కొద్ది విరామం.

ఇ : ఏమిటి ప్రసూనా, ఏమిటి? మీ నాన్నగారి ధోరణి చాలా వింతగా ఉందే.

ప్ర : ఏమో ప్రసాద్—నాకేం బోధపడడం లేదు.

జ : ఒంట్లో ఏమేనా—

ప్ర : ఏం లేదు. రాత్రిదాకా బాగానే ఉన్నారే—

ఇ : రాత్రి?

ప్ర : నిద్ర పట్టటం లేదన్నారు. నాలుగేసేదాకా పాత డైరీలు చదువుకొంటూ కూర్చున్నారు. నేను తెల్లారుఝామునే మామూలుగా లేచాను. నాన్న కూడా రోజులాగ మార్నింగ్ వాకుకి వస్తారను కున్నా. నిద్రపోతున్నారు. రిటైరయిన తొలిరోజు ఎందుకు లేపడం అనుకొన్నా. నామట్టుకు నేనొక్క ర్తెనే షికారు వెళ్ళొచ్చాను. వచ్చేసరికి ఇంత జరిగింది.

ఇ : బహుశా కొంచెం అప్‌సెట్ అయివుంటారు. ఎందు కేనా మంచిది—

జ : (కేక) ఏమయ్యా ప్రసాద్ — ఏమిటారహస్యాలు? నన్ను ఖరస్టు చెయ్యదలచుకోలేదా ఏం? ఇలారా.

ఇ : పద. ప్రమీలా, లాభం లేదు.

జ : ప్రభుత్వోద్యోగంలో ప్రమత్తత. ప్రయత్న పూర్వకంగా ప్రమాదం జరగడానికి ప్రస్తుతం నువ్వు ప్రగాఢంగా కుట్ర పన్నుతున్నావని నేను ప్రవాద వేస్తున్నాను. సమర్థించుకో. పారిపోవడానికి అవకాశం కలిగిస్తున్నాననుకొంటున్నావు కాబోలు. నేను పారిపోను. ఎందుకు, టెలిఫోను దగ్గరకి వెడుతున్నావ్?

ఇ : కొంచెం టెలిఫోన్ చెయ్యనీయండి.

జ : ఎవరికి? ఎందుకు? నన్ను ఎరెస్టు చెయ్యాలో; అక్కర్లేదో పై అధికారులను కనుక్కోడానికా? నేను చెపుతున్నానుగా-విను. క్రిమినల్ ప్రొసీజరు కోడ్ సెక్షన్...

ఇ : జగన్నాథంగారూ, కొంచెం ఉండండి. హలో.— హలో —ఎవరు? డాక్టరు రామారావా. చూడు బ్రదర్-జడ్జీ జగన్నాథంగారింటికి ఒక్కసారి—

జ : డాక్టరా? వారెందుకూ? అనవసరం. అక్కర్లేదు. నేను—

ఇ : రా బ్రదర్-వెంటనే-

జ : వద్దు—నాకు డాక్టరక్కర్లేదు. ఏ.యస్ ప్రసాద్! ఆ ఫోను పెట్టేస్తావా, లేదా?

ఇ : ఉంటా డాక్టర్.

జ : డాక్టరట డాక్టరు! డాక్టరెందుకు? ఇప్పుడు పిలవవలసింది, ప్లీడర్ని. గాని నాకు ప్లీడరక్కర్లేదు? నాపక్షం

నేనే వాదించుకోగలను. అయినా వాదించను. ముద్దాయే నేరారోపణ చేసుకొంటున్నప్పుడు సమర్థించడానికి డిఫెన్సు ప్లీడర్సు శుద్ధదండుగ. ఏవయ్యా ఇనస్పెక్టర్, నన్ను అరెస్టు చేస్తావా; లేదా ?

సీ : ఊరుకోండి—మీ పుణ్యముంటుంది ?

జ : పాపం చేశాను మొర్రో అంటే, పుణ్యమంటావేమిటి?

ఇ : జగన్నాథంగారూ—మిమ్మల్ని ఎరస్టు చేస్తాను. తప్పకుండా చేస్తాను. అయితే మీరు చేసిన నేరం ఏమిటో చెప్పండి.

జ : నేను జడ్జీగా ఉన్నప్పుడు తప్పుడు శిక్షలు వేశాను.

ఇ : మీ అంత నిష్పక్షపాతమైన జడ్జీ మరొకరు లేరని నిన్ననేకదా, బార్ బారంతా మిమ్మల్ని అభినందించారు. మీరు తప్పుడు శిక్షలు వేశారంటే——

జ : ఎవరూ నమ్మరు. అంతేకాదూ నువ్వనేది? నేను ఎంతమందిని ఉరి తీయించానో నీకు తెలుసా? ఎన్ని కుటుంబాలని నిరాధారం చేశానో తెలుసా! నా మూలంగా ఎంతమంది యావజ్జీవం కటకటాల వెనుక కన్నీళ్ళతో కాలం గడుపుతున్నారో నీకు తెలుసా ?

ఇ : నేరం చేసిన వాళ్ళనే కదండీ మీరు శిక్షించారు.

జ : శిక్షించాను. నిర్దాక్షిణ్యంగా శిక్షించాను. నిర్మొహమాటంగా మాట్లాడేను. గాని పదేళ్ళతో పోయేదానికి పాతికేళ్ళు వేసే వాడిని—తెలుసా !

ఇ : మరి మీరు శిక్ష వేస్తే అప్పీలు కూడా ఉండేదికాదు కదండీ?

జ : అవును. అదే నాజిత్తులమారి తనం. అందుకే నాకు ప్రాయశ్చిత్తం కావాలి, శిక్ష పడాలి.

ఇ : జడ్జీగారూ, నేనొక్కమాట చెప్తాను కోపగించుకోరు గద!

జ : చెప్పు.

ఇ : అలా కూర్చోండి.

జ : కూర్చోడమా! అపరాధి కూర్చోడమా? వీల్లేదు.

ఇ : ఉద్రేక పడకండి. కూర్చోండి. ఇన్నాళ్ళూ ఉద్యోగానికి అలవాటు పడ్డారు. ఇవాళ రిటైరయ్యారు. నిన్నరాత్రి మీ డైరీలు మీరు చదువుకొన్నారు. అనుభవం ఆలోచనా శక్తి పరిపక్వతకి వచ్చిన యీ వయస్సులో పాతరోజుల్లోని మీ ప్రవర్తన మీకు తప్పుగా కనబడవచ్చు. అందుకే—

జ : నా మీద తీర్పు చెప్పడానికి నీకేం అధికారం ఉంది. న్యాయాధికారికి తప్ప నన్ను పరీక్షించి శిక్ష వెయ్యడానికి మరెవ్వరికీ హక్కు లేదు. నువ్వు పోలీసు ఆఫీసరివి. ఎరస్టుచేసి కోర్టులో హాజరు పెట్టేదాకే నీవిధి. అది నువ్వు చూసుకో.

ఇ : మీరు ఎరెస్టు చెయ్యదగ్గ నేరం చేశారని నాకు తోచడంలేదు. ఋజువు లేదు సాక్ష్యాలుఆధారాలు—

జ : లేకేం—బోలెడున్నాయి.

రం : ఒరే జగన్నాథం. నాకు అన్యాయం చేశావు కదరా.

జ : విను—అదుగో నా స్నేహితుడు రంగనాథం కేక— విను.

రం : జగ్గా! నువ్వూ, నేనూ బాల్యస్నేహితులం, ఆప్త మిత్రులం కదా. నా కేసుదగ్గరపడింది. నువ్వు నాకు శిక్ష వెయ్యవనుకొన్నాను. వేశావురా దుర్మార్గుడా; వేశావు.

జ : నన్నేం చెయ్యమంటావురా రంగా !

రం : విశ్వాసఘాతుకుడా.

జ : రంగా రంగా ఆగు.

రం : ఆగనా. ఎందుకుఆగాలి?ఆగను. నీ ప్రాణానికి ఉసూరు మంటూ సాగిపోతా. ఆగను. ప్రాణమిత్రుడ వను కొన్నాను. గర్భశత్రువివై అయ్యావు.

జ : నువ్వు నేరంచేశావుగదరా.

రం : నేరం - ఏమిట్రా నేను చేసిన నేరం. పిల్లకి పెళ్ళి చేశాను. అదానేరం. ఆ పెళ్ళిలో కట్నం ఇచ్చాను. అదా నేరం. ఆ కట్నానికి డబ్బు చాలకపోతే అప్పు చేశాను. అదా నేరం.

జ : అదే నేరం.

రం : పుచ్చుకోడం నేరంకాదురా! పుచ్చుకొని - వారికి పోవడం నేరం. గాని, నా నేరానికి అంత శిక్ష వెయ్యాలిరా.

జ : వెయ్యాలి. వెయ్యక తప్పలేదు. వేశాను.

రం : వేశావు. నా పరువు తీశావు. నా కుటుంబాన్ని నాశనం చేశావు. నాకూతురు కాపురం మంట గలిపావు.

జ : నన్నేం చెయ్యమంటావు. లంచం పుచ్చుకోనేముందే అన్నీ నువ్వు ఆలోచించుకోవలసింది.

రం : శిక్ష వేసే ముందు నువ్వేం ఆలోచించక్కర్లే దన్నమాట. లంచం ఇచ్చిన వాడే అది లంచం కాదు; పాత బాకీ అని చెప్పాడు కదరా. ఆ సాక్ష్యం ఎందుకు నువ్వొప్పుకోలేదు ?

జ : సాక్ష్యం ఇచ్చినవాడి తాహతు, పరువు ఖాతరు చేయదగ్గవి కావు కాబట్టి.

రం : అవును నువ్వెందుకు ఖాతరు చేస్తావు-లోకులెలాపోతే నీకేం. భ్రష్టయినా, మట్టి కొట్టుకుపోయినా, మంట కలిసినా నువ్వెందుకు ఖాతరు చేస్తావు. నువ్వు తాహతు గలవాడివి;-పరువు గలవాడివి.

జ : నువ్వు మీ ఆఫీసు డబ్బు కూడా కైంకర్యం చేశావు కదరా.

రం : ఆ తరవాత కక్కేశానుగా. లోటు భర్తీ చేశానుగా.

జ : అసలు లోటెందుకు రావాలి ?

రం : నా జీవితంలో లోటెందుకొచ్చిందో ఆలోచించావా? అది ఆలోచించవు. ఎవరూ ఆలోచించరు.

జ : అది శాసనాల ప్రకారం శిక్ష వేసేవారు ఆలోచించవలసిన విషయం కాదు. శాసనాలు చేసేవాళ్ళు ఆలోచించాలి.

రం : న్యాయానికి కళ్ళు లేవని వట్టినే అన్నారా? నువ్వు కళ్ళు లేనివాడివి. ప్రపంచాన్ని చూడవు. ప్రపంచం లోని అనాథల్ని చూడవు. వాళ్ళ బాధల్ని చూడవు. అన్నీ వింటావు. విను-విను-సాక్ష్యాలు విను-వారితో బాటు నాకడుపుమంటకూడావిను. నా సంసారం ఎలా నాశనం అయిందోవిను. నువ్వుచేసిన అన్యాయం ఏమిటో విను.

జ : విన్నావా ప్రసాద్, రంగనాథం ఏం చెప్పాడో. విన్నావా?

ప్రసా: ఏమిటండీ—రంగనాథం ఎవరు?

జ : వినలేదూ. రంగనాథం చెప్పింది వినలేదూ? ఇక్కడి కొచ్చాడే, అన్నీ చెప్పాడే.

ప్రసా : మీలో మీరు ఏదో మాట్లాడు కొంటున్నారు. అంతే. ఇక్కడికెవరూ రాలేదు. ఏం చెప్పలేదు.

జ : ఇదిగో ప్రసాద్. నేనంటే నువ్వు పక్షపాతం వహిస్తు న్నావు. పనికిరాదు.

ప్రసా : నేనేం పక్షపాతం వహించడంలేదు. మీరుచేసిన నేరం ఋజువుకాలేదు.

జ : ఇంకా ఋజువు కాకపోవడం ఏమిటి? అర్థం ఉంది. మోసంవుంది. అంతా ఋజువు అయింది. రంగ నాథం లంచం పుచ్చుకొన్నాడని నేనే నా చేతులతో శిక్ష వేశాను.

ప్రసా : అది నేరం ఎలా అవుతుంది?

జ : కాదూ. నేరమే. నా బాల్య స్నేహితుడు; ప్రాణ మిత్రుడు లంచం పుచ్చుకొంటే కేసు కొట్టెయ్యడానికి వీలున్నా శిక్ష వేశాను.

ప్రసా : కొట్టెయ్యడానికి వీలుంటే ఎందుకు కొట్టెయ్యలేదూ? ప్రాణమిత్రుడి కేసుకదా అని—

జ : పక్షపాతం వహించి కొట్టేశానను కుంటారు. లోకం అలా అనుకోవడం నాకు యిష్టంలేదు. అందుకే మితి ఎంతో అంత శిక్ష వేశాను.

ప్రసా : లోకం అనుకొంటుందని కాదు- మీ మనస్సే మిమ్మల్ని బాధపెడుతుందని వేశారు.

జ : ఏమయితేనేం; వేశాను.

ప్రసా : అయినా అది నేరంకాదే—

జ : అది నేరంకాదు-స్నేహితుడు ఏ లంచం పుచ్చుకున్నందుకు శిక్షించాలో ఆ లంచం నేనే పుచ్చుకున్నానయ్యా, అందుకు నన్ను ఎరస్టు చెయ్యవేం?

ప్రసా : మీరు-మీరు లంచం పుచ్చుకున్నారా? నమ్మలేని మాట. సిఫార్సు, పక్షపాతం లంచం అనే మాటలే మీరున్న చోటుకి ఆమడ దూరంలో ఉంటాయే... మీరు లంచం పుచ్చుకోడమేమిటి?

ప్ర : నిజమేనా నాన్నా—

జ : నిజమే-నీకోసం- నీ పెళ్ళి చేయడానికి లంచం పుచ్చుకొన్నాను. ప్రసాద్‌కి కట్నం ఇవ్వడానికి పుచ్చుకొన్నాను.

ప్రసా : నాకు కట్నం ఇవ్వడానికా ? నేను కావాలనలేదే!

జ : అన్నాళ్ళు జడ్జీ పనిచేసిన వాడిని, హోదా గలవాడిని అల్లుడికి కట్నం ఇవ్వలేదంటే నాకెంత నామోషీ.

ప్ర : ఇంతకీ మనకి డబ్బులేకపోతే కద! అంత లంచం పుచ్చుకోవలసినంత ఏ మొచ్చి పడింది.

జ : రిటైరు అయిపోతున్నాననే భయంతో ముందు జాగ్రత్తలు పడ్డా, లంచం తీసుకొన్నా. నా ఆఖరి కేసులో లంచం తీసుకొన్నా. నా స్నేహితుడు రంగనాథం కూతురు పెళ్ళికోసం లంచం పుచ్చుకొన్నాడు. అలాగే నేనూ పుచ్చుకొన్నా. వాడికి శిక్ష వేశాను. నాకూ పడాలి.

ఇ : జగన్నాథంగారూ, అంతా మీరు ఊహించుకొంటున్నారేమో! నిజం కాదను కొంటాను.

జ : నిజంకాదూ. నిజం కాకపోవడం ఏమిటి? ప్రమీలా, వెళ్ళి నా మేజా సొరుగులో పదివేల రూపాయల నోట్ల కట్టలుంటాయి పట్టుకురా. వెళ్ళు. వెళ్ళవేం. సీతా నువ్వు తీసుకురా. సరే నేనే తెస్తా.

ఇ : ఏమండీ సీతమ్మగారూ, నిజమేనా, ఇదంతా నిజమేనంటారా ?

సీ : ఏమిటో బాబూ.

ప్ర : నాన్న తీర్పు చెప్పిన ఆఖరి కేసు చాలా పెద్దకేసు. వారసత్వం కేసు. అయినా ఆయన లంచం పుచ్చుకొన్నారంటే—

జ : నమ్మండి-నమ్మితీరండి-ఇదిగో రూపాయలు! చూడ వయ్యా-చూడు. సాక్ష్యం కనబడిందా. ఈ పాపిష్టి డబ్బుకి నా ఆత్మని అమ్మేశాను. కళంకంలేని నా కీర్తికి, పేరుకి, ప్రతిష్టకి మచ్చ తెచ్చుకున్నాను.

ఇ : ఇది మీరు లంచం పుచ్చుకొన్న సొమ్మని సాక్ష్యమేమిటి! మీ కష్టార్జితం కాకూడదా.

సీ : మొన్న బ్యాంకిలోంచి డబ్బుతీశారు కదండీ.

ప్ర : నీ ఫిక్సెడు డిపాజిట్టు తీస్తున్నానని చెప్పావు కదా నాన్నా.

ఇ : జగన్నాథంగారూ, నామాట విని మీరు హైరాన పడకండి. గోల చెయ్యకండి.

జ : గోలా, ఇది గోలా. నిజం చెప్తే గోలంటావేం?

రామనాథం : నమస్తే సార్! ఏం బ్రదర్ ప్రసాద్, అర్జెంటుగా ఫోనుచేశావు. ఎవరికి వంట్లో బాగులేదు?

జ : ప్రసాద్‌కి బాగులేదు, మా ఆవిడకి బాగులేదు, ప్రమీలకి బాగులేదు.

ఇ : ఏం లేదు బ్రదర్, జడ్జిగారు కొంచెం —

జ : కొంచెమేమిటి, జాస్తీగానే లంచం పుచ్చుకొన్నా. చూడు డాక్టర్, ఈ నోట్లని పరీక్షించు. ఇవి లంచం పుచ్చుకొన్న నోట్లో; కావో నువ్వే చెప్పు?

రా : మీ చెయ్యి ఒక్కసారి ఇలా ఇయ్యండి.

జ : నోట్లని పరీక్షించవయ్యా అంటే నా చెయ్యిమ్మంటా వెందుకూ?

రా : మీ చెయ్యి చూస్తేనే గాని చెప్పలేను.

జ : అయితే చూడు, ఇవి లంచం పుచ్చుకొన్న నోట్లే కదూ ?

రా : జడ్జీగారూ, లీడింగ్ క్వొశ్చెన్సు వెయ్యకూడదండీ.

జ : అబ్జెక్షన్ సస్టెయిన్డు. సరే నీ నిష్పాక్షికమైన రిపోర్టు కోర్టువారికి దాఖలు చేసుకో.

రా : ఇవి-ఇవి- లంచం పుచ్చుకొన్న నోట్లుకావు, అందు చేత—

జ : అబద్ధం. కావూ-కావూ— అంతా అబద్ధం.

రా : మీరు కొంచెం రెస్టు తీసుకోవాలి. ఆరాటపడకుండా ఈ సోఫాలో కూర్చోండి.

జ : న్యాయం జరగాలి. జరిగితీరాలి. ప్రసాద్-ప్రసాద్- నన్ను ఎరస్టు చేయకపోతే వూరుకోను.

ఇ : క్షమించాలి. నేను చెయ్యలేను.

జ : చెయ్యవూ— నేనే— టెలిఫోను—— చేస్తా——సూపర్నెం టుకి టెలిఫోనుచేస్తా—హాలో—హాలో. మీ రేనా— నేను జడ్జీ జగన్నాథాన్ని-సాక్ష్యం చూపెట్టినా మీవాడు ... ఇన్‌స్పెక్టరు ప్రసాద్-నన్ను అరెస్టు చెయ్యడం లేదు-అవును-ఏమిటీ- మీరు అతనితో మాట్లాడు తారా-మంచిది-ఏవయ్యా ప్రసాద్-మీ దొర నీతో మాట్లాడుతాడట-మాట్లాడు.

ఇ : యస్ సార్ ... యస్ ... అవునండి నేను నమ్మలేనండి ... వారు లంచం పుచ్చుకొన్నారు ... లంచం పుచ్చు

కొంటూవుంటే దొరకలేదు...అవును ... యస్ సార్ ... అవునండి...యస్...అలాగేనండి...

జ : ఏం, ఏవన్నాడు.

ఇ : అరెస్టు చెయ్యమన్నాడు.

జ : చెయ్యమన్నాడూ–చెయ్యమన్నాడూ? నాకు తెలుసు–న్యాయం జరిగితీరుతుంది. ధర్మం గెలుస్తుంది. చెయ్యి–ఎరస్టుచెయ్యి.

ఇ : కాని–మీరు లంచం పుచ్చుకొనేదీ లేదు–మేము చేసేదీ లేదు.

జ : ఆ–ఏవిటీ...

ఇ : మీరు రెస్టు–తీసుకోండి.

రా : కేసువాయిదా పడింది. మీరు ఈమాత్ర వేసుకొంటారా? ఒంటికి మంచిది.

జ : నిద్రకి మందిస్తున్నావా – నాకు నిద్రకి మందిస్తున్నావా? నా కేమందూ అక్కర్లేదు.

సీ : చూడండీ మీరు–

జ : నువ్వేం మాట్లాడకు–ఏం ప్రసాద్, లంచం పుచ్చుకొంటూ ఉంటే నేను దొరకలేదనా మీ అభ్యంతరం–సరే చూస్తూ ఉండు – దొరికిపోయే యోగం నాకుంది. అందుకే అంత లంచం ఒక్కసారి పుచ్చుకోలేదు. ఇప్పుడు–వస్తారు–ఇస్తారు–మీరంతా లోపలకి వెళ్ళండి——

రా : మీరీ మందు వేసుకొంటే వెళ్ళిపోతాం.

జ : వేసుకొంటా—ఏం ప్రసాద్, ప్రత్యక్షంగా దొరికి పోతే పట్టుకొంటానని మాటయిస్తావా ?

ఇ : సరే—అలాగే.

జ : అయితే అంతా లోపలకి వెళ్ళండి.

ఆవలిస్తాడు.

రా : రండి—ఏం భయం లేదు.

జ : (ఆవలిస్తూనే) భయం... భయం...

రా : నిద్రపడుతుంది. అందులో అంతా సర్దుకొంటుంది.

ఇ : ఏం ప్రమాదం కాదుకద.

రా : అబ్బే — మనిషి మామూలుగానే ఉన్నాడు. కొంచెం ఉద్రేకం, అంతే—

సీ : ఏమో డాక్టర్ బాబూ, నాకు బెంగగా ఉంది.

రా : మీరేం బెంగ పెట్టుకోకండి. ప్రసాద్, మీవాడినిలా సోఫామీద పడుకోబెడదాం రా. యస్—ఆ—ప్రమీలా ఆ దిండు అందుకో.

ప్ర : ఏమాత్రం సేపు నిద్ర పడుతుందంటావ్—

రా : ఆరేడు గంటలు నిద్రపట్టాలి.

ఇ : అయితే—పద—పోదాం...

ప్ర : ఉండు ప్రసాద్, నువ్వు అప్పుడే వెళ్ళిపోతావేం.

సీ : మీ రిద్దరూ కొంచెం ఇంట్లోనే ఉండండి బాబూ.

రా : అలాగేనండి.

ఇ : ఆ గదిలో కూర్చుందాం...

క్షణం విరామం.

గడియారం ఎనిమిది గంటలు కొడుతుంది.

వి : జడ్జీగారూ—జడ్జీగారూ—జగన్నాథమూ !

లో : జగన్నాథంగారు పడుకొన్నారయ్యా, విశ్వనాథం.

వి : సోఫాలో నిద్రపోతున్నారే?

లో : నిద్రలేచారని—తోటవాడు చెప్పాడు.

వి : మళ్ళీ వద్దాం లోకనాథం.

లో : పద విశ్వనాథం.

జ : (నిద్రలేస్తూ) ఎ-వ-రూ- ఎవరది- విశ్వనాథమా?

వి : నమస్కారమండీ.

లో : చాలా థాంక్సండి. దరిశనం చేసుకుపోదామని-

జ : వెళ్ళిపోండి-వెళ్ళిపోండి. నాకు ఏమీ వద్దు.

లో : అదికాదు జడ్జీగారూ.

వి : నువ్వుండు లోకనాథం. జగన్నాథంగారూ, మీరు మా పక్షంలో తీర్పు చెప్పారు-అందుకు -

జ : బాబూ మీరు వెళ్ళండి. వెళ్ళండి విశ్వనాథంగారూ.

వి : చూడండి—మేమేదో ఇస్తామని చెప్పాం — సగం ఇచ్చాం—తక్కినది—

జ : నాకేం వద్దు—దయచేసి—

లో : లంచం తీసుకొంటామని మీరే వప్పుకొన్నారుగా.

వి : నువ్వుండు లోకనాథం. మావాడికి ఎవరిదగ్గర ఎలా మాట్లాడాలో ఏమీ తెలియదు—మంచీచెడ్డా...

జ : మీకో దండం—మీరు వెళ్ళండి.

వి : మీరు ఆగ్రహిస్తే మేం బతగ్గలమా ?

లో : ఇస్తామన్నాం—తీసుకొచ్చాం-పుచ్చుకోండి.

జ : (గావు కేక) వద్దు—తీసుకుపొండి - ఇదుగో ఇంతకు ముందు మీ రిచ్చినడబ్బు—ఇదికూడా పట్టుకుపొండి - నా జన్మలో-జడ్జీగా పనిచేసినంతకాలం దమ్మిడీ లంచం పుచ్చుకోలేదు. నా వ్రతం చెరపకండి. పట్టుకుపోండి.

వి : మీరేం-డబ్బు ఇచ్చినందుకు తీర్పు చెప్పలేదుగా. న్యాయం మా పక్షాన ఉందని-

జ : మీరు డబ్బు పట్టుకెళతారా—

లో : మీరు - మా మాట కాదనకూడదు. కాగితంమీద మీరు సంతకం పెట్టడమేవిటి; లక్షలకి లక్షలు నాకొచ్చి కలిశాయి. ఇందండి - తీసుకోండి.

ఇ : ఆ—అప్పుడే లేచిపోయారే—

రా : ఆశ్చర్యంగా ఉందే—ఆమందు ఆరుగంటలైనా పని చెయ్యాలే.

లో : పోలీసులు బాబోయ్! పోలీసులు.

ఇ : ఎవరు మీరు?

వి : జడ్జీగారు-ఏమిటండీ ఇది-మమల్ని పోలీసులకి పట్టిస్తారా? ఇది మీకు ధర్మమేనా ?

లో : క్షమించండి బాబూ, ఇనస్పెక్టరుగారూ క్షమించండి.

జ : ప్రసాద్—?

ఇ : నిజమే నన్నమాట - మీరు ఇందాక చెప్పినమాట నిజమే నన్నమాట.

జ : ఇందాక ఏం చెప్పాను ? ఏం చెప్పలేదే—

రా : ఈ అయిదు నిముషాల నిద్రలో అంతా మరిచి పోయారు.

జ : నిద్రేమిటి డాక్టర్—

రా : ఏం లేదులెండి.

జ : నువ్వెందుకొచ్చావ్ ? నాకేం చేసింది?

రా : ఏం లేదండి.

ఇ : ఈ డబ్బేమిటి ?

వి : క్షమించాలి.

ఇ : భోగాపురం వారసత్వం కేసువాళ్లు మీరేనా?

లో : (వణుకుతూ) అ—అ—అవున—నండీ—

ఇ : లంచం ఇస్తున్నారా ? చెప్పండి- నిజమేనా జగన్నాథంగారూ.

జ : అవును ప్రసాద్. ఇంత బతుకూ బతికి ఇంటివెనక చచ్చినట్టు—ఇన్నాళ్ళూ పవిత్రంగా; పరువుగా—నీతిగా నిజాయితిగా బతికాను—ఇప్పుడు-హీనంగా-నీచంగా -

వి : రక్షించండి ఇన్స్పెక్టరు గారూ ! జగన్నాథంగారు వద్దంటూనే ఉన్నారు. మేమే మా సంతోషం కొద్దీ-

జ : నా మర్యాదా మంటగలిపారు. పరువు బజారుకి ఈడ్చారు. కలలోకూడా కానీ లంచం పుచ్చుకోనని నాచేత, కాళ్ళావేళ్ళాబడిపుచ్చుకొనేదాకా కాల్చుకు

తిన్నారు, పుచ్చుకొన్నాను. ఇన్‌స్పెక్టర్-పుచ్చుకొన్నాను. కానీ-ఇక-నీ విధి కానియ్.

ఇ : ప్రత్యక్షంగా పట్టుబడ్డావు.

జ : అనుకొంటూనే ఉన్నా-ఎంత కళ్ళు మూసుకు పాలు తాగుతున్నా-పిల్లి పట్టుపడక తప్పదు. లోకాన్ని మూసేందుకు మూకుడు ఎక్కడా ఉండదు. హఠాత్తుగా పోలీసులు పట్టుకొంటారని మొదటినుంచీ అనుకొంటూనే ఉన్నాను. అనుమానిస్తూనే ఉన్నా-అనుకొన్నంతా అయింది.

లో : ఇంకెప్పుడూ చెయ్యం-వొదిలెయ్యండి-ఇన్‌స్పెక్టరుగారూ. మీరుకూడా కొద్దిగాఏదో-తృణమో-పణమో.

వి : నువ్వుండు లోకనాథం! ఇన్‌స్పెక్టరుగారూ, కొండంత దేముడికి కొండంత పత్రి కాదుగాని...

ఇ : నాకు లంచం ఇస్తామంటున్నారా?

వి : లంచమని కాదు- ఏదో-

ఇ : నోరు ముయ్యండి.

జ : అదీ నిజాయితీ అంటే. మంచిది. ప్రసాద్, నాలాగ మెత్తపడకు___ఎరస్టు చెయ్.

లో : విశ్వనాథం - నాకొంప తీశావు. దుంపతెంపావు. లంచాలు పుచ్చుకొనే జడ్జీగారు కాదయ్యా అంటే విన్నావుకాదు. చివరకి-చూడు. ఎరస్టు చేయిస్తున్నాడు. దగాకోర్. ఈ జడ్జీ మోసగాడు.

వి : నువ్వొండు లోకనాథం. ఏవిటండీ జడ్జీగారూ? మీరు చెప్పి...

జ : ఏం లాభం లేదు. ఇచ్చినందుకు మిమ్మల్నీ, పుచ్చు కొన్నందుకు నన్నూ ఎరస్టు చెయ్యక-

ఇ : తప్పదు.

ప్ర : ప్రసాద్, ఏమిటీ?

సీ : ఏమిటి నాయనా?

ఇ : జడ్జీగారు చెప్పిందంతా నిజమే. ఇదుగో ప్రత్యక్షంగా దొరికిపోయారు.

ప్ర : ఆఁ...నాన్న లంచం పుచ్చుకొన్నారా!

జ : పుచ్చుకొన్నానమ్మా-

ప్ర : ప్రసాద్-ప్రసాద్-నాన్నని ఎరస్టు చేస్తావా?

జ : చెయ్యక తప్పదమ్మా.

ప్ర : కాబోయే మామగారిని ఖైదు చేస్తావా.

జ : చెయ్యాలి-కాబోయే మామగారుకదా అని కనికరించ కూడదు. కట్టుకొన్న పెళ్ళాంకానీ, కన్న తండ్రేగాని, కడుపున పుట్టిన కొడుకే అవనీ, న్యాయాన్నీ, ధర్మాన్నీ జరిపించేటప్పుడు...కరక్కూడదు. హరిశ్చంద్రు డేం చేశాడు? కాటి సుంకం చెల్లిస్తేగాని కన్న కొడుకునైనా కాల్చడానికి వీల్లేదని కరడుగట్టిన హృదయంతో కాలదన్నాడు. తాళి గట్టిన ధర్మపత్ని తలకొట్టటానికి కూడా తటపటా

యించలేదు. తయ్యార్ అన్నాడు. అదీ సత్యవాక్య పరిపాలన అంటే, అదీ ధర్మ సంస్థాపన అంటే—ప్రసాద్—నువ్వు నాకు నచ్చావు; తీసికెళ్ళు—నన్ను తీసుకెళ్ళు.

సీ : నాయనా, నీకాళ్ళు పట్టుకొంటా. వారిని అరెస్టు చెయ్యకు.

ప్ర : ప్రసాద్, మాట్లాడవేం ప్రసాద్.

ఇ : ఏం చెయ్యను-ప్రమీలా.

ప్ర : అంతేనా-

జ : రా-ప్రసాద్-నా చేతులకి బేడీలు వెయ్యి-తీసుకెళ్ళు-న్యాయం జరిపించు.

ఇ : పదండి.

సీ : ఏవండీ - ఏవండీ - వెళుతున్నారా—మీరు - మీ అంతట మీరు అరెస్టు చెయ్యమని కోరుకొంటారా? జైలు కెళ్తారా.

జ : వెళ్ళక తప్పదు.

సీ : వెళ్ళండి. ఆ జైల్లోనే కూర్చోండి. ఇంతకాలం పరువుగా బతికిన బ్రతుకు బండలయితే చూస్తూ కూర్చోండి. ఏ కూతురు పెళ్ళికోసం లంచం పుచ్చుకోడానికి ఇష్టపడ్డారో; ఆ కూతురు పెళ్ళి ఆగిపోతే ఆ జైల్లో కూర్చొని ఆనందించండి. కల్లో కూడా కానీ లంచం పట్టరనే మీ పేరూ ప్రతిష్ట పరువూ మర్యాదా-మంటకలిస్తే మహారాజులాగ జైల్లో

కూర్చొనండి. మీరు జైలుకెళ్ళాక మేము అవమానం భరించలేక నుయ్యో గొయ్యో చూసుకొంటే అదికూడా విని ఆనందించండి, – వెళ్ళండి.

జ : సీతా.

సీ : కానియ్యండి.

జ : ప్రసాద్—పొరపాటైంది అంతా పొరపాటు.

ఇ : పొరబా టేమిటి ?

జ : ఇది లంచంకాదు.

లో : కాదండి—నిజంగానే కాదు.

ఇ : కాకపోతే మరేమిటి ?

లో : ఏమిటా? ఏమిటంటే...

వి : నువ్వుండు లోకనాథం. ఇన్‌స్పెక్టరుగారూ...

ఇ : ఏం ?

జ : మీరూరుకోండి. నేచెప్తా. ప్రసాద్ నేనేదో మతిస్థిరంలేక మాట్లాడాను. అవేం పట్టించుకోకు.

ఇ : ప్రత్యక్షంగా కనబడే ఈ డబ్బు సంగతేం చెప్తారు ?

జ : ప్రసాద్, నువ్వు—నువ్వు—నా కాబోయే అల్లుడివి ఇలా అంటావా ?

ఇ : ఆ విషయాలెందుకు ?

జ : మా ప్రమీల మొఖంచూసి—

ఇ : ఇది లంచం కాకపోతే మరేమిటి-

జ : ఏమిటా-నాయిల్లు అమ్మేస్తున్నా. అందుకు వీళ్లు ఎడ్వాన్సు-ఎడ్వాన్సు ఇస్తున్నారు.

లో : అవునండి—ఇది ఎడ్వాన్సే.

ఇ : ఆ సంగతి కోర్టులో ఋజువు చేసుకోండి.

జ : అంతేనా?

ప్ర : ప్రసాద్, నాన్నని—

ఇ : ఏం చెయ్యమంటావు ప్రమీలా? మీ నాన్నగారు సూపర్నెంటుకి ఫోను చేశారు. పై అధికారులదాకా వెళ్ళింది. నేనేం చేయలేను.

ప్ర : ప్రసాద్.

ఇ : నడవండి జగన్నాథంగారు-ఊఁ... మీరూనూ.

లో : విశ్వనాథం. నా దుంప తెంచావు... కొంపతీశావు.

వి : నువ్వుండు లోకనాథం. పదండి ఇన్‌స్పెక్టరుగారూ.

జ : సీతా, ప్రమీలా—వెళతా.

ప్ర : (ఏడుస్తూ) నాన్నా.

సీ : ఏవండీ—

ఇ : డాక్టర్—వాళ్ళని కొంచెం చూస్తూవుండు బ్రదర్.

రా : అలాగే బ్రదర్.

కొంచెంసేపు విరామం.

ప్ర : డాక్టర్‌గారూ...(ఏడుస్తూ)

రా : ఊరుకో ప్రమీలా.

సీ : ఏం బాబూ—వారికి మతి స్థిరంగా లేదనిచెప్తే ఒదిలెయ్యరా.

రా : ఎలాగమ్మా—నిన్న వీడ్కోలు సభలో అంత బాగా మాట్లాడారు—వారికి మతి పోయిందంటే ఎవరూ నమ్మరు.

సీ : కాదు బాబూ, పొద్దున్న చూశావుగా.

రా : ఏమో—అంతా న్యాయాధికారి చేతిలో ఉంది.

ప్ర : న్యాయాధికారి – నాన్న కూడా నిన్నటిదాకా న్యాయాధికారే. ఇవాళ నేరస్తుడు. డాక్టరుగారూ ఆ నిద్రమందు—

రా : వారిమీద పని చెయ్యలేదు. మనసుఆరాటపడినప్పుడు అదేం పని చెయ్యదు.

ప్ర : పది——పదిహేను మాత్రలు వేసుకొంటే——

రా : ప్రమాదం——ప్రాణం పోతుంది.

ప్ర : థాంక్స్ డాక్టరుగారూ...థాంక్స్.

టెలిఫోను ధ్వని.

ప్ర : (అందుకొని) హలో ! సూపరింటెండెంటుగారా... నమస్కారం. మా నాన్నగారు కావాలాండీ. పిలుస్తాను దయచేసి ఒక్కనిమిషం...(ఆగి)ప్రసాద్,ప్రసాద్... ఫోన్ కాల్ నీకు.

ఇ : (వచ్చి) ఫోన్ కాలా....

ప్ర : మీ సూపరింటెండెంటుగారు.

ఇ : నమస్కారం. నేనండీ ప్రసాద్‌ను, ఏమిటంటారూ...

జడ్జీ జగన్నాథంగారే కావాలా... ఒక్క నిమిషం (ఆగి) జగన్నాథంగారూ... మిమ్మల్నే పిలుస్తు...

జ : ఆఁ, నేను, జగన్నాథాన్ని ... (ఆగి) ఆఁ... ఆఁ... అరెస్టు చేశాడు. (నవ్వి) బాగా అన్నావు. (ఇంకా నవ్వి) అవును. అంతాఅనుకొన్నట్టే—మరేం, చూడూ, ఏక పుత్రికనిచ్చి పెళ్ళి చేసేముందూ - ఈ మాత్రం పరీక్షచేసి వుండొద్దంటావా మరి...ఆఁ ఫరవాలేదు.. నా కిక ధైర్యమే...నా అంతవాడూ కాని— మరోటికాదు... ఓ ఏమిటి! ప్రసాద్‌ను పిలవనా... (తృప్తిగా, అల్లాగే, ప్రసాద్, ప్రసాద్ ...మీా సూప ర్నెంటు—

ప్ర : (ఆశ్చర్యం) ఏమిటి నాన్నా—ఇదంతా—

జ : న్యాయం జరిపించడానికమ్మా—

ఇ : నమస్కారం. నేను ప్రసాదువండి... అహ, చిత్తం... అల్లాగాండి. ఐతే ఇదంతా నాటకం అంటారా... నమ్మలేకున్నాను. అఁహ. న్యాయం జరిపించే యోగ్యత నాకుందో లేదో అని, యీపరీక్ష చేశారా జడ్జీగారు... ఎంతపని, తమ కిదంతా తెలుసు నన్న మాట. ఓహో, అందుకా పట్టుబడితే అరెస్టు చెయ్య మన్నారు ఇందాకా...మంచి పరీక్షే చేశారు... కృతజ్ఞుణ్ణి... జీవితాంతం గుర్తుంచుకుంటూ — ఆఁ ఏమిటీ... (ముసిముసి నవ్వు) రేపు మా పిల్లలకీ ఈ పాఠమేనా—నమస్కారం... మరివుంటా.

ప్ర : ఏమిటి ప్రసాద్ ఇదంతా...

ఇ : ఏమంండీ జగన్నాథంగారూ, బలే నాటకంఆడా శే...

జ : (గంభీరంగా) అవునోయ్. కట్టుకొన్న పెళ్ళాంకానీ, కన్న తండ్రేకానీ, కడుపున పుట్టిన కొడుకే అవనీ, న్యాయానికీ ధర్మానికీ అడ్డొస్తే కనికరించ కూడదు. హరిశ్చంద్రు డేంచేశాడూ...? అదీ సత్యపరిపాలన అంటే. అదీ ధర్మపరిపాలన అంటే —

ప్ర : (సంతోషంతో) బాగుంది నాన్నా.

—: o :—

## ఇందలి పాత్రలు :

యువకుడు
కోపం
ఆడగొంతుక
పంతులు
నాయుడు
మొదలియారు
యువతి
తమ్ముడు

—□—

# పార్కు బెంచీ

## ప్రస్తావన

యువకుడు : ఈఊరులోని, ఒకానొక పార్కులోని రాతి బెంచీ ఒకటి రోజూ నాతో మాట్లాడుతూంటుంది. నమ్మండి. మరోసారి చెప్తా. ఈఊరులోని ఒకానొక పార్కులోని రాతిబెంచీ ఒకటి నాతో రోజూ మాట్లాడుతూంటుంది. నేను పొరబడడం లేదు. పార్కుబెంచీ ఏమిటి, మాట్లాడడమేమిటి–అని మీరు కొట్టిపారేకండి. పార్కుబెంచీకూడా మాట్లాడగలదు.

కదలిక ఉన్నమానవుడు, కదలిక లేని రాయిని దేముడిగా పూజిస్తున్నాడు. మానవుడు ఆలోచించ గలడు. మానవుడు తాను సృష్టించిన దేముడు తనని సృష్టించాడని ఆలోచించేడు. దేముడు ఆలోచించ గలడని మానవుడు ఆలోచిస్తున్నాడు. మానవుడి ఊహలో దేముడు రాయి. దేముడు ఆలోచించ గలి గితే రాయి ఆలోచించగలదు. ఈ వాదం మీరు ఒప్పుకోరు. నాకు తెలుసు. పోనీ మరోకలాగ చెప్తా.

మానవుడు ఆలోచించగలడు. తనలో తాను ఆలోచించుకున్న విషయాలను ఇతరులకు ప్రకటించ గలడు. ఆకలివేస్తే ఆహారంకోసం అన్వేషించగలడు. అతనిలాగ ఆలోచించగల ఇతర జంతువులూ,

ఆహారం కోసం అన్వేషించగల జీవకోటీ అతనిలాగ అభిప్రాయ ప్రకటన చేయలేకపోయినా గొంతుకతో, ఏదో ఒక శబ్దాన్ని చేయగలవు. ఆలోచించగలవు. వాటిలో అవి మాట్లాడుకో గలవు. ఇక అచర జీవ కోటో? వాటికీ ఆహారం అవసరమే. ఉన్నచోటనే ఉండి – లేక ఉన్నట్టుకనబడి – మనకు కనబడని నేల కింద ఆహారాన్ని సంపాదిస్తాయి. అవి ఆలోచించవు. వాటిలో అవి సంభాషించవు. సరే ఇక జడ పదార్థాలో – కదలవు. ఆహారాన్ని కావాలనవు – ఆలోచించవు. మాట్లాడవు. జడపదార్థాలకి ఉదాహరణలు కుర్చీ, తోలు సంచీ, మొదలైనవి. అయినా ఇవి జీవంలేనివా? కావు, ఒకనాడు సజీవమైనవే. చచ్చిపోయిన చెట్టు శవాన్ని ముక్కలుచేసి ఆకట్టుతో మనం కుర్చీ తయారు చేస్తున్నాం. చంపిన పశువుల చర్మాన్ని సంచీలుగా కుట్టుకొంటున్నాం. అవి చని పోయిన జీవపదార్థాలకిందే జమ. పూర్తిగా ఏనాడూ జీవంలేని, ఎన్నడూ చలనంలేని, ఏకోశానా ఆకలి దప్పులులేని జడపదార్థాలూ ఉన్నాయి. అందులో రాయి ఒకటి. రాయిలో శక్తిలేదా... కదలిక లేదా... రాయిని విసిరికొడితే ఎదురుగుండా ఉన్న గాజుపలక బద్దలవుతుంది. దానికి కదలిక ఎక్కణ్ణుంచి వచ్చింది. గాజుపలకని బద్దలుచేసే శక్తి ఎక్కణ్ణుంచి వచ్చింది. మానవుడే ఇచ్చాడు. రాయికి కదలికనీ,

శక్తినీ ఇవ్వగలిగిన మానవుడు దానికి మాట్లాడే శక్తినీ ఆలోచించగల శక్తినీ ఇవ్వలేడా? ఇవ్వ గలడు. కాబట్టి నేను ఈ ఊరులోని, ఒకానొక పార్కు లోని రాతిబెంచీకి ఈ శక్తులు ప్రసాదించేను. అందుకే అది రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది.

ఏం, పార్కు బెంచీ ఎందుకు మాట్లాడకూడదూ? ఏమిటీ? మాట్లాడినా ఏమిటి మాట్లాడగలదు? అని అంటున్నారా? చెప్తా వినండి. మనలాగే, ఏ యుగంలో జీవిస్తున్నదో, ఏసంప్రదాయంలో పెరి గిందో వారి ప్రభావాల ప్రతిబింబ కిరణాలనే ప్రసా రం చేస్తుంది. పౌరాణిక కాలంలో రాయి ఒకటి ఆలోచించింది. మాజీ-అహల్య అనే రాయి, తర తరాలుగా రాముడి రాకకోసం ఎదురు చూస్తున్న శబరిలాగే నిర్వేదపడి ఉంటుంది. నిరీక్షించుతూ, నిట్టూర్పు విడుస్తూ పక్కనున్న చెట్లతో సంక్రం ధనుడు చేసిన ద్రోహాన్ని ఆక్రందనంతో పూసగుచ్చి నట్టు చెప్పిఉండవచ్చు. పౌరాణిక కాలం అయింది. ఇక పుక్కిటి పౌరాణిక కాలంలో, కాశీ మజిలీల కట్టుకథల్లో, పేదరాసి పెద్దమ్మ వినికిడి చేసే వింత కథల్లో భయంకర మాంత్రికుల మాయల్లోపడి పాశాల్లో చిక్కుకుని కామానికి గురిమై, నీచానికి ఒప్పుకోనకి రాళ్ళుగామారిన ఛప్పన్న దేశాల రాకుమార్తెలు వివిధ రకాలుగా విలాపించేరు.

రాళ్లుకూడా తాముజీవిస్తున్న యుగంలోని శైలిలోనే మాట్లాడుతాయి. మానవుడు దేవుడుగా పూజించే రాయి ఆదికాలంలో అయితే ఆభాషే మాట్లాడేది. ఇప్పుడు మనభాషే మాట్లాడుతుంది. అలాగే ఈఊరు లోని, ఒకానొక పార్కులోని రాతి బెంచీఒకటి రోజూ నాతో మనభాషలోనే మాట్లాడుతూ ఉంటుంది.

కోపం : చాలించవయ్యా. ఇందాకట్నుంచీ చూస్తున్నా. నా దుఃఖంలో నే ఉంటే ఒకటే గొణుగుడు. ఈ పార్కులో కూర్చోనివ్వవా; ఏమిటి ?

యువ: కూర్చోనివ్వక పోవడానికి నేనెవణ్ణి.

కో : అరె. నేను అనదలచుకొన్న మాటని నువ్వే అనేస్తు న్నావే. బతేవాడి లాగున్నావ్. నీపేరేమిటి ? నా పేరు ...

యువ: పేర్లెందుకు లెండి. నేను చెప్పినది విన్నారా. మీ అభిప్రాయ మేమిటి ?

కో : నాకేం వినబడ లేదు.

యువ: అయితే నామీద ఎందు కీ కోపం.

కో : ఒక్కముక్కా వినబడలేదనే. పోనిండి. ఇప్పుడు చెప్పండి వింటాను.

యువ: ఈపార్కులోని ఒకానొక రాతిబెంచీ రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది.

క్రో : నిజంగా...

యువ: మిమ్మల్ని చంపుకు తిన్నట్టు.

క్రో : ఏమని మాట్లాడుతూ ఉంటుంది ?

యువ: ఏమని మాట్లాడుతోందా. వివిధ మనస్తత్వాలుగల మానవుల్ని పరిశీలించి విభిన్న దృక్పధాలుగల మతాలను ఆకళింపుకొని వైరుధ్యం ఉన్న భావాలను సమన్వయంచేసి కావ్యాన్ని రచించే మహాకవిలాగ మాట్లాడుతుంది.

క్రో : ఇంతకీ ఏమని మాట్లాడుతుందో చెప్పారుకాదు.

యువ: ఒక్కొక్కప్పుడు - రాళ్ళనుకూడా కరిగించే విషాద గాధలను చెపుతుంది.

క్రో : నిజంగా ఆగాధలు అంత విషాదకరమైనవా ?

యువ: నాకు నిజం. మీకు అబద్ధం.

క్రో : అయితే - ఆగాధలు రాళ్ళని కరగించే విషాద గాధలయితే మరి ఈపార్కు బెంచీ ఎందుకు కరిగి పోలేదూ?

యువ: కరిగి పోలేదని ఎవరన్నారు ?

క్రో : ఆ...కరిగిపోయిందా ... నువ్వు అబద్ధమాడుతున్నావు.

యువ: లేదు, నిజమే. అబద్ధమాడితే నాకు ఒరిగేదేదీ లేదు. ఆ పార్కుబెంచీ కరిగిపోయింది. ఇసుకలో కలసి పోయింది. అందుకే నేను ఇలాకూర్చున్నా.

కో : ఏమిటయ్యోయ్. గడికో మాట అంటున్నావ్. క్షణం కిందట ఒకానొక రాతిబెంచీ రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుందన్నావ్. ఇప్పుడు ఆపార్కు–బెంచీ ఇసుకలో కరిగిపోయిం దంటున్నావ్. ఏది నిజం?

యువ: రెండూ నిజమే. పార్కు–బెంచీ ఇసుకలో కరిగి పోయింది. అయినా అది రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది.

కో : పోవయ్యా. నువ్వెవరో – పిచ్చావిళ్ళా ఉన్నావ్. నీతో నాకేమిటి వాదన?

యువ: నేను పిచ్చివాణ్ణికాదు. నామాట వినండి. నేను పిచ్చివాణ్ణికాదు.

కో : నువ్వు మమ్మాటికీ పిచ్చివాడివే.

ఆడగొంతు: కాదు. అతడు పిచ్చివాడు కాదు.

కో : నువ్వెవరివి?

ఆడ : నేనే అతనితో మాట్లాడే పార్కు–బెంచీని.

కో : చాలు, నువ్వూ పిచ్చిదానివే.

యువ: కాదు. ఆమె పిచ్చిదికాదు.

కో : సరిపోయింది. ఆమే పిచ్చిదికాక, నీవూ పిచ్చివాడివి కాకపోతే మధ్య నేనా పిచ్చివాణ్ణి. మాబావుంది.

ఆడ : కోప్పడకండి. అతడు ఇందాకట్నుంచి చెప్పినదంతా అక్షరాలా నిజం. రోజూ నేను అతడితో మాట్లాడుతూ ఉంటాను. నా బాధలని గాథలుగా అతడికి విన్నవించుకొంటాను,

కో : నీకు మరేం పని లేదేమిటి?

ఆడ : అవును. మరేం పనిలేకనే - శ్రద్ధగావినే శ్రోతఉంటే కథచెప్పడం కన్న మరేం మంచిపనిఉంది. వింటా నంటే మీకూ చెప్తాను.

కో : సరే-చెప్పు వింటాను.

ఆడ : అయిదేళ్ళ కిందటిదాకా ఇప్పుడు మాట్లాడే పార్కు-బెంచీమీద పింఛను పుచ్చుకొన్న ఉద్యోగులు కూర్చుంటూ ఉండేవారు. వాళ్ళు రోజూ సాయంత్రం నాలుగు అయేసరికి సరిగ్గా వచ్చి తిష్ఠవేసేవారు. ఈపార్కు-బెంచీమీద విశాలంగా కూర్చుంటేముగ్గురు-ఇరుక్కుని కూర్చుంటే నలుగురూ పడతారు. గానీ యీపింఛను పుచ్చుకొన్న ఉద్యోగులు ఎనమండుగురు. ఈపార్కు బెంచీమీద నలుగురు కూర్చుంటే తక్కిన నలుగురు ఇంటిదగ్గర్నుంచి తెచ్చుకొన్న గోనె మీద పట్టాపరుచుకొని కింద కూర్చునేవారు. వాళ్ళ స్నేహం చాలా గాఢమైనది ఈ ఎనమండుగురిలో ఏ ఒక్కడురావడం కొంచం ఆలస్యమైనా వాళ్ళల్లో ప్రతి ఒక్కరూ చాలా బాధపడేవారు. ఒకవేళ ఆరోజు హాజరు కాకపోతే తతిమ్మావాళ్ళకి ఆరాత్రి కునుకు పట్టేదికాదు. అంతటి అన్యోన్యంగా వాళ్ళు ఉండే వారు. వాళ్ళందరూ పరిపూర్ణ జీవులు. ప్రతిఒక్కరూ మనుమల్ని, మనుమరాళ్ళనీ ఎత్తిన సంసారులే. అశేష మైన అనుభవాలనీ, అపారమైన దుఃఖాలనీ అనేక

మైన సుఖాలనీ రుచి చూచినవాళ్ళు. వీళ్ళు ఈ పార్కు బెంచీని తమస్వంతం చేసుకొన్నారు. మరె వ్వరూ ఈవైపు రావడమే మానేశారు. వీళ్ళు రోజు రోజూ అనేకమైన విషయాలను చర్చించే వాళ్ళు.

నాయుడు: అయితే పంతులు బావగారూ, హిట్లరు గెలు స్తాడూ?

పంతులు: గెలుస్తాడోయ్ నాయుడూ, గెలుస్తాడు. హరి శ్చంద్రుడు అబద్ధం ఆడినా ఆడవచ్చుగానీ హిట్లరు ఓడిపోడం కల్ల.

నా : మరి – చర్చిలు...

పం : చర్చిలు లేదు, కుర్చీలు లేదు. ఎవరెన్ని చెప్పినా, హిట్లరు జాతకంలో చక్రవర్తి యోగం రాసిఉంది.

మొదలియార్: అన్నట్టు బంతులూ... జాతకం అంటే గుర్తొచ్చింది. మీ చాతకాల బావకి నా చాతకం ఇయ్యిమీ...

పం : ఇచ్చేను మొదలియారూ. నిన్ననే ఇచ్చాను. చంద్రుడిలో రవి వెళ్ళగానే మీ మూడో వాడికి పెళ్ళవుతుందని చెప్పాడు.

ఆడ : ఇలా యుద్ధంలోంచి జ్యోతిష్యంలోకి సంభాషణ మారేది. ఇంకొక మాటు–

పం : అమ్మయ్యా అయిపోయింది ఒక చాప్టరు. నాయుడూ, చదివావా న్యూసు!

నా : ఆ, చదివాను. అయితే పంతులుగారూ, హిట్లరోడి పోయా జేమంక్షీ?

పం : నే చెప్పలేదోయ్. హరిమీద గిరి పడ్డా, ఆరునూరయినా హిట్లరు ఈదెబ్బలో ఓడిపోక తప్పదని.

నా : నేన్నమ్మను పంతులుగారూ. ఈపేపరువాళ్ళూ...

పం : పేపరువాళ్ళూ లేదు, గీపరు వాళ్ళూ లేదు. జాతకంలో రాసిపెట్టినది అక్షరాలా జరిగి తీరాలి. గ్రహగతుల్ని మార్చటం మానవమాత్రుల తరమా? హిట్లరు జాతకం మన మనుకొన్నట్టూ– దాఖలా ఇచ్చిందా, లేదా! జ్యోతిష్య మంటేనే అంత.

మొ : అన్నట్టు బంతులూ, చాతకం అంటే గుర్తొచ్చింది. మీ చాతకాల బావగారికి నాది ఇయ్యిమీ.

పం : ఇచ్చేను మొదలియారూ, నిన్ననే ఇచ్చాను. కుజుడిలో శని వెళ్ళగానే మీ మూడో వాడికి పెళ్ళవుతుందని చెప్పాడు.

ఆడ : ఇలా అయిదేళ్ళపాటు వీళ్ళ సంభాషణలు ఈ పార్కు బెంచీ విన్నది. వీళ్ళసంభాషణల్లో యుద్ధమూ జ్యోతిషమే కాక, రవంతసాహిత్యం, కాస్త శృంగారము, కాస్త పురాణం, కొంచెం వేదాంతం, కించిత్తు స్వవిషయం, రోజూ దొర్లుతూ ఉండేవి. ఐదేళ్ళపాటు వీళ్ళ సంభాషణలు విన్నాక ఈ పార్కు బెంచీకి విసుగెత్తింది. ఎందుకా. జీవితంలో వైవిధ్యం ఉండాలి. తదితర పార్కు-బెంచీలనుచూస్తే మొదట్లో

నాకు ఈసడింపుగా ఉండేది. వాళ్ళమీద గంట కొకడు కూర్చునేవాడు. మరి యీపార్కు బెంచీ మీదో. ఒకే ఒక కుటుంబంలాంటి ఎనమండుగురు వ్యక్తులు సరిగ్గా నాలుగయ్యే సరికి వచ్చి కూర్చునే వారు, ప్రపంచాన్ని కాచి వడబోస్తున్నా మనుకొనే వారు. తక్కిన ఏపార్కు బెంచీ జీవితంలో ఇంత సెక్యూరిటీ ఉంది? ఏక్షణంలో ఎవరువచ్చి కూర్చుం టారో వాళ్ళకే తెలీదు. నాసంగతా వడ్డించిన విస్తరి. అందుకే మొదట్లో గర్వపడ్డాను. గాని అయిదేళ్ళ పాటు దినములు పరస్పర ప్రతిధ్వనులు అయితే తక్కిన బెంచీలను చూసి అసూయపడ్డాను. వారి జీవి తంలో వైవిధ్యం ఉంది. నాలో లేదు. ఈపార్కు బెంచీమీద ఒడ్డుచేరుకున్న కాటికి కాళ్ళుచాచు కొన్న, పింఛను పుచ్చుకొన్న ఎనమండుగురు ముసలి వాళ్ళు తప్ప మరెవ్వరూ కూర్చోరు. తక్కినబెంచీల మీదో - అప్పుడే కాపరం పెట్టిన కొత్త దంపతులు- ఇంకా పెళ్ళికాని బ్రహ్మచారులు - ఎందుకూ పనికి రాని వాజమ్మలు, అంతా తెలిసిన సర్వజ్ఞులు, ఉద్యోగంపోయిన జర్నలిస్టు, సీటుదొరకని విద్యార్థి, చీకూచింతా లేని ధనవంతుడు, పాపం పుణ్యం ఎరు గని పసిపిల్లలు ఎంతరో మహానుభావులు కూర్చుం టారు. అందుకే తక్కిన బెంచీలను చూస్తే నాకు ఈర్ష్య పుట్టింది. ఏమైనాసరే తక్కిన పార్కు బెంచీల లాగ జీవించాలను కొన్నాను. నాటినుంచీ మనుష్యు

లతో మాట్లాడడం ప్రారంభించాను. ఈపార్కుబెంచీ మీద కూర్చుంటే గల లాభాలని వ్యాపార ప్రకటనల లాగ బిగ్గరగా యాకరువుపెట్టేదాన్ని. 'పిల్లలారా రండి. నాదగ్గరకి రండి? నేను చాలామంచిదాన్ని. మీకు ఎన్నో ఆటలు నేర్పుతాను. మీరు దొంగా టాడుకుంటే నేను తల్లినై కళ్ళుమూస్తాను. నాపక్కనే ఎంత చక్కటి పొదఉందో చూశారా. అందులో మీరు దాగుడుమూతలు ఆడుకోవచ్చు. రండి పిల్లల్లారా, నాదగ్గరకి రండి' - అని ఆహ్వానించేదాన్ని. అయినా ఈ ఎనమండుగురి ముసలివాళ్ళకి భయపడి ఏపిల్లా నాదగ్గరికి వచ్చేదికాదు. పోనీ ఈముసిలాళ్ళు తమ మనుమల్నీ మనుమరాళ్ళనీ వెంటతీసుకువస్తే కొంతకాకపోతే కొంతైనా సంతోషించేదాన్ని. వాళ్లు ఎన్నడూ అలాంటి పనిచేసేవారు కాదు. నాకు వళ్ళు మండేది. మళ్ళీ ఈపార్కుబెంచీమీద కూర్చుంటే గల లాభాలని వ్యాపారప్రకటనలాగ ఉద్ఘాటించే దాన్ని. 'కొత్తగా పెళ్ళయిన దంపతులారా, రండి. నాదగ్గరకు రండి. నేను చాలా మంచిదాన్ని. మీకు ఎన్నో సదుపాయాలుచేస్తాను. చూశారా,నాపక్కనే ఎంత చక్కటి పూలపొదరిల్లు ఉందో! దాని చాటున నీడలమాటున నా ఒడిలో మీరు కూర్చుంటే మిమ్మల్ని మరెవరూ చూడలేరు. చూసి కన్నుకుట్టుకోలేరు. మీకు ఏకాంతం ఇవ్వడం నా హామీ. మీరు మాట్లాడుకునే మాటలు మరెవ్వరికీ చెప్పను. ఒద్దంటే నేనే వినను. రండి.

నన్ను పావనంచేయండి. కొత్తగా పెళ్ళయిన దంపతులారా, రండి.' అని స్వాగతం పలికేదాన్ని. అయినా ఈ ఎనమండుగురి ముసిలివాళ్ళకీ భయపడి ఏజంటూ నా దగ్గరకి వచ్చేదికాదు. నాజీవితం చాలా దుర్భరం అయింది. బ్రతుకులో సాధించ దలచుకొన్నది సాధించలేకపోతే ప్రతీ క్షణం తీక్షణం అవుతుంది. ముళ్ళమీద కూర్చున్నట్టుంటుంది.

ఇలా ఉండగా నాఅదృష్టవశాత్తూ ఒకనాడు మూడుగంటల మధ్యాహ్నానికే ఒక యువకుడు ఈ పార్కు బెంచీమీద సేదతీరుతూ కన్నుమూశాడు. చుట్టూపచ్చపట్టు, తలమీద ఎత్తయిన గుబురుచెట్టు, పక్కనే దట్టమైన పొద! అతగాడికి ప్రాణం లేచి వచ్చిందో లేదో నాకుమట్టుకూ హాయి అనిపించింది. ఇతగాడు ఇలాగనే నాలుగు దాటేదాకా - సాయంత్రం ఎనిమిదిదాకా విశ్రమిస్తే వెయ్యిదేముళ్ళకు మొక్కుకొంటూనని ప్రార్థించుకొన్నాను.

నాలుగూ అయిదు నిముషాలు అయింది. యువకుడింకా నిద్రపోతున్నాడు. అప్పుడు-

పం : ఏమిటయ్యా నాయుడూ, ఏమిటీ విచిత్రం. ఎవరిక్కడ పడుకొన్నది?

నా : తెలీదండీ పంతులు బావగారూ. నిజంగా విచిత్రంగానే ఉంది.

మొద: లెగ్గొడుదునా...

పం : లేపు. మొదలియారూ, లేపు.

మొద: ఏ అయ్యా. లెయ్. బార్కే పండుకొందికి వీడా. వాసలా రెయ్ మిా.

నా : ఎవరీతడు. కుంభకర్ణుడి అమ్మమొగుళ్ళా ఉన్నాడు. లేవడేం ?

పం : పోనీ–నాయుడూ గోనెపట్టా పరుస్తా. కూర్చుందాం. అతడే లేస్తాడు. లేవకేం చేస్తాడు.

మొద: ఉండుమిా పంతులు – ఈసోంబేరి బిల్లకాయ ఎందుకు లెగవడో చూస్తాను. ఏఅయ్యా లెయ్. లేస్తువా లేదా ?

పం : చెయ్యి చేసుకోకు. మొదలియారూ, చెయ్యి చేసుకోకు. వాడేలేచిపోతాడు. రా. ఇలావచ్చి కూర్చో.

ఆడ : పంతులు మొదలియారుని శాంతపరచేడు. తరువాత శర్మ, రాజు, రావు, మూర్తి, అయ్యరూ వరుసగా వచ్చారు. ఈపార్కు బెంచీమిాద పడుకొన్న యువకుణ్ణి చూశారు. చుట్టూ కిందకూర్చున్న తమ సహచరులని చూశారు. ఒక్కొక్కడూ ఆ యువకుణ్ణి లేపుదామనే ప్రయత్నించి విరమించేరు. అందరూ గోనెపట్టామిాద, పచ్చపట్టుమిాదా కూర్చొన్నారు. ఏ ఒక్కరూ పూర్వపు స్వేచ్ఛతో మాట్లాడలేదు. నాకు మట్టుకు ప్రశాంతంగా ఉంది. మర్నాడు...

పం : మొదలియారూ, మళ్ళా ఈకుర్రాడెవడో ఇక్కడే పడుకొన్నాడే.

మొద: నేను నిన్న కొడ్తునూ అంటే ఊరుకోమంటివి. వాడు బండుకొనడా మరి?

పం : నాయుడింకా రాలేదేం? గోనెపట్టాలేదు. ఎక్కడ కూచ్చుందాం?

మొద: ఈసోంబేరి బిల్లకాయను లెగ్గొడుదును. కూర్చుదాం.

పం : ఒద్దు. ఈపిల్లి బ్రహ్మత్య మనకెందుకు? వాడు లేచేదాకా ఆబెంచీమీద కూర్చుందాం.

మొద: ఈరాస్కాలు లేచునా?

పం : లేవకపోతే పీడాపోయిరి. అక్కడపోయి కూర్చుందాం రా.

మొద: ఏమి బంతులూ - మన మొందుకు బోవలె అంటా. నీవు ఉండుమీ.

నా : నమస్కారం పంతులుగారూ. అరె! మళ్లా దాపురించాడా ఈ శని?

పం : ఏం నాయుడూ, ఇవాళ ఆలస్యంగా వచ్చావ్. గోనె పరుచుకు ఇక్కడే కూర్చుందామా; లేక ఆ రెండో బెంచీమీదపోయి కూర్చుందామా?

మొద: మనమొందుకు బోవలే అంటా. ఏమి నాయుడూ?

నా : అవును పంతులుగారూ, మనమెందుకు పోవాలి? ఇక్కడే కూర్చుందాం.

పం : ఎందుకు నాయుడూ. ఆబెంచీమీదకి పోదాం.

మొద: ఆ బెంచీమీదకి బోతే రేడిరో వినిపించునా,

నా : అవును పంతులుగారూ; అయిదేళ్ళనుంచీ అలవాటు పడ్డాం. ఇక్కడే కూర్చుందాం.

పం : అలవాటేమిటయ్యా. ఏదేళ్లు అలవాటుపడ్డ ఆఫీసు నుంచి ట్రాన్స్ఫర్ అయితే వెళ్లేమా, లేదా ? ఇదీ అలాగే అనుకుందాం.

నా : అరుగో తక్కిన వాళ్లంతా వస్తున్నారు. వాళ్లనీ అడుగుదాం. అందరికీ ఏది ఇష్టమైతే అదే చేద్దాం.

ఆడ : అందరూ వచ్చారు. అందరూ క్రితంరోజులాగే పచ్చ పట్టుమీదా; గోనె పట్టా మీదా కూర్చున్నారు. క్రితం రోజులాగే ముళ్ళమీద కూర్చున్నట్టే, సెగ ముందు ఉన్నట్టే కూర్చున్నారు. అందరూ చోటు మార్చడం మంచిదని నిశ్చయించుకొన్నారు. అప్పుడే చోటు మార్చేశారు. ఆ తరవాత వాళ్ళు ఏ మూలున్నారో నాకు తెలీదు.

ఆ మర్నాటినుంచీ నాజీవితం చాలా బాగా ఉంది. నాకు చిరవాంఛితాలన్నీ సమకూరేయి. ఈపార్కు బెంచీమీద మధ్యాహ్నం సేదతీరే యువకుడు కొన్నాళ్ళపాటు వరసతప్పకుండా బడలిక తీర్చుకొనే వాడు. అతగాడు ఒక కవి. ఉన్న ఊరులో ఉండలేక, తిండిలేక, ఉండడానికి చోటులేక - ఈమహానగరపు మహాపథాలలో పరిభ్రమిస్తూ జీవితంలో భ్రమిస్తూ ఉండేవాడు. రోజులో ఏదో వేళకు నాదగ్గరకు వచ్చి విశ్రమించేవాడు. పరిశ్రమించేవాడు. అతడు రాసిన

మహాకావ్యం నాసమక్షంలోనే ఉద్భవించడం నాకు గర్వకారణం. అతడు ఏమయినదీ తర్వాత చెప్తాను.

ఇంతలో వేసవి వచ్చింది. పగళ్ళు సెగల్లు, రోళ్లు పగులుతున్నాయి. వేడిగాడ్పులు ఈచెవిలోంచి ఆ చెవిలోకి కొట్టి రోజు చల్లపడగానే పేటంతా పార్కు చేరుకొనేది. వంటినిండా నగలతో, తలనిండా పువ్వులతో, చల్లని తల్లులు పిల్లలని వెంటపెట్టుకొని విహారానికి వచ్చేవారు. రోజల్లా ఆఫీసుల్లో విధిలేక చెమటోడ్చి సాయంత్రం అయేసరికి తెరిపినిపడి ఉద్యోగులు పార్కులో ఊపిరిపీల్చుకొనేవారు. ఇక రాత్రి ముదిరేక ఇళ్ళలో గాలిమూరక నిద్రపట్టని మొగరాయుళ్ళంతా చాపా దిళ్లూ పట్టుకొని చెట్ల కిందకి చేరుకొనేవారు.

ఈఋతువులో నా ఆనందానికి మేరలేదు. కొంత మంది గాయకులు నాచుట్టూ రాత్రుళ్ళు చేరేవారు.

ఒకనాడు సాయంత్రం ఒక జవరాలు తన రాలు గాయితమ్ముణ్ణి వెంటబెట్టుకొనివచ్చి ఈపార్కుబెంచీ మీద కూర్చుంది. మర్నాడుకూడా – ఆమర్నాడు కూడా – మూడోనాడు కూడా ...

యువతి : ఏవిరా తమ్ముడూ – ఇలాగ రమ్మంటే ...

త : నువ్వెళ్ళి కూర్చో అక్కయ్యా, నేను తరవాత వస్తాను.

యు : రమ్మంటే నీకాదురా. ఇలారా. ఉండుండు. నీపని పట్టిస్తా. రాత్రి ఇంటికి వెళ్ళాక నాన్నతో చెప్పి...

త : చెప్పుకో. నాకేం భయమా...

ఆడ : తమ్ముడు తుస్సుమని పారిపోయాడు. జవరాలు ఒంటిగా ఈపార్కు బెంచీమీద కూర్చొంది. అప్పుడు అలవాటు ప్రకారం ఇక్కడ సేదతీరే యువకుడు వచ్చాడు. జవరాలిని చూశాడు. జవరాలు అతణ్ని చూసింది. ఇద్దరి చూపులూ కలిశాయి. జవరాలు బెదిరిన లేడిపిల్లలాగ క్షణం ఒదిగి కూర్చుంది. మరుక్షణం లేచినుంచుంది. ఆమె వీక్షణంలో రవంత వెచ్చదనం ఉంది, ఒకింత ఆశకూడా కలదు. అతడే అన్నాడిల్లా...

యు : ఫరవాలేదు. మీరుకూర్చోండి. నేను మరో బెంచీ మీద కూర్చుంటాను.

ఆడ : అన్నాడేగాని అతడు అడుగు వెనక్కి వెయ్యలేదు. అలాగని ముందుకూ వెయ్యలేదు. ఉన్నచోటనే ఉండి పోయాడు. మరి యిద్దరిలో ఏ ఒక్కరూ మాట్లాడ లేదు. ఆమెకూడా అలా నించునే ఉంది. ఇద్దరూ కొన్ని శతాబ్దులు అలా నిలబడ్డారు. ఇంతలో తమ్ముడు వచ్చాడు.

త అక్కయ్యా, కాణీ యివ్వవ్. బటాణీలు కొనుక్కుంటా.

ఆడ : నేత్రావధానపు పానకంలో తమ్ముడు ఉపకరించే పుడక అయేడు. యువకుడు చేబులోంచి కాణీతీసి కుర్రాడికిచ్చాడు. కుర్రాడు బిడియపడుతూ వెనక్కు తగ్గాడు. జవరాలు అందికదా...

యువతి: ఒద్దండీ, వాడికి డబ్బులివ్వవద్దు.

యు : ఫరవా లేదు లెండి...

ఆడ : అని ఇచ్చి వెళ్ళిపోయాడు. వెళ్ళి రెండో బెంచీమీద కూర్చున్నాడు.

యువతి: ఏమిరా. నీకుబుద్ధి లేదూ; కొత్తవాళ్ళదగ్గర డబ్బులు పుచ్చుకుంటావా? ఉండు- నాన్నతో చెప్తాను.

త : చెప్పకే అక్కయ్యా. నీకు దండం పెడతానే.

ఆడ : అక్కయ్య తమ్ముణ్ని అదిరించి చూసింది. అంతలో కుర్రాడిమీద వాత్సల్యం కుమటపడ్డది. తమ్ముడు రివ్వున ఎగిరిపోయి బటాణీలు కొనుక్కున్నాడు. జవరాలు రేడియో పాటనే వింటున్నదో; ఆలోచనలు పోతున్నదో చెప్పడం కష్టం. రెండో బెంచీమీద యువకుడు బెదిరి బెదిరి చూసీ చూడకుండా ఇటువైపు చూస్తూ తలలో ఏదో రాస్తూ అల్లంత దూరంలో కూర్చున్నాడు. జవరాలు కూడా అంతేనేమో! మర్నాడు...

యువకుడే ముందొచ్చి బెంచిమీద కాచుకు కూర్చున్నాడు. అతడు రాడేమో అన్నభయంతో, వస్తే ఎవరేనా చూస్తారేమో అన్నసంకోచంతో తడ

బడుతూ జవరాలు తమ్ముణ్ణి వెంటబెట్టుకొని వచ్చింది. యువకుడు వీళ్ళని చూసి చిరునవ్వు నవ్వేడు. జవరాలు తనపెదవుల వెనుకనే ముసి ముసి నవ్వుని దాచుకుంది.

యు : అబ్బాయి, యిలారా...

త : (దూరంగా) ఆయన పిలుస్తున్నారు - వెళ్ళనా అక్కయ్యా.

యువతి: నన్నెందుకుఅడగడం! నిన్న నన్నడిగే ఆయన దగ్గర డబ్బులు పుచ్చుకొన్నావా?

యు : రా అబ్బాయి, ఫరవాలేదు, (దూరంగా)

ఆడ : తమ్ముడు యువకుడిదగ్గరికి వెళ్ళాడు. (దూరంగా)

యు : నీ పేరేమిటి అబ్బాయీ.

త : హనుమంతు.

యు : మరి మీఅక్కయ్య పేరో?

త : చెప్పకూడదు.

యు : ఏం?

త : మా అక్కయ్య చెప్పొద్దన్నది.

యు : చెప్పు. పరవాలేదు.

త : నేను చెప్పను. చెపితే నాన్నతో చెప్పి కొట్టిస్తుంది.

యు : కొట్టించదులే.

త : మీకు తెలీదు.

యు : నిన్న కానీ పుచ్చుకొన్నావని చెప్పిందా?

త : లేదు.

యు : అయితే భయంలేదు, చెప్పు.

త : నేను ... ఊహుఁ ... చెప్పను.

యు : పోనీ – 'ఆయన నీపేరు అడుగుతున్నాడు, చెప్పేదా అక్కయ్యా' అని అడుగు, చెప్పమంటేనే చెప్పు.

ఆడ : తమ్ముడు అక్కయ్య దగ్గరకు వచ్చాడు. యువకుడికీ తమ్ముడికీ జరిగిన సంభాషణ విననట్టే నటించింది జవరాలు.

త : అక్కయ్యా, ఆయన నీపేరు అడుగుతున్నారే!

యువతి: ఊఁ...

ఆడ : అని ఉరిమింది జవరాలు. లేనికోపం నుమ్మరించింది. తమ్ముడు జడిసి తప్పుకొన్నాడు.

యు : ఏం అబ్బాయ్! అడిగావా ?

త : అడిగేను.

యు : మరిచెప్పు.

త : చెప్పొద్దంది.

యు : అనలేదే, ఊఁ... అన్నది.

త : అంటే ఒద్దూ అనే అర్థం.

యు : కాదు.

త : అవును.

యు : ఇదుగో మధ్యాహ్నం భోజనం చేశావా ?

త : ఊఁ...

యు : ఇప్పుడు ఊఁ అంటే ఒద్దూ అనా అర్థం.

త : కాదు. చేశానూ అని అర్థం.

యు : అలాగే మీ అక్కయ్య ఊ అంటే చెప్పమనే అర్థం. కాబట్టి చెప్పు.

ఆడ : తమ్ముడు అక్కయ్య పేరు చెప్పాడు. యువకుడు మురిసిపోయాడు. జవరాలు నిండుకుండ. తమ్ముడు బటాణీలు కొనుక్కోడానికి పారిపోయాడు. జవరాలు యువకునివైపు నవ్వినట్టు చూసింది. నన్ను కాద న్నట్టు ఆయువకుడు పైకి ఊరుకొన్నాడు. నాలుగు కన్నులు కలకాలం మాట్లాడుకోగలవు.

ఆమర్నాడు ...

యువతి: నీకుబటానీలు ఎక్కడివిరా? మళ్లా ఆయనదగ్గర కాణీ పుచ్చుకొన్నావా ?

త : లేదక్కయ్యా. కాణీ పుచ్చుకోలేదు.

యువతి: మరినీకు బటాణీలు ఎక్కణ్ణుంచి వచ్చాయి ?

త : ఆయన కొనిపెట్టాడు.

యువతి: పుచ్చుకోకూడదని చెప్పలేనూ.

త : కాణీ పుచ్చుకోకూడదన్నావు గాని బటాణీలు పుచ్చు కోకూడ దన్నావా ?

యువతి: ఇకమీాదట బటాణీలుకూడా పుచ్చుకోకు.

త : బటాణీలు పుచ్చుకేన్లేవే. ఛీ వెధవ బటాణీలు బావు లేవు. ఇకమీాదట్నుంచీ వేరుశనక్కాయలే తింటా. సరేకాని అక్కయ్యా, ఈ చ్చీటీ నీ కాయన ఇమ్మ న్నారే.

ఆడ : తమ్ముడు జవరాలికి ఓ కాగితం అందించాడు. ఆ కాగితం ఇలా పాడింది.

ఏదో ఏదేదో కోరిక
హృదయములో వెలిసె నా
వదనములో మెరిసె.
వెన్నెల తొలి వెలుగులలో
సన్నజాజి పూతావులలో
నన్నుచూసి నీ కన్నులు
సన్నచేసి కవ్విస్తే – ఏం!

ఆడ : పాటచాలా పొడుగ్గా నది. మీకు తెలుసుగా, ఈ కవులు ప్రేమలో పడితే ఎంత పొడుగాటి పాటలు రాస్తారో. ఈ పాటని జవరాలు చదువుకొంది. తల ఊపింది. మురిసిపోయింది.

రెండురోజుల తరవాత అజ్ఞాత ప్రేయసికి అంకితం అని ఈ పాటే ఒక ఆంధ్రమాస పత్రికలో అచ్చయి వచ్చింది. ఆ పత్రిక ప్రతిని యువకుడు జవరాలుకి ఇచ్చేడు. ప్రేమ అతనిని పెనవేసుకొని ఆకాశం దాకా అల్లుకుపోయింది.

ఒకనాడు.........

యువతి: రేపు మాయింటికి రాకూడదూ. మా నాన్నగారు మిమ్మల్ని చూస్తారు. మన సంగతి......

యు : ఇలా అజ్ఞాతంగానే ఉండనీ.

యువతి: అంతేనా?......

యువ: అప్పుడే ప్రేమ పచ్చగా కలకల లాడుతుంది.

ఆడ : అతడు తనని పెళ్ళిచేసుకొని సుఖపెడతాడని జవ రాలు అద్దాలమేడ కట్టుకొన్నది. అతడు ప్రేయసి కళ్ళనేతప్ప తండ్రి కళ్ళని చూడడానికి భయపడ్డాడు. అతడు ఆమెని కట్టుకొని సంసారం ఈదలేడు. ఆర్థి కంగా అతడి చదువు అరవైటన్నులు. ఆమె కన్నులు పెళ్ళిచేసుకొంటే అంతకు రెట్టింపు బరువు. కొన్నాళ్ళ దాకా వాళ్ళు ఏదీ తేల్చుకోలేక పోయారు. అతడు విచారంలో మునిగిపోయాడు. ఒకరాత్రి ఊరంతా సద్దణగేక పార్కంతా పవ్వళించాక అతడు నాతో మొరపెట్టుకున్నాడు. నేను హితోపదేశం చేశాను. అతడు నా మాటలని చెవిని పెట్టలేదు.

ఈ పార్కుబెంచీ వీపుమీద ఒక చక్కటి చెట్టుకొమ్మ ఒకటి విస్తరించింది. మర్నాడు పొద్దున్న పోలీసులు నా దగ్గరకు వచ్చారు. వాళ్ళతోపాటు పేటపేటంతా వచ్చారు. ఒక ఊరులేని పేరులేని శవాన్ని పోలీసులు పట్టుకొనిపోయారు. అప్పటినుంచీ నా దగ్గరకి పిట్ట మనిషయినా రావడం మానేశారు. నేను ప్లేగులో కడుపున పుట్టిన పిల్లలు చచ్చిపోతే ఏడ్చే తల్లిలాగ ఇలా ఉన్నాను. మూడునెలల తరవాత ఎవరో పరాయి ఊరు మనుష్యులు ఆ బెంచీమీద కూర్చొని పేపరు చదువుకొంటున్నారు. చెలియలికట్ట దగ్గర ఏదో ఆడశవం తేలినట్టు పేపరు చెప్పింది. నేను ఇసు కలో కరిగిపోయాను.

కోప : పాపం.

ఆడ : అనాదినుంచీ నేను ఈయనతో మాట్లాడుతుంటాను.

కోప : ఈయ నెవరు ?

ఆడ : ఈయనే ఆ యువకుడు.

కోప : నిజంగా.

యు : నిజం. ఈ పార్కు-బెంచీ రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది.

కోప : మరి మీరు ఉరిపోసుకొని చచ్చిపోయారు కాదా.

యు : ఉరిపోసుకొని నేను చచ్చిపోలేదు. ఉరిపోసుకొని బ్రతికేను.

కోప : ఏమిటో బోధపడకుండా ఉంది. చచ్చిపోయిన మనిషి కరిగిపోయిన పార్కు-బెంచీతో మాట్లాడడం నాకేం బోధపడ లేదు.

యు : ప్రయత్నించితే బోధపడని దంటూ ఏదీ ఉండదు.

కోప : మీరు చచ్చిపోయిన మనుష్యులయితే ఇక్కడెందుకు ఉంటారు.

యు : ఇంకెక్కడికిపోను. నాకు ఇల్లూ, వాకిలీ తిండీ బట్టా అక్కర్లేదాయె. నాకు కావలసినదంతా ఓదార్పు మాత్రమే. నేను బ్రతికినన్నాళ్ళు నన్ను ఓదార్చని, ఉత్సాహపరచని మనుష్యులు నేను చచ్చిపోయాక మాత్రం నన్ను ఓదార్చుతారా ? ... నేను బ్రతికున్నప్పుడూ, కవిత్వం రాసేటప్పుడు, బాధపడేటప్పుడు, ఉన్న కాణీడబ్బులు కుర్రవాడికి బఠాణీలకి

ఇచ్చేటప్పుడు నన్ను ఈ పార్కుబెంచీయే ఓదార్చేది! అటువంటి పార్కుబెంచీని విడిచి ఎక్కడికి పోయేది. పోతే నాకు శాంతి ఉంటుందా? సరే, దానికేం లెండి. మీరు ఇంక ఈ చోటు ఖాళీచేయండి.

కోప : ఏం...ఎందుకు కాళీచెయ్యమంటున్నావ్...

యు : చెలియలికట్ట దగ్గర తేలిన శవం ఇక్కడికొచ్చే వేళ యింది. దయచేసి ఈ సీటు కాళీచేయండి.

కోప : అయితే నిజమే నన్నమాట. ఈ బెంచీ అక్షరాలా దెయ్యాల బెంచీయే అన్నమాట. సరేగాని పోయే ముందు నేనవరో చెప్పిపోదా మనుకొంటున్నాను. వింటావా?

యు : వింటే వచ్చిన నష్టంలేదు. చెప్పండి.

కోప : నేను చెలియలికట్ట దగ్గర తేలిన శవంలేమా?...ఆ అమ్మాయి తండ్రిని. ఆనాడు నాకూతురు ఆహ్వానించినట్టు మా యింటికివస్తే నీకు నేను మామగార్ని అయేవాణ్ణి. ఇవాళ మా అబ్బాయి అసలు సంగతి చెప్పాడు. అమ్మాయీ వాడూ కలిసి రోజూ ఇక్కడ నిన్ను ఈ పార్కుబెంచీ దగ్గర కలుసుకొంటూ ఉండే వాళ్ళని ఇవాళే నాకు తెలిసింది. వెంటనే ఈ పార్కు బెంచీని చూసిపోదామని వచ్చాను. మరి వెళతాను. మరొకసంగతి. పోనీ......ఎందుకులే...ఈ పార్కు బెంచీయే నిన్ను ఓదారుస్తుంది—నే వెడతా......

—: 0 :—

## ఇందలి పాత్రలు :

సీతారావమ్మ

విశాలాక్షి

వెంకాయి

సూరయ్య

చలపతి

సుబ్బన్న

రాజు

---

# దరఖాస్తు ఫారం

ఆంధ్రదేశపు ఒకానొక మారుమూల పల్లెటూళ్ళో పొద్దున్న పది గంటల వేళ - బాగా బతికి ఇప్పుడిప్పుడే చితుకుతున్న సంసారి ఆదిశేషయ్యగారి భార్య సీతారామమ్మ, ఆవిడ మేనగోడలు-అందరూ చిన్నమ్మా అని పిలిచే విశాలాక్షీ వడ్లు దంపుతున్నారు.

సీతారామమ్మ: సువ్విసువ్వన్నలారా - సువ్వన్నలారా !
మల్లిసువ్వన్నలార - మా యన్నలారా !
పొద్దున్న రాముడు పొలమెల్లినాడు
ఇంటికాడ లివేవేమి పనులూ ?___

సువ్వి___

అయ్యో అదేమిటే మా అమ్మా, అంత బులబులాగ్గా పోటువేస్తే పొట్టేం ఊడేను. కొంచెం సత్తువ పూరా పోటు వెయ్. మరేం చేతు లూడి పడిపోవు.

విశాలాక్షి : ఏమోనమ్మ, ఎంతబలంగా దంచినా ఏదో ఒక వంక పెట్టకుండా ఉండవుకదా.

సీతా : బాగుందేవ్. రేపు పట్నంలో మా రాజు గాడితో కాపరం పెట్టాకకూడా యిలాగే పనిపాట్లు చేస్తావన్న మాట !

విశా : స్వర్గాని కెళ్ళినా సవతి పోరు తప్పలేదని - పట్నాని కెళ్ళినా ఈ దంపుళ్లు తప్పవా ?

సీతా : పనిపాట్లు చేసుకొంటే తప్పేం వుంది ? సంసారులం కావూ ? సర్లే దబదబా నాలుగు పోటులు వెయ్యి. ఎసరు మరుగుతూ ఉంటుంది. ఈ పూటకి నాలుగు గింజలు చెరిగి ఉడకెయ్యాలి.

సువ్వి సువ్వన్నలారా ! సువ్వన్నలారా...
మళ్లీ సువ్వన్నలారా...మాయన్నలారా...
మంగళం పాడుతూ మేడపై వుండే
ఆ జేటి బాలుడూ ఇళ్లకొచ్చేను
ఇళ్లకొచ్చిన బాల కల్లోకొచ్చేను – సువ్వి—

పాట నువ్వూ అందుకో –ఒక్కరైనే ఎంతని పాడేది.

విశా : ఈ పాట లేవిటో నాకు రావు.

సీతా : రావంటే సరిపోతుందా ఏమిటి ? నేర్చుకో.

విశా : నా కీ పాట లేం అక్కర్లేదు.

సీతా : అక్కర్లేదంటే సరిపోతుందా ఏమిటి ? రేపు మా రాజుగాడితో...

విశా : ఈ పాటలు నేర్చుకోకపోతే బావకి నన్ను చేసుకోవు, అంతేగా—పీడా పోయె.

సీతా : ఔవ్వ, ఔవ్వ అదేం మాటే.

విశా : లేకపోతే ఏమిటి ? పొద్దున్న లేచింది మొదలు కళ్లాపు జల్లకపోతే, రేపు మా రాజుగాడితో కాపరం ఇలాగే చేస్తావా అంటావు. గొడ్లకి కుడితి, గడ్డి చూడకపోతే, రేపు మా రాజు గాడితో ఇలాగే సంసారం చక్కపెట్టుకొంటావా అంటావు. వడ్లు

దంచడం నాకు రాదో మొర్రో అంటే వినవాయె. చెరగడం జల్లించడం రాదంటే ససేమిరా చెవినిపెట్ట వాయె. ఇలాగే నా దుంప తెంపితే నా ఎత్తు ధనం పోసినా ఈ పెళ్ళి నాకొద్దు అని మా నాన్నతో చెప్పేస్తా.

సీతా : సరి, సరి. ఆc. మరి ప్రేమించాను, బావనే పెళ్ళిచేసు కొంటాను అని పట్టుపట్టావే...

విశా : ఏం, ఇప్పుడు మటుకు కాదన్నా నేమిటి? ఇప్పటికీ బావనే ప్రేమిస్తున్నా.

సీతా : మరీ తెగుతెంపు లేమిటి?

విశా : నీ కోడంట్రికం చూడబోతే బావ నాకు ప్రస్తికట్టినా నువ్వే నాతో సంసారం చేసేటట్టున్నావ్. బావతో కాపరం చేద్దామని సంబరపడుతున్నా గాని నీతో ఎవరు వేగగలరు నా తల్లీ...

సీతా : ఎంతదానివయ్యావే మా అమ్మా... ఏదో కాలేజీలో బుద్ధిగా చదువుకొంటున్నావ్. తక్కిన ఇంగిలీషు చదువుతున్న రంగేలీ అమ్మాయిలమల్లే కాక కుదు రుగా ఉన్నావని మీ అమ్మా నాన్నా చెపితే ఏమిటో అనుకొన్నా. నువ్వా ఇంతే నన్న మాట!

విశా : నేనూ చెడిపోయానని వేగం తేల్చుకో...

సీతా : తేల్చుకోడం ఏమిటి నా మొహం. ఎదురుగుండా అద్దముంది, మొఖముంది. ఇంతకీ ముంజేతి మురుక్కి అద్దమెందుకూ? కచ్చితంగా కనబడుతూంటే.

విశా : ఏమిటమ్మా కనబడుతూంది ? నేనేవిటి చెడిపోయానో చెప్పు–వింటా !

సీతా : నేను తొలి దగ్గర్నుంచి మొత్తుకొంటూనే ఉన్నా. మీ నాన్న వింటేనా! ఒద్దు ఒద్దంటే ఈ ఇంగిలీషు చదువు పెట్టాడు, ఆడవాళ్ళకి అందులోకి మనలాంటి సంసార్లకి.

విశా : ఇంగ్లీషు చదువుకొన్న ప్రతిఆడది చెడిపోయినదే ! పుట్టి బుద్ధెరిగాక కళ్ళాపులు చల్లటం చేతకాకపోతే చెడిపోయినట్లా, పాలు పితకడం తెలియకపోతే చెడిపోయినట్లా ? వడ్లుదంచడం పట్టుపడకపోతే చెడిపోయినట్లా ? చెడిపోవటానికి ఇంగ్లీషే చదవక్కర్లా ... ఏ చదువు చదివిందని మీ మూడోకోడలు ...

సీతా : నీ కో దండం తల్లీ ! అవేం కదిలించకు; నాది బుద్ధి పొరపాటు. మాటలు నేర్చిన కుక్క యిస్కూ అంటే యిస్కో అందిట.

విశా : నేను కుక్కనా ...

సీతా : నువ్వు కాదే, మా అమ్మా. నేనే ఆ కుక్కని. ఇంతకీ కొంచెం సాయం చేస్తావా, చెయ్యవా ?

విశా : నేను చెయ్యను.

సీతా : మా అమ్మవుకదూ, ఈపూట భోజనానికి గింజల్లేవు. ... రా, రెండు పోట్లేసి —

విశా : ఊరికే మాటకి మాటపెంచి నన్ను సాధించను అంటే సాయం చేస్తా !

సీతా : బుద్ధి గడ్డితిని అన్నాను. మరి మాట్లాడను, రా....

వడ్లు దంచుతున్న చప్పుడు—అర నిముషం.

విశా : అత్తా ...

సీతా : (మాట్లాడదు).

విశా : అత్తా ... నిన్నే.

సీతా : మాట్లా డొద్దన్నావుగా ...

విశా : సాధించవద్దన్నానుగాని, మాటా మంతీ వద్దన్నానా.

పనివాడు వెంకాయి.

వెంకా: అమ్మగోరూ ... అమ్మగోరూ ...

సీతా : అట్టే అట్టే ... అక్కడే ఉండరా ... మడి గట్టుకు వడ్లు దంచుతూ ఉంటే ...

వెం : సర్లెండి ...

సీతా : సర్లెండి అని కదలడేం! ఏం కర్మొచ్చిందిరా భగవంతుడా ... మడీ మంటిగడ్డలు ...

విశా : వా డక్కడ నిల్చున్నంతమాత్రాన మడి తగలడి పోతుందా ఏం ... ఇంతకీ మడిగట్టుకు వడ్లు దంచట మెందుకూ ?

సీతా : గడిగడిక్కీ స్నానంచేసే ఓపికెక్కడచచ్చింది. మళ్ళా మడికట్టుకు వంటచేసే బాధ తప్పుతుందని. ఏంరా... అంట్లపీనుగా, అలా నోరు వెళ్ళబెట్టుకు నుంచుంటా వేం, వచ్చిన పనేతో అఘోరించు.

వెం : మరేనండి... చిన్నమ్మగోరూ... అబ్బాయిగోరికి కాఫీ కావాలంట. మరగేసి పంపీమంటుండారు.

సీతా : ఈ కాఫీ కో వేళాపాళా లేదా ఏమిటి. మొఖం కడు క్కోకుండా కాఫీ, మొగం కడుక్కుని కాఫీ, ఎనిమిది గంటలకి కాఫీ...

విశా : పోనీ అత్తా, కాఫీయేకదా! ఏం భాగ్యం.

సీతా : ఏం కర్మో... చెయ్యి వీల్లేదని చెప్పరా...

విశా : ఉండత్తా, ఎసరుమరుగుతుందన్నావుగా. నిమిషంలో కాఫీ పెట్టిఇస్తాను. ఉండరా వెంకాయి.

సీతా : అదేవిటే మా అమ్మ. మైలపడతావటే... నువ్వు మటుకూ... ఆరగా ఆరగా స్తానా లెక్కడ చెయ్య గలవు ?

విశా : కాఫీ కలిపినంత మాత్రాన మైలపడిపోతానా ఏమిటి?

సీతా : కాదటే మరి. ఆ వెధవ దిక్కుమాలిన అప్రాచ్యపు కాఫీ పొడుం ముట్టుకొంటే స్నానం చెయ్యాకక్కర్లా. ఆ చేతులతోనే వంటచేస్తే దేవతార్చనకీ నైవేద్యా నికి సరిపోతుందా ?

విశా : ఐతే సరి. నీ మడికూడా కుక్కముట్టుకుంది.

సీతా : అదేమిటే తల్లీ, అదేమిటి ?

విశా : ఇందాక నువ్వు ఏటికి నీళ్ళు తెచ్చేందుకు వెళ్ళి నప్పుడు ఒకసారి బావకి కాఫీ పట్టుకెళ్ళా, మళ్ళా స్తానం చెయ్యలేదు.

సీతా : అయ్యో రాతా... ...నయం, చెప్పావ్... లేకపోతే ఏంతఘోరం జరిగేది!

విశా : బతికించావులే. ఎలాగా మడిబియ్యం కావు కాబట్టి వెంకాయి పెళ్ళాం చంద్రమ్మని కేకేస్తా అది దంపి పోతుంది. ఒరే వెంకాయి! నీ పెళ్ళాన్ని కేకేసిరా. ఈ లోపున కాఫీ తయారు చేసి ఉంచుతా.

సీతా : ఏమిటో మడిమడి అని నేను వాపోడమేగాని, ఒరే వెంకాయి, వేగం రమ్మను – నీ దొరసాన్ని.

పక్కింటి సూరయ్య, చలపతి వస్తారు.

సూరయ్య : ఒరే. బాబూ...రాజూ...

సీతా ; ఏమిటి సూరయ్య బాబూ...... అలా ఒగర్చు కొంటూ వస్తున్నావ్...... కూర్చో – మరేం ప్రమాదం...

చలపతి : జరిగిందో లేదో అదే తేల్చుకొందామని వచ్చాం. అదీ సంగతి.

సూ : రాజేడీ? వదినా...

సీతా : మేడ మీద చదువుకొంటున్నాడు. కూర్చో... ఏమిటీ గడబిడ...

సూ : ఎలా కూర్చోను వదినా...

చల : నిజమే ఎలా కూర్చోమంటారు. అదేమిటో తేలక పోతే మనసు కుదుటపడుతుందా. పడదు అదీసంగతి.

సీతా : ఇంతకీ... ఏమిటి సంగతి?

సూ : ఒళ్ళిగా మొచ్చిం దొదినా... ఒళ్ళిగాం...... ఏం పాడు కబురో అని ప్రాణాలు కొట్టుకొంటు న్నాయి. రాజు చదివి చెపాడని–

సీతా : ఉండు కేకేస్తా... ఒరే రాజుగా...... రాజూ...
ఏం సూరయ్యగారూ... మీ వెంకటరత్నం ఏవ
య్యాడూ... వాడూ చదివేడుగా ఎఫ్ఫే ఇంగ్లీషు...
ఇంకా టెల్లిగ్రాఫులు చదివి అర్థం చెప్పేపాటి చదు
వుకోలేదా. ఏమిటి ? ఏం చలపతీ......... నువ్వూ
చదివేనన్నావ్. ఇంగ్లీషు, నువ్వు చదివి చెప్ప
కూడదూ...

చల : ఆఁ, ఏదో తెలుగువాళ్ళతో యింగ్లీషు మాట్లాడ్డం
నాకొచ్చుగాని - అదీకాక టెల్లిగ్రాములు దొరల
దస్తూరీలో రాస్తారు. అదీ సంగతి. నేనూ, చెన్నా
పట్టణం వెళ్ళేను గనుకనా, దొరల దస్తూరీ పోల్చుకో
డానికి.

సూ : రాజా రావేఁవమ్మా...

సీతా : దిగిరావాలా ... ఆఁ, మీ వెంకటరత్నంకూడా చెన్న
పట్నంలో చదువుకోలేదుకదూ ... అందుకేగాబోలు
దొరలదస్తూరీ తెలిసుండలేదు. అంతేనా...

చల : అదీ సంగతి.

సూ : ఇదిగో... చలపతీ... మా వెంకటరత్నం ఇల్లాంటి
బోడికుంకన్నర. టెల్లిగ్రాములు సవాలక్షున్నర మంచి
నీళ్ళ ప్రాయంగా చదివి అరటిపండువొలిచినట్టు అర్థం
చెప్పగలడు; ఏమనుకొన్నావ్. నీ లాగ బాష్లేషు
ముక్కల చదువు అనుకొన్నావా... బి. య్యే.
తప్పాడు.

సీతా : మరయితే మా వాడి దగ్గిరికి పరిగెత్తుకొంటూ వచ్చావేం బాబూ ..మీవాడిచేతనే చదివించుకో లేక పోయావా.

సూ : ఆయనే ఉంటే నాయిూ బ్రాహ్మణు కెందుకూ అని. మా వాడు ఊళ్ళో ఉంటే ఇక్కడదాకా వస్తానా.

చల : అదీ సంగతి ...

సీతా : ఏం, ఏ ఊరెళ్ళాడేం...

సూ : ఉద్యోగంకోసం చెన్నాపట్టం వెళ్ళాడు. రాజు రాడేం..

సీతా : వస్తాడు. మేడమెట్లన్నీ దిగాలామరి. అయితే వెంకట రత్నం పొట్టచేత్తో పట్టుకు...

సూ : అదేవిటోదినా, అఘాయిత్త్రం మాట లంటావ్ ... పొట్ట చేత్తోపట్టుకు అంటావే ...

సీతా : అయ్యోరాతా ...కడకూ వినవేం! పొట్ట చేత్తోపట్టుకు ఉద్యోగాల కోసం పీడిపంచా, వాడిపంచా తిర గవలసిన కర్మం పట్టిందంటూ... మహారాజులాగా...

సూ : ఎంత తాతలార్జించిన భూమి వున్నా ... ఉద్యోగం పురుష లక్షణం అన్నారు.

చల : అదీ సంగతి ...

సీతా : ఏమోనమ్మా! మా రాజుగాడుకూడా ఉద్యోగం చేస్తా ... ఉద్యోగం చేస్తా ... అని పోరితే, ఒద్దు బాబూ, ఉద్యోగం చెయ్యడం మన యింటా ఒంటా లేదురా, అసలు ఇంగ్లీషు చదువులే మనకు అచ్చి రావు - అయినా ఏదో ఒక్కగా నొక్క నలుసువి,

ముచ్చటపడ్డావని చదివించాం. ఇంతవరకూ ఏగండం లేకుండా చదివేవు, అదే చాలు. అని చెప్పి ఒప్పించే సరికి నా తల ప్రాణం తోక్కి వచ్చింది.

సూ : రాజు ఎంతకి కిందికి దిగడం ...

సీతా : వస్తాడు. గెడ్డం చేసుకుంటున్నాడో ఏమో! తొందర పడితే మరేమైనా ఉందా ... పీక తెగిపోయూ ... ఉద్యోగం చెయ్యనులే ... అని అనిపించ గలిగాను గాని యీ సొంత క్షవరం మానిపించటం నాతరం కాలేదు ... అయితే సూరయ్యబాబూ, వెంకట రత్నం ఉద్యోగం చేస్తాడన్న మాట.

సూ : ఏదో ముచ్చటబడుతున్నాడు. చెన్నాపట్నంలో ఉండా లని మోజు. సర్లే ఓ నాలుగురోజులపాటు అక్కడ ఉద్యోగం చేసి, దగ్గర్లోకి బదలీచేయించు కొంటాడని సరే అన్నాను.

సీతా : మా వాడికి ... చెన్నాపట్నంలో కాపరం పెట్టాలని మా వేడుగ్గా ఉంది. పోనీ పెళ్ళయినాక ఓ రెండు మూడు నెల్లు ఇద్దరూ అక్కడ ఉండండి అన్నాను. అయితే వెంకటరత్నానికి ఎంత జీత మిస్తానన్నా రేమిటి ?

చల : ఇంకా వాళ్ళేం అనడం లేదు. 'ఉద్యోగం ఇస్తాం మూడు రూపాయలు పంపు' అంటున్నారు.

సీతా : అదేమిటి చలపతీ ! మూడు రూపాయలకి ఉద్యోగ మేమిటి ?

చల : అంతేలే పిన్నీ ... ఈరోజుల్లో అన్నీ డబ్బుల్తో అవు తున్నాయి. ధనమూల మిదం జగత్ అన్నారు. నేను కాదు పెద్దలు. అదీ సంగతి.

సీతా : చోద్యంగా ఉంది. మూడు రూపాయలు పుచ్చుకుని వందలు జీతం యిచ్చే ఉద్యోగాలు ఇస్తే ఆ ఇచ్చే వాడి కేం గిట్టుబాటవుతుంది ?

సూ : ఉద్యోగం ఖరీదు కాదు ఒదినా! అది యేదో ఎప్లి కేసనుఫారం ఖరీదుట.

సీతా : ఫారం ఏమిటి. మీవాడు చెయ్యగా చెయ్యగా వెవ సాయం పనులు ఉద్యోగం చేస్తాడా ఏమిటి ? ఈపాటి దానికి చెన్నాపట్నం వెళ్లాలా ? మనఊళ్ళో పొలాలు ఫారం లేదూ ?

చల : ఫారం అంటే, మన చిలకపల్లె ఫారం కాదు పిన్నీ, అర్జీ కాగితంఅన్నమాట. ఎప్లికేషను అంటే దర ఖాస్తు అన్నమాట. చూచావా, నాకు ఇంగ్లీషు రా దన్నావ్ ...

సీతా : అంటే మావాడుకూడా అడపాదడపా మూడేసిరూపా యలు పుచ్చుకుంటున్నాడు. కొంపతీసి వీడుకూడా దరఖాస్తులు పెట్టటం లేదుకదా ...

సూ : ఏమో ఎవరు చెప్పగలరు ? ఇంతకీ దిగిరాడే ?

పోస్టు సుబ్బన్న.

సుబ్బ: సీతారావమ్మగారూ ! రాజు బాబు ఉన్నారా ? రిజి ష్టరు ఉత్తరం ఉంది,

సీతా : ఉన్నాడు నాయనా, పిలుస్తాను ... బాబూ ... ఓ రాజూ ... ఓ రాజిగా.

సు : ఏం సూరయ్యగారూ ... ఉత్తరం విశేషాలు మరేం ప్రమాదం కాదు గదా.

సూ : ఏమో నాయనా ... ఇంకా చదివించ లేదు. నా మనసు మనసులో లేదు సుబ్బన్నా ...

సు : మరి ఈ చలపతి బాబు ఏదో యింగ్లీషు చదువు ఊడబొడిచా నన్నాడే. చదివి చెప్పలా ...

చల : అదికాదు సుబ్బన్నా, సంగతేమి టంటే ...

సు : యిలా తెండి చదివి చెప్తా.

సీతా : కోలదస్తూరి నీకేం తెలుసు సుబ్బన్నా. చెన్నాపట్టం వెళ్ళి చదువుకున్నావా ఏం?

సు : యింతోటి ఉత్తరం చదివిచెప్పటానికి చెన్నాపట్టం వెళ్ళాలా ఏం? వైర్ — ఫిప్టి — అర్జెంటు — వెంకటరత్నం.

సూ : అర్జెంటూ ఏమిటి బాబూ ... ఏమిటి అర్జెంటు? వెంకటరత్నాని కేం ప్రమాదం లేదు కద ...

చల : ఏం లేదు. వైర్ అంటే తెలుసును మనం, మనచేను చుట్టూ వైరుతీగ వేద్దా మనుకున్నాం కదూ ... చెన్నాపట్టంలో ముళ్ళవైరు వుంది. ఫిఫ్టీ అంటే యాభై గొలుసులు. అర్జెంటుగా పంపిస్తా అని వ్రాశాడు, అదీ సంగతి.

సు : తగ్గవయ్యా... చదుపుకొన్న పెద్దమనిషి తగ్గు. అదేం కాదు సూరయ్యగారూ ... యూ భైరూపాయలు టెలిగ్రాంమనియార్డరు పంపించమంటున్నాడు. అర్జెంటుట.

చల : మనియార్డరు అని టెలిగ్రాంలో మాట లేదేం?

సు : నీలాంటివాడికి అది బోధపడదు. ఇది వారలదస్తూరీలే.

చల : నేను నమ్మను, సూరయ్యబాబాయి! సుబ్బడు నన్ను నెక్కిరించడానికి ఏదో చదివాడు. రాజు రానీ, నేను చెప్పిన అర్థం రైటో, కాదో చెప్పిస్తా. ఇంగ్లీషంటే చదవలేను గాని అర్థం చెప్పడం రాదా, మరీను ...

రాజు దిగుతూ;

రాజు : ఏమిటమ్మా ... నన్ని ఊళ్ళో ఉండనిస్తావా, లేదా? 'రాజు ... ఓరాజుగా' అంటూ పెంకు లెగర గొంతుతున్నావ్ ...

సూ : బాబూ ... రాజూ ... ఈ టెలిగ్రాం కాస్త చదివి పెడుదూ పుణ్యముంటుంది.

రా : ఇందుకా నన్ను కిందికి దింపారు. కిందనే చిన్నమ్మ ఉందిగా. దానిచేత చదివించుకోలేక పోయారా ...

సీతా : అది కాఫీ కాస్తున్నాదిరా...

సుబ్బ: నేను చదివి చెప్పానుగా...

రాజు : ఇంకేం... సుబ్బన్న చదివి చెప్పాడుగా....

చల : సుబ్బన్న అంతా తప్పుల తడక చెప్పాడు. అదీ సంగతి.

రాజు : ఏమయ్... చలపతీ, నీ కెన్నిసార్లు చెప్పాను. మా యింట్లో అడుగు పెట్టవద్దని. ఫో...

చల : నేను, నా కోసం వచ్చానా... ఏదో సూరయ్య బాబాయికి టెలిగ్రాం వచ్చింది. కొంపదీసి వెంకట రత్నం ఏ రైలు కిందేనా పడి అఘాయిత్తెం అయి నట్టు వార్తవస్తే, ఆదుకోడానికి వచ్చానుగాని....

సూ : ఎంత గుండెలు తీసినమాట అన్నావురా... ఔరా ఔరా...

చల : ఉన్నమాట అన్నానయ్యా... యిందులో తప్పే ముంది... అంతా వేమిటి ఆఁ ఆఁ.

రాజు : తన్ను పెదనాన్నా వాణ్ణి తన్ను. వెంటపడు. అదీ అది... పారిపోతున్నాడు-పరిగెత్తు.

సీతా : ఏం సుబ్బన్నా, టెలిగ్రాం నిజంగానే చదివి చెప్పావా... అందులో మరేం చెడ్డవార్త లేదు కద. సూరయ్య ఇక్కడ లేడుగా... ఏదేనా అశుభం అయితే చెప్పు-నేను మెల్లిగా ఆ కబురు చేరవేస్తా.

రాజు : ఏవిటమ్మా ఈ వెర్రి... ...ఏం సుబ్బన్నా నాకేం ఉత్తరాలు లేవూ...

విశాలాక్షి కాఫీతో

విశా : కిందికి దిగావ్... యిందర కాఫీ...

సుబ్బ: యిదుగో బాబయ్యా; మీకు ఉత్తరం... విశాలక్షమ్మ గారెవరు బాబూ... మీ కేరాఫున...

విశా : ఆఁ ఆఁ... నాకే అది...

సుబ్బ: మీరుటమ్మా! మీ పేరు విశాలక్షమ్మా! ఏదో చిన్నమ్మగారని వాడు కేగాని. ఇదిగో మీకు రిజిస్టరు ఉత్తరం-సంతకం పెట్టండి.

సీతా: ఏవిటే... నీకూ ఉత్తరాలు వస్తున్నాయిటే... మా అమ్మా... కలికాలం...

రాజు: డామిట్... ...అనుకొన్నట్టే అయింది.

విశా: ఏమిటి బావా—

రాజు: ఉద్యోగానికి కాళీలు లేవట...

సీతా: ఆఁ ఆఁ... నామీద ఒట్టుపెట్టుకోనికూడా ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నావుట్రా...

రా: లేకపోతే, ఈనూతిట్లో కప్పలాగ పడుండమన్నావా? ...ఏదీ విశాలా! నీ..కెక్కడనుంచి ఉత్తరం. నా లెటరు కాదు గదా.

విశా: అయితే నీకేం ...

రా: పెళ్లాడుతున్న పిచ్చికుంక నామె; కాబోయే పెళ్లాం సంగతి సందర్భాలు తెలుసుకోవద్దూ ...

విశా: అంత నమ్మకంలేని వాడివి నాతో నువ్వేం సంసారం ఈదగలవు?

రా: ఏదీ చూడనీ ...

విశా: నేను చూడనివ్వను.

రా: ఆ, అలాగా అమ్మా... దీన్ని నేను పెళ్ళాడను. మీ అన్నయ్యకీ విషయం ఉత్తరం రాసిపడ్తె. సుబ్బన్న యిక్కడే పట్టుకెళ్ళి మెయిలు బస్సు కందిస్తాడు.

విశా : బావా ... బావా ... గుడ్ న్యూస్. ఈ ఉత్తరంలో ఏవిటుందో చెప్పుకో ...

రా : ఏం టుంటుంది. కాలేజీలో నీకు ప్రేమలేఖలు వ్రాసిన వెకిట్రావు, నువ్వు వాడి ప్రేమ కాలదన్నావని అమాంతంగా ఆత్మహత్య చేసుకొంటానని బెదిరిస్తున్నాడా?

విశా : కాదు బావా ... నాకు ఉద్యోగం అయింది.

రా : ఆఁ ... ఆఁ

సీతా : ఇదేవిటే. మా అమ్మా ... నీకు ఉద్యోగం ఏమిటే ...

విశా : అవు నత్తా ... కాలేజీలో పంతులమ్మ ఉద్యోగం ...

సీతా : అయ్యో, అయ్యో! ఎంత ఘోరమైన మాట విన్నానే ... ఈ పాపం నిలువునా స్నానం చేస్తేగాని పోదు.

విశా : వెళ్ళు. వేగం నా పేరు–చెప్పికూడా రెండు బాల్చీలు పోసుకో.

సీతా : కలికాలం ... కలికాలం ...

రా : ఏయ్ ... విశాలా ... నీకు దరఖాస్తుఫారం ఎక్కడిది ... మూడు నెలలాయి – ఇక్కడే వుంటున్నావుగా ...

విశా : ఈ జన్మలో ఉద్యోగం చెయ్యనని మా అమ్మమీద ఒట్టు పెట్టుకొన్నావు కదా ... నీ పేర వచ్చిన దరఖాస్తుఫారం ఎందుకు వృధాగా పోవాలి? అని నీ మిసెస్‌గా అది నేను పూర్తిచేసి పంపించాను.

రా : అన్యాయం ... అన్యాయం ...

విశా : ఏం, నా మొగుడిగా ఉండటం నీకిష్టం లేదా. నాకు మట్టుకు నీ పెళ్ళాంగా ఉండేందు కిష్టమే. అన్నట్టు ఎంత చెడ్డా తల్లికి కొడుకువి కదా ... ఉద్యోగం చేస్తున్న ఆడదంటే నీకూ కోపం వస్తున్నదా ఏం....

రా : డామిట్ ... పద ... మరికొంత సేపు ఇక్కడుంటే కోపం వచ్చేటట్టుంది. పోయి మెయిల్ బస్సెక్కి పెళ్ళిళ్ళ రిజిష్ట్రారు దగ్గరికి వుడాయిద్దాం ...

—— : O : ——

ఇందలి పాత్రలు :

శివరామయ్య
రాజారాం
కండక్టర్
శ్రీనివాసమూర్తి
రామారావు
చిన్నమ్మాయి
పెద్దమ్మాయి

# నన్ను గురించే

ఇది జరుగుతున్నంతసేపు బస్సు స్టాపింగ్ వాతావరణం. సైకిల్సు, రిక్షావాళ్ల వారవార, ఐస్‌క్రీం అమ్ముకొనేవాళ్ళు, బిచ్చగాళ్ళు, మొదలైన వాతావరణం, ఏకకాలంలో వాతావరణం సంభాషణలు జరగాలి.

## ౧

శివుడు : ఒరేయ్, ఒరేయ్ రాముడూ! నిన్నేరా, పిలిస్తే పలకవేం?

రాముడు : నన్నా?

శి : అవున్రా నిన్నే.

రా : ఎవరండీ మీరు?

శి : హారి నీ దుంప తెగా. నన్నే ఎరగవుట్రా!

రా : ఎవరు మీరు. ఎప్పుడూ చూసినట్టు లేదు.

శి : బాగా జ్ఞాపకం చేసుకో.

రా : ఏమో గుర్తుకు రావడం లేదు.

శి : ఎవరైనా ఉంటానో, కొంచెం ఆలోచించు.

రా : ఆలోచించేందుకి నాకు తీరుబాటు లేదు.

శి : ఇష్టమొచ్చినంత టైము తీసుకో. ఇప్పుడొచ్చిన తొందరేముంది?

రా : బాగానే ఉంది. అవతల నాకు ఆఫీసుకు వేళయింది.

శి : అయితే మనకేం.

రా : అవును మీ సొమ్మేం పోయింది.

శి : తుమ్మితే ఊడే ముక్కు ఎంతకాలం ఉంటుంద్రా ?

రా : ఉన్నన్నాళ్లు ఉంటుంది. ఇంతకీ మీరెవరో చెప్పారు కాదు.

శి : చెప్పకోవాలి మరి.

రా : బాబూ, మీకో నమస్కారం. నా దుంప తెంచక, మీరెవరో, నాతో మీకేం పనో వేగం తేల్చి చెప్పండి.

శి : నీ తెలివి తెల్లారా. నన్నే పోల్చుకోలేక పోయావా? నువ్వేన్నా నేను.

రా : మీరనేది ఏమిటో నాకు బోధపడలేదు - మళ్ళీ చెప్పండి. ఎవరన్నారూ ?

శి : నువ్వేన్నా నేను - అన్నాను.

రా : అంటే.

శి : తెలుగు భాషలో 'నువ్వేన్నా నేను' అంటే ఇంకో అర్థం లేదు.

రా : ఏమిటో మీ భాష నాకు బోధపడలేదు.

శి : అవును బోధ పడదులే. నాకు తెలుసుగా.

రా : ఏదో నాకు తెలిసేటట్టు వివరంగా మీరెవరో దయ చేసి చెప్పండి ?

శి : చెప్పానుగా, నువ్వే నేను అని.

రా : మీరు నేనా ? నేను మీరా ? ఏమిటీ గారడీ ?

శి : గారడీ. గారడీకాదురా; దద్దమ్మా. శుద్ధ నిజం ఇది.

రా : నా కేమయినా మతిపోయిందా, కలగంటున్నానా? జ్వరం వచ్చిందా?

శి : లేదురా నాన్నా, లేదు. నువ్వు ముమ్మాటికీ, బస్సు స్టాండుదగ్గిర బస్సుకోసం కాచుకొని ఉన్నావు. నీ మతి ఎక్కడికీ పోలేదు. నా తలలోనే ఉంది. నా తల ఇంపీరియల్ బ్యాంక్ సేఫు లాంటిది. అందులో దాచిన వస్తువులు ఎక్కడికీపోవు.

రా : ఏమిటో నా కిదేం బోధ పడటం లేదు.

శి : ఇందులో బోధపడక్కపోవడానికి ఏముందిరా...తంత్రీ. నువ్వూ నేనూ ఒక తల్లి కడుపులో పుట్టి—

రా : అబద్ధం, నేను మా తల్లికి ఒక్కణ్ణే కొడుకుని.

శి : అది నీ ఉద్దేశం.

రా : మర్యాదగా మాట్లాడు.

శి : కడవరకూ వినరా. వినకుండా ఎగురుతావేం? నువ్వూ నేనూ ఒక తల్లి కడుపున పుట్టి—

రా : అదుగో మళ్ళా ఆ కూతలే కూస్తావ్. మళ్ళాఅన్నా వంటే దవడపళ్లు రాలగొడ్తాను.

శి : రాలకొట్టేందుకి నాకు పళ్ళు లేవులే. నువ్వూ నేనూ ఒకతల్లి కడుపున పుట్టి, ఒక శరీరంలో పెరిగాం.

రా : ఒక శరీరంలోనా !

శి : అవున్రా, నాయనా అవును. ఒకే ఒక్క శరీరంలో ఇద్దరం పెరిగాం.

రా : నేను నమ్మను.

శి : నమ్ము నమ్మకపో, ఇది మటుకు వాస్తవం.

రా : నువ్వూ నేను ఒకశరీరంలో పెరిగితే, మరి నిన్నెప్పుడూ నేను చూడలేదేం:

శి : నీ వీపెలా గుంటుందో నీకు తెలుసున్నా ?

రా : తెలీదు.

శి : అయితే నోరు మూసుకొని నేను చెప్పింది విను.

రా : వింటాను. ఉండుండు. ఎవరో నన్ను పిలుస్తున్నట్టుంది. ఆ, ఎవరు ?

రాజారాం : ఏవండీ శివరామయ్యగారూ. ఏమిటి, మీలో మీరు ఏదో మాట్లాడుకుంటున్నారు ?

శి : ఆఁ. ఏవంట్లారూ.

రా :
కంఠం: } రాజారాంగారూ! అయ్యో, అయ్యో ఏమన్నారు!

రాజా: ఆ. ఏమిటో మీలో మీంరే ఏదోమాట్లాడు కొంటు న్నట్టుందన్నాను.

శి : అ. అదా. ఆ. ఆ. (నసుగుతాడు)

రా : అవును. ఈ బస్సుకోసం కాచుకునే సరికి కసుకుపడు తుందిలెండి.

శి : ఆ, కునుకు కూడానా. అందులోకి ఈ రొదలో.

రా : అవున్లెండి. ఒక బస్సూ రాలేదా ?

శి : లేదండి. పావుగంటాయి వెయిట్ చేస్తున్నాను. ఆఫీసు వేళయి పోయింది. మీ రెంతదాకా ?

రా : ఇంట్లో బాధపడలేక ఏవో నగలు కొందామని-

శి : అవునవును. 'ఇంటిలోనిపోరు ఇంతింత కాదయా' అన్నట్లు వీళ్ళపోరొకటి. నేనూ చస్తున్నాను, వీళ్ళతో వేగలేక. ఆ, ఇంతకీ బంగార మెలా వుందండీ ?

రా : డెబ్బయి ఏనో, డెబ్బయి ఆరో ఉంటుంది.

శి : అవున్లెండి. ఆడదానివయస్సు, బంగారం ధర ఇంతా అని తేల్చి చెప్పలేం ?

రా : బాగా చెప్పారు. ఏం, బంగారంధర అడుగుతున్నారు? ఏమేనా నగలు మీరూ కొందామనా ?

శి : నా ఆర్జనకు కొనడంకూడానా అమ్మదామనే.

రా : అదేమిటండి. అలా అంటారూ. మీ కేం లోటు! నెలకి నాలుగువందలు సంపాదిస్తారాయె.

శి : ఏం సంపాదనో, ఒక పంటికిందికి రావటం లేదు. ఎంత చెట్టుకి అంత గాలి అనీ-

రా : అదుగో బస్సొస్తున్నది. (బస్సు హారను, బస్సు చప్పుడు )

కండక్టర్ : ఎవ రేసు, ఎవ రేస్. ఒ_త్తరుదా.

రా : శివరామయ్యగారూ, మీ రెక్కండి. ఆఫీసు వేళ మించి పోతుం దంటున్నారు.

శి : థేంక్సు, సెలవు.

౨

ఇది జరుగుతున్నంతసేపు చలనంలో, నిండివున్న బస్సులోని వాతావరణం. ఇద్దరు, ముగ్గురుగా సంభాషణలూ, గంటలు, డ్రైవరు ఎడమురికా; కండక్టరు నోటితో ఉళ్, 'వుళ్ళ పొంగో', 'టిక్కెట్ సార్'. 'బిల్ల రిల్లి' మొదలైన వాతావరణం.

శి : ఏవిరా రాముడూ.

రా : నాతో మాట్లాడకు.

శి : నీతో కాకపోతే ఇంకెవరితో మాట్లాడమంటావ్.

బస్సులో నవ్వులు

రా : చూడు వాళ్ళంతా ఎల్లా నవ్వుతున్నారో.

శి : వాళ్ళు నవ్వుకొంటే నీకేం?

రా : నాకేమా? మా బావుంది నీతో. వాళ్ళు నన్ను చూసే నవ్వుకొంటున్నారు.

కం : ఎన్నసార్. ఎంగపోవ్రణం. టికెట్ సార్.

శి : టిక్కెట్టు కొనరా.

రా : రెండు పారిస్.

కం : రెండాసార్. రెండావదు ఆళుయూరుసార్.

రా : ఆ. ఆ. ఒకటి. ఒక పారిస్.

బస్సులో నవ్వులు

రా : చూడు నువ్వేమిటి చేశావో.

శి : నేనేమిటి చేశాను మధ్యన.

రా : చేసింది నువ్వు కాదూ. నువ్వు నవ్వులపాలు చేస్తున్నావు. ఇంకా ఏంచెయ్యాలి?

శి : అదేమిట్రా.

రా : నాశరీరంచూసి వాళ్ళు నవ్వుకొంటున్నారు. నేను ఇద్దరు మనుష్యుల బరువు ఉన్నానని. అందుకే రెండు టికెట్లు కొంటున్నా నను కొంటున్నారు గాబోలు.

శి : అందులో తప్పేముంది.

రా : తప్పుకాదూ. అవును నీకేం తెలుస్తుంది. ఎద్దుపుండు కాకికి రుచి. అవును నన్ను గురించి ఎవరేమనుకొంటే నీకేం ?

శి : అదేమిట్రా, అలా అంటావు. నిన్నంటే నన్నన్నట్లు కాదూ. నిన్ను గురించి ఎవరేమనుకొన్నా నన్ను (ఎవరో స్టాపింగ్ హాల్డాన్) గురించి అనుకొన్నట్లే లెక్క. ఏం ఇదవకు. అదుగో చోటు కాళీ అయింది. కూర్చో.

కం : నాయర్ రోడ్. హాల్డాన్. ఒక్తరుదా. యడమిల్లే.

రా : నువ్వుకూర్చో నేను నించుంటా.

శి : నీ తెలివి తెల్లవారా. నువ్వుకూర్చుంటే నేనుకూర్చు న్నట్టే. మరిచిపోకు. నువ్వూ నేనూ ఒకే శరీరంలో ఉంటున్నాం.

రా : ఆ. అవును కదూ.

శ్రీనివాసమ్మ: ఏమండోయ్, శివరామయ్యగారూ.

శి : ఒరే రాముడూ, ఎవరో పిలుస్తున్నార్రా నిన్ను. జవాబు చెప్పు.

రా : ఎవర్రా అది–నువ్వు జవాబు చెప్పు.

శ్రీని : ఏమండోయ్, శివరామయ్యగారూ.
శి : పలకరా, ఆవిడేమయినా అనుకోంటుంది.
రా : అబ్బ! నువ్వు జవాబు చెప్పరా.
శి : ఆవిడెవరో నాకు తెలీదు.
రా : అయితే నాకు మట్టుకూ తెలుసునా ఏమిటి ?
శి : తెలిసే ఉండాలి.
శ్రీని : ఏమండీ శివరామయ్యగారూ మాట్లాడరేం, పలుకే బంగారమా ?
శి : ఎవరూ బంగారమా.
శ్రీని : బంగారాన్ని కాదండి. బంగారమ్మ చెల్లెల్ని-సీనమ్మని.
శి : ఓహో! సీనమ్మా, మరిచేపోయాను. కులాసాగా ఉన్నావా ?
శ్రీని : అవును. మే మెందుకు జ్ఞాపకముంటాము లెండి!
శి : ఏదో పరధ్యానంలో ఉండి చూడలేదు.
శ్రీని : మేం కనబడతామా ?
శి : కూర్చో నిల్చునే ఉండిపోయావు.
శ్రీని : మీరు కూర్చోండి.
శి : పరవాలేదు. కూర్చో.
కండ : రైట్ రైట్ రైట్ రైట్
శి : ఏవిరా రాముడూ.
రా : ఏవిరా.
శి : ఎవర్రా ఆవిడా.
రా : ఎవరైతే నీ కెందుకూ ?
శి : ఓరి నాదగ్గరే దాస్తావుట్రా. చెప్పరా.

రా : నేను చెప్పను.

శి : చెప్పరా నేను మరెవరితోనూ అనను.

రా : నీ కా సంగతులు అనవసరం.

శి : నీ వాలకం చూస్తే ఏమైనా?

రా : ఛ. ఛ.

శి : ఈ సంగతి మన ఆవిడకు తెలిస్తే ప్రమాదంరోయ్.

రా : ఛీ, దురాత్ముడా.

శి : ఈ వయసులో నీ కీ పోయేకాల మేమిటి?

రా : నే నెలాపోతే నీకేం?

శి : అయితే అఘోరించు.

శ్రీని : కూర్చోండి శివరామయ్యగారు.

శి : కూర్చుకురా. ఎవరేనా చూస్తే ఏమేనా అనుకుంటారు.

రా : అనుకొంటే అనుకోనీ.

శ్రీని : ఏమిటి అదోలా ఉన్నారు? ఒంట్లో బాగా లేదా?

శి : (నిద్ర లేచినవాడిలాగ) ఆఁ.

శ్రీని : ఏమిటి మీలోమీరే ఏదో మాట్లాడుకొంటున్నారు!

శి : ఏం లేదు. ఏం లేదు.

శ్రీని : పోనీండి చెప్పకపోతే. మీరే దాచుకోండి.

శి : నీ దగ్గిర నాకు దాపరిక మేమిటి?

శ్రీని : ఇదుగో ఇలా అంటూనే మభ్యపెడతారు. ఆవేళ హాట్లంలో ఏముందీ చూడనిచ్చారా?

శి : ఎప్పుడూ.

శ్రీని : ఇంతలోనే మరుపా. పదిరోజుల కింపట. జ్ఞాపకం లేదూ?

శి : ఓ. అదా. ఏం వుందీ. మందుపాట్లాం.

శ్రీని : అయితే నన్నెందుకు చూడనిచ్చారు కాదూ?

శి : మందుపాట్లాం ఏం చూస్తావు? కంటెనా, కాసుల పేరనా.

శ్రీని : చాల్లెండి. ఆ పొట్లంలో ఏమున్నదీ నేను తెలుసుకోలేనట్లు. మీ ఆవిడకు గొలుసు చేయించి తీసుకెళ్ళుతున్నారు. అది నేను చూస్తే ఎక్కడ అడుగుతానా అని చూపెట్టలేదు.

శి : ఆ, నీకెలా తెలుసు

శ్రీని : మీరు చెప్పకపోతే మాకు తెలియకపోదు.

శి : నీకెలా తెలిసిందీ అంటా?

శ్రీని : మీ ఆవిడే చూపించింది లెండి.

శి : అల్లాగా.

శ్రీని : గాభరా పడకండి. నేను అడగన్లెండి. నేనుఅడిగినా—

రా : అడుగుతుంది కాబోల్రా.

శి : ఏమిటిరా.

రా : కంటో, కాసులపేరో, దీనికెక్కడ చేయించేదీ.

శి : ఓ అదా. నేనంతా విన్నానులే.

రా : ఏం దారిరా భగవంతుడా.

శి : సరే. ఇక్కడే దిగిపో.

రా : ఆఫీసో.

శి : ఆఫీసు మాట దేవుడెరుగును—దిగిపో.

శ్రీని : ఏవండీ మాట్లాడరేం?

శి : ఆఁ ఏదో ఆలోచిస్తున్నాను.

శ్రీని : ఏమిటి పిల్లలకి గాజులు చేయించడమా మానడమా అనా?

శి : నీ కెలా తెలుసు ?

శ్రీని : ఓస్సి ఈ మాత్రం కనుక్కోలేనా ?

శి : స్టాపింగ్ హోల్డాన్.

శ్రీని : మీరూ దిగుతున్నారా ?

శి : ఎక్కడికి ?

శ్రీని : మరి బస్సాపమని కేకేశాగే

శి : నువ్వు దిగుతావుకదా అని.

శ్రీని : నేను దిగుతానని మీ కెలా తెలుసు.

శి : నా మనస్సులోని విషయాలు నువ్వు కనుక్కోగా లేంది, ఈ మాత్రం నేను కనుక్కోలేనా ?

శ్రీని : అంటే ?

శి : అంటే ఏమిటో నీకే తెలుసు. నే నెందుకు చెప్పడం

బస్సు ఆగుతుంది

శ్రీని : సరే నే దిగుతున్నా. మరిచిపోకండి.

శి : ఆఁ. ఆఁ. ఏమిటి మరిచిపోవద్దంటావ్.

శ్రీని : అదే నే నడిగింది.

కండ : ఎరంగమ్మా. యాడూ ఏరాదు. సార్ ఎడమిల్లే. ఎ రంగమ్మా.

శి : ఏమిరా రాముడూ.

రా : ఏం?

శి : బాగా తప్పించుకొన్నావే.

రా : ఏం, నీకు కష్టంగా ఉందా?

శి : అవేం మాటలురా.

రా : 'మరి బాగా తప్పించుకున్నావే' అని యీసడించి నట్టు అంటావేం?

శివ : అది కాదురా. ఆవిడిక్కడ దిగుతుందని నీ కెలా తెలుసు అంటా.

రా : అవన్నీ నీ కనవసరం.

శి : చెప్పరా. నా కన్నా నీ కెవరున్నారు చెప్పు.

రా : చెప్పను.

శి : సరే దాచుకో పోని. ఆవి డేమి టడిగింది?

రా : ఏమిటడిగిందా? ఏమిటంటే -ఏమిటయితే నీ కేంపుకు! నువ్వేం ఆర్చేవాడివా, తీర్చేవాడివా?

శి : అవును. ఆర్చేవాణ్ని, తీర్చేవాణ్ని నేనే చెప్పు.

రా : వెళ్ళవోయి. నీవు ఆర్చేది తీర్చేదీ ఏమిటో నాకు తెలుసు. కబుర్లు చెప్పకు.

శి : లేదురా నాయనా, నీ కేమయినా అప్పులుంటే తీర్చే స్తాను.

రా : ఆస్తుంటే ఆర్చేస్తావ్. అంతేనా.

శి : వేళాకోళం కాదు గానీ, ఆవి డేమిటడిగిందో చెప్పు.

రా : ఏమి టడుగుతుంది. డబ్బు - డబ్బు - డబ్బు.

శి : ఎంతడిగిం దేమిటి?

నన్ను గురించే

రా : ఓ రెండువందలు.

శి : ఇస్తావా ?

రా : ఇస్తాను రమ్మనీ, నేను కూచమ్మనా ? రెండు వం
లుంటే పిల్లలకి గాజులు చేయించనూ.

శి : శుభస్య శీఘ్రం పిల్లలకి గాజులు చేయించు.

రా : డబ్బెక్కడుంది ?

శి : డబ్బు లేనట్లే మాట్లాడుతావ్. నాకు తెలీదా ? ది.
ఇదుగో బంగారపు దుకాణం. వెళ్ళు. చేయించు.

రా : మీ తాతగారి సొమ్ము దాచబెట్టావ్ ?

శి : మీ తాతా మా తాతా వేరు కాదురా నాయన

రామారావ్ : నమస్కారం సాబ్.

రా : ఏమిట్రా అంటావ్.

రామా: నమస్కారం శివరామయ్యగారూ. పరధ్యానం
ఉంటున్నారే.

శి : ఏం రామారావూ నువ్వా ?

రామా: అవునండీ.

శి : ఏం ఈ రూటులో వస్తున్నావ్ ? ఎక్కడెక్కావ్.

రామా: బ్రజుల్లా రోడ్డుదగ్గర ఎక్కాను.

శి : ఆహా, అలాగా! పలకరించావ్ కాదేం ?

రామా: మీరు సీనమ్మతో మాట్లాడుతున్నారని పలకరిం
లేదు.

శి : శీనమ్మను నీ కెలా తెలుసు ?

రామా: బావుందండోయ్. శీనమ్మ ఎవరికి తెలీదు ?

శి : ఏమిట్రోయ్. నా సంగతి వీడికి తెలుసుగాబోలు.

శి : ఎవర్రా వాడు ?

రా : మా ఆఫీసులో గుమాస్తారా.

శి : అయితే.

రా : ఇంకేముందిరా, ఆఫీసులంతా ఊదుతాడురా.

శి : ఊదనీ, నీకేం భయం ?

రా : నీకు తెలీదురా. గొప్పచిక్కొచ్చిందే.

రామా: ఏమండీ, అలాగున్నారు. ఒంట్లో బాగులేదా!
అరె! జ్వరం తగిలిందే. ఒళ్ళు మండిపోతోంది.
ఇంత జ్వరంతో ఆఫీసుకి వస్తున్నారేం ?

శి : ఈ మాత్రం జ్వరానికే ?

రామా: అలా కాదు సార్. దిగండి. ముందు ఇంటికిపదండి.

శి : వాడు చెప్పిందే రైటు. ముందు ఇంటికి పద.

రా : నన్ను ఇంట్లోకిచేర్చి వీడు లోకమంతా ఊస్తాడురా.

శి : అయితే నీకేం భయం.

రామా: బస్సు ఎన్ని గంటలకి వస్తుందో టాక్సీలో పోదాం.
ఏయ్ టాక్సీ. ఏయ్ టాక్సీ.

టాక్సీ, బస్సు, సైకిల్ గందరగోళం

జరుగుతున్నంతసేపూ ఆలిండియా రేడియో గ్రామఫోను రికార్డుల సంగీతం. తబలీపాట రెండు సెకన్లు. తరవాత ఎన్నాళ్ళుండెద విహా సుఖములలో... – నాగయ్య రికార్డు.

చిన్నమ్మాయి: నాన్న మనకెందుకు చేయిస్తాడే. తన పెళ్ళానికి చేయించుకొంటాడుగాని.

పెద్దమ్మాయి: అవున్లే. పెళ్ళామంటే బెల్లం.

చిన్న : పొద్దున్న చెప్తావుంటే వినిపించుకొన్నాడే కాదు.

శివు : ఒరేయ్ రాముడూ బస్సుదిగిపో. తిరుగు బస్సులో ఇంటికి వెళ్ళిపో.

రాము: నా ఒళ్ళు మండుకొస్తున్నాదిరా.

శివు . అవును. అందుకే ఇంటికి వెళ్ళిపొమ్మంటున్నాను. జ్వరం తగిలింది.

రా : జ్వరంకాదురా, రామారావుమీద ఒళ్ళుమంటరా ఇది.

రామా: మీరు నెక్స్టు బస్సులో ఇంటికి వెళ్ళిపోండిసార్. నేను ఆఫీసులో చెప్తానులెండి.

రా : చూడరా ఆఫీసులో చెప్తానంటున్నాడు.

శివు : ఏమిటీ చెప్తాడు నీ మొహం.

రా : నన్ను గురించేరా. చెప్తాడురా. వాడంతవాడేనురా. చెప్పితీసుతాడురా.

రామా: పోనీండి నేను కూడా వచ్చి మిమ్మల్ని ఇంట్లో దిగ బెట్టమన్నారా, స్టాపింగ్ హోల్టాన్. కండక్టర్ స్టాపింగ్ హోల్డాన్.

బస్సు ఆగుతుంది.

శ : ఫరవాలేదోయ్ రామారావ్.

పెద్ద : ఎందుకు వినిపించుకుంటారే? డబ్బు విషయం తప్ప మరేదయినా మనస్సులో గొణుక్కొన్నా ఆయనకు ఇట్టే వినబడుతుంది.

చిన్న: పది రోజులాయి, అడుగుతున్నామే – సమాధానం కూడా చెప్పరేం? చేయించను అంటే మళ్లా అడుగుతామా?

పెద్ద : ఇలా అడిగితే లాభం లేదే. రాత్రి ఇంటికి రాగానే-మీను గాజులు చేయించకపోతే మేం భోజనం చెయ్యమని పట్టు పడదాం.

చిన్న: అవును. అదే మందు. ఈ రేడియో కొనిపించినట్టే అవీ కొనిపించాలి.

టాక్సీ హారన్

రామారావ్ : రత్తమ్మగారూ తలుపు, తలుపు.

పెద్ద : ఎవరదీ?

రామా: నేను తలుపు తియ్. (తలుపు తీసిన చప్పుడు) మీ నాన్నగారికి జ్వరం వొచ్చింది. మంచం వాల్చి పక్క వెయ్. అందాకా ఈ పడకకుర్చీలో పడుకోండి సార్,

శి : చిన్నా, అమ్మేదే ?

చిన్న: శీనమ్మగారింటికి వెళ్ళింది నాన్నా.

శి : శీనమ్మగారింటికా ?

చిన్న: అవును నాన్నా. బంగారమ్మా, రాజారాంగారి కోడలూ వస్తే, అందరూ కలసి వెళ్ళారు.

పెద్ద : పక్క వేశాను పడుకో నాన్నా.

శి : సరే నమ్మా. రామారావ్.

రామా: యేం సార్.

శి : ఆఫీసులో చెప్తావు కదూ ?

రా : చెప్తాను సార్. మీరు పడుకోండి.

శి : రేడియోలో ఏమిటోయ్ పాట.

లా : ఆప చేసేమన్నారా ?

శి : ఉండనీ. చూడు పెద్దమ్మాయ్.

పెద్ద : ఏం నాన్నా.

శి : ఆ డ్రాయరులో చెక్కు బుక్కు తే అమ్మా.

పెద్ద : ఎందుకు నాన్నా ?

శి : తేవే అమ్మా. చూడూ, రామారావ్ బంగారం ధర ఎంతోయ్ ?

రా : నాకు తెలీదు సార్.

శి : డెబ్బయిఅయిదో, డెబ్బయిఆరో ఉంటుంది. చెక్కు రాసిస్తా. మా అమ్మాయికి సాయంత్రం ఆఫీసునించి వచ్చేప్పుడు గాజులు కొని తే.

చిన్న: మా కిప్పు డొద్దు నాన్నా.

రా : ఇప్పుడేం తొందరొచ్చింది. రేపు మీరే వెళ్ళి కొందు
గుగాని, నాకు ఆ నగల సంగతి తెలీదు.

శి. : పరవాలేదు కొనవయ్యా, కొను.

పెద్ద : ఇదిగో నాన్నా పుస్తకం.

రామా: ఎందుకు సార్. నాకు తెలీదంటేను.

శి : అయితే రామారావ్. ఓ సంగతి అడుగుతాను.
బస్సులో నా పక్కన ఎవరు కూర్చున్నారు?

రామా: ఎవరో అరవావిడ కూర్చుంది.

శి : నిజం,

రామా: నిజంసార్. బజుల్లా రోడ్డు దగ్గిర్నుంచీ నేను ఎదురు
గుండా నుంచోనే వున్నాను.

శి : అయితే నే నెవరితోటి మాట్లాడ లేదన్నమాట.

రామా: మీలో మీరే ఏదో మాట్లాడుకొంటున్నారు.

శి : ఆహా, అలాగా రామారావ్. నీకు శీనమ్మగారి ఇల్లు
తెలుసా.

రామా: తెలుసు ఎందుకూ!

శి : మా ఆవిడక్కడ ఉంటుంది. రమ్మనిచెప్పు. ఇంద
చెక్కు. గాజులు మరచిపోకు. సైజు లివ్వండే.

గాజుల చప్పుడు

పెద్ద : ఇదుగో నా సైజు.

చిన్న : ఇందండి.

రామూ: వెళ్లొస్తాన్ సార్. డాక్టర్ని కూడా పంపిస్తాను.

శివ : డాక్టరెందుకోయ్, రేపు కులాసాగా ఉంటాను.

రామూ: తలుపేసుకో అమ్మాయ్.

శివ : అయితే బస్సులో నీకు తెలిసిన వాళ్ళెవ్వరూ నా పక్కన కూర్చో లేదంటావు.

రామూ: లేదుసార్. ఏమలా అడుగుతున్నారూ ?

శివ : ఏంలేదు. వెళ్ళిరా. పెద్దమ్మాయ్, తలుపు వేసిరా. (తరవాత పాట స్వర్గసీమనుండి. గృహమేకదా స్వర్గ సీమ) చిన్నా ఇలారా. ఎందుకు కన్నీళ్ళు !

చిన్న : ఏం లేదు నాన్నా.

శివ : నాకు తెలుసులే. ఆకన్నీళ్ళు నన్నుగురించే. అవునా.

చిన్న: కాదు నాన్నా.

శివ : అవును. నన్ను గురించే, ఏం ?

చిన్న: అవును నాన్నా.

శివ . సరే, ఫ్లాస్కులో కాఫీ ఉందేమో చూడు.

శివ : ఏంరా రాముడూ.

రా : ఏం ?

శివ : గుమ్మడికాయల దొంగనై పోయావే.

రా : అంటే.

శివ : ఏం లేదులే. మనస్సులో చేసిన పాపం, బంగారంతో హరించుకు పోతుందా ?

చిన్న: కాఫీ లేదు నాన్నా.

నాన్నా! నాన్నా! ఏమిటి నాన్నా. నీలో నువ్వే మాట్లాడుకొంటున్నావు? అక్కా ఇలా రావే.

శివ : ఏమీ లేదమ్మా, నన్ను గురించే. భయపడకు.

—....—

ఇందలి పాత్రలు :

సుందరమ్మ
రత్తమ్మ
సరోజ
అన్నయ్య
సుశీల

---

# అక్కయ్యకి ప్రమోషన్

మూడేళ్ళ తరువాత సుందరమ్మ పుట్టింటికొచ్చింది- ఈమూడేళ్ళూ అత్తారింట్లో పాపం యమయాతన అనుభవించింది. పుట్టింటికొచ్చిన రెండురోజుల తరువాత—

సుందరమ్మ: సుశీలా, సుశీలా! ఒసేవ్ ... సుశీలా ఇలా రా.

రత్తమ్మ: ఏమిటే సుందరం! ఏమిటా గావు కేకలు! నిమ్మళంగా మాటాడు కొంప అంటుకుపోయినట్టు అట్లా అరుస్తావేం!

సుం : నేనేం అరవలేదు తల్లీ, అరవలేదు. నామీదేం విరుచుకు పడకు.

ర : నీమీదెవరూ విరుచుకు పడడంలేదు.

సుం : విరుచుకుపడటం కాకపోతే ఇదేవిటి? ఆడబిడ్డని పిలిచేపాటి అధికారంకూడా లేదన్నమాట.

ర : ఎవరు పిలవొద్దన్నారు. ఆ పిలిచేదేదో నెమ్మదిగా పిలవమన్నానుగాని.

సుం : ఆ-ఇంత బిగ్గరగా పిలిస్తే దిక్కూ మొక్కూ లేదు. ఇక నెమ్మదిగా పిలిస్తే ఆవిడగారు వినిపించుకొంటుందా.?

ర : వినబడితే ఎందుకు వినిపించుకోదూ,

సుం : వినబడాలనే బిగ్గరిగా అరుస్తు-వినిపించుకోంటేనా ?
ర : ఏదో పనిలో ఉండుంటుంది.
సుం : పనిలో ఉంటే మటుకూ? పిలిస్తే రా అక్కర్లా ? ఇదే మా అత్తారింట్లో అయితేనా ...
ర : ఇది మీ అత్తారిల్లు కాదు. పుట్టిల్లు.
సుం : మా బాపుందమ్మా, నాకు పుట్టిల్లేగాని సుశీల కత్తారిల్లేనా ! కాదా ?
ర : అయితే ?
సుం : అయితే ఏవిటి, అయితే ? అత్తారిల్లు అన్నాక అదుపాజ్ఞల్లో పెట్టకపోతే ఎల్లాగ. మా వదినగారు పిలిస్తే మా తోటికోడళ్ళం గజగజలాడిపోవలసిందే. అత్తగారితో ఏం చెప్తుతుందో అని అరచేతిలో ప్రాణాలు పెట్టుకు కూర్చుంటాం.
ర : కూర్చుంటే కూర్చోండిగాని ఇక్కడలాంటివేం పనికి రావు.
సుం : ఎలా పనికొస్తాయి, నీలాంటి చేతకాని అత్తగా రయ్యాక.
ర : చేతనైన్దానో-చేతకాన్దానో రవ్వారట్టూ లేకుండా బతుకుతున్నాం. ఏదో ఇలా బతకనీ తల్లీ ...
సుం : బతకనివ్వక నేనేం చేస్తున్నానేం ?
ర : కాకపోతే మరేవిటి - వచ్చిందగ్గిర్నుంచీ - వదిన గారి అథారీ అంటూ ఇల్లుతీసి పంది రేస్తున్నావ్ ! ఎవరేనా కూతురింటికి వచ్చింది అంటే సంబరపడ

తారు. నువ్వొచ్చేవ్, అందర్నీ నానా హింసా పెడు
తున్నావ్.

సుం : బుద్ధి గడ్డితిని వచ్చా. ఏదో పుట్టింటికెళ్ళి నాలుగు
రోజులు సుఖపడదాంకదా అని వస్తే... పోన్లే తల్లీ
నీ కింత భారమైతే పోతా.

ర : నిన్నెవరూ పొమ్మన్లేదే! ఎందుకేడుస్తావ్!

సుం : ఏడుపు కాకపోతే... ఇంకేముంది నా బతుక్కి? వచ్చి
రెండురోజులైంది - ఎప్పుడు విరగ డవుతానా అని
అంతా అనుకొంటున్నారు. కన్నతల్లివి. నీకే కంటక
మైపోతే... ఛీ ఎందుకీ బతుకు?

ర : ని న్నిప్పు డెవ రేవిటన్నారే... అలా శోకాలు
తీస్తావ్...

సుం : ఇంతకన్న ఇంకేవిటి అనాలి...

ర: ఉండు, ఎక్కడికలా వెళ్ళిపోతున్నావ్.

సుం : ఈ యింట్లో ఇంకో క్షణం నేనుండను. ఉంటే నేను
కోటమ్మగారి కోడల్నే కాను.

ర : ఏవిటే ఈ ఒట్లూ సత్యాలూనూ!

సుం : కాకపోతే మరేమిటి? కన్నతల్లివి నువ్వే తన్ని తగి
లేస్తూఉంటే...

ర : నిన్ను నేను తగి లేస్తున్నానా? అవ్వ... ఎవరేనా
వింటే నవ్విపోతారు.

సుం : ఎందుకు నవ్వరూ! కోడలి చేతుల్లో కీలుబొమ్మై
వయ్యావని తప్పకుండా నవ్వుతారు.

ర : నేనేం కాలేదు.

సుం : అయితే దాన్ని వెనకేసుకొస్తూ నన్ను తిడతావేం?

ర : దాన్ని వెనకేసుకు రాలేదు; నిన్ను తిట్టాలేదు. యీ యిల్లు కొంచం శాంతంగా ఉండనివ్వమన్నా!

సుం : అదే - నేనుంటే ఈ యింటో శాంతుండదనేగా నీ ఉద్దేశం. సరే... పోతా, వెంటనేపోతా.

ర : పోతా పోతా అని బెదిరిస్తున్నావ్! అంత ఇదిగా ఉంటే తప్పకుండా వెళ్లు.

సుం : వెళ్ళక ఇక్కడ ఉండిపోతాననుకొన్నావా?

ర : ఉండాలని లేకపోతే నిన్నెవరూ బలవంత పెట్టరులే.

సుం : ఎందుకుపెడతారూ! కూతురని అభిమానం ఏడిస్తేగా!

ర : అభిమానం లేక కాదు.

సుం : ఉంటే ఎందుకు పొమ్మంటావేం.

ర : నేను పొమ్మన్లేదని నీ కెన్నిసార్లు చెప్పాలి!

సుం : నువ్వు చెప్పక్కర్లేదు, నేను వినాక్కర్లేదు. నా పెట్టె బేడా సర్దుకొని నేపోతా.

ర : అయితే మీ నాన్నగారొచ్చాక ఆయనతో చెప్పి వెళ్ళు.

సుం : నే వెళ్లాక నువ్వే చెప్పు - సుందరాన్ని ఇంట్లోంచి తరిమివేశానని.

ర . ఇలాంటి విపరీతమాటలు నే చెప్పలేనమ్మా.

సుం : చెయ్యగాలేంది, చెప్తేనేం.

ర : అమ్మా...నీ కొక్షి దండం...నన్ను వెళ్ళనీ! అవతల కొళాయి కెళ్ళి నీళ్ళు తెచ్చుకోవాలి.

సుం : నీళ్లు నువ్వెందుకు తేవాలి...సుశీలని తెమ్మను.

ర : బాపుందేవ్. ఇంటెడి చాకిరీ చేస్తున్నది చాలదూ! ఇది కూడానా!

సుం : చేస్తున్నాదంటే ఎవరికోసం చేస్తుంది. అదీ, దాని తల్లో పేనుకూడా చెయ్యాలి.

ర : పేన్లు ఇంటిపన్లు చెయ్యవు.

సుం : చేస్తాయి. మాచకా చేస్తాయి. మా అత్తగారెప్పుడైనా ఒక చుక్క నీళ్లు తెస్తారా. నేనో మా తోటి కోడలో తేవాలిగాని – అరే— వినిపోకుండా వెళ్ళిపోతావేం... సరే, వెళ్లు వెళ్లు.
సుశీలా, సుశీలా... ఒసేవ్ సుశీలా! పిలిస్తే నిన్ను కాదూ.

సరోజ : ఏవక్కయ్యా, ఏమిటా అరుపులు!

సుం : అమ్మవెళ్ళిందంటే నువ్వొచ్చావు! రా తల్లీ రా – అమ్మ నన్ను తగిలేస్తానంది. నువ్వు నిజంగా తగిలేయ్, తీరిపోతుంది.

సరో : అదేమిటక్కయ్యా – తగి లెయ్యడవేమిటి! నీకేం మతిపోయిందా?

సుం: మతి నా కెందుకుపోతుంది. నీకు పోయింది, మీ అమ్మగారికిపోయింది, మీ వదినగారికీ 'పోయింది, మీ యింటిల్లిపాదికీ పోయింది. లేకపోతే నన్ను తగిలేస్తా

నంటారా. తగిలెయ్యండి. తగిలెయ్యండి. కోడల్ని వెనకేసుకు వచ్చినందుకు ఊరూ నాడూ ఏకమై మీ అందరి నోట్లో ఇంతగడ్డిపెడితే అప్పుడు తెలిసొస్తుంది.

సరో : అట్టే విసిగించక అసలు సంగతేమిటో చెప్పు. నిన్నేవ రేమిటన్నారు?

సుం : ఎవరు ఏమిటనకూడదో అదే అన్నారు. లేకపోతే నేనెందుకు నొచ్చుకొంటాను.

సరో : ఏదో కోపంలో అనుంటుంది. దాన్ని నువ్వు పట్టించు కోడవేమిటి చెప్పూ.

సుం : కోపం! అమ్మకి కోపంరావడం నువ్వెప్పుడేనా చూశావా?

సరో : సాధారణంగా రాదనుకో, గానీ నువ్వేదో కెలికుంటావు, కోపం వచ్చిఉంటుంది.

సుం : అయ్యో రాతా! 'అదే పతకమైతే అమ్మకు బతకనా' అన్నట్టు, అమ్మకే కోపంవస్తే ఇకనేం... ఈ సుశీల నన్ను దమ్మిడీ ఎత్తయినా ఖాతరు చెయ్యటంలేదని చెవినిల్లు కట్టుకొని చెపితే అమ్మ వినిపించుకొంటేనా! పైపెచ్చు నన్నే తిడుతున్నది.

సరో : ఏవిటీ, వదిన నిన్ను ఖాతరు చెయ్యటంలేదూ, అదెప్పట్నుంచీ... ..

సుం : ఎప్పుడు చేసిందేం - ఫలానాఅప్పుడు చెయ్యలేదని చెప్పడానికి? ఈయింట్లో ఆడబిడ్డలకి ఏమాత్రమైనా

స్వతంత్రం ఏడిస్తేగా. ఇదే మా అత్తారింట్లో అయితేనా-

సరో : మీ అత్తారింట్లో అయితే ఏమయ్యేది ?

సుం : ఏవయ్యేదని నింపాదిగా అడుగుతావేం. ఈపాటికి మా మావగారు చెప్పినట్లు దేవాదేవేషు అయి పోయేది. మా వదినగారు నామీద చాడీలు చెప్ప గానే మా అత్తగారు శివాలు తొక్కుతుంది. ఇద్దరూ కలసి ఇంట్లో ఆటంబాంబు పేలినట్లు రాద్ధాంతం చేస్తారు. చెరో చీపురుకట్టా తీసుకొని నా వళ్ళు వలిచేస్తారు.

సరో : వాళ్ళ మొఖమీడ్చా - వాళ్ళ కదేం పోయేకాలం.

సుం : అత్తగారూ - ఆడబిడ్డా అన్నాక ఆమాత్రం అధి కారం ఉండదా ఏం ? వాళ్ళ తప్పేంలేదు.

సరో : వాళ్ళ తప్పేంలేదూ - ఏమిటక్కయ్యా- ఏం మాట లివి ? ఒంటి మీద స్పృహ ఉండే మాట్లాడు తున్నావా ?

సుం : స్పృహలేకేం-ఎంచక్కా-ఉంది, లేందల్లా మీకే...

సరో : నువ్వనే దేవిటి ? మమ్మల్నేమిటి చెయ్యమన్నావో చెప్పు.

సుం : చెప్తే చేస్తారా - పెడతారా, నేను నోరు పారేసు కోడవే గాని.

సరో : చెప్పకూడదూ? ఆదిలోనే అనుమానం అయితే ఎల్లాగ.

సుం : నే చెప్పినట్టు చేస్తావా.

సరో : చేస్తాలే చెప్పు.

సుం : అలాకాదు. చేస్తానూ అని మాటిస్తే చెప్తాను - ఏదీ ఒట్టెయ్యి.

సరో: ఏం వట్టెయ్యమంగ్నావ్.

సుం : చెప్పినట్టు చెయ్యకపోతే కోటమ్మగారి కోడలినే కాదని ఒట్టెయ్.

సరో : నేను కానుగా ?

సుం : అలవాటులో అనేశా. పోనీ అమ్మమీంద ఒట్టెయ్.

సరో : డోంట్ బీ సిల్లీ. నాకీ ఒట్లూ సత్యాల్లో నమ్మకం లేదు. నువ్వు చెప్పినట్టు చేస్తానుగా.

సుం : అయితే ఇలా దగ్గరగా రా. విను. తన మొగుడేకద, తను చెప్పినట్టు వింటున్నా డని సుశీలకి మా గర్వాంగా ఉంది.

సరో : ఉండదేం. నువు చెప్పినట్టూ మీఆయనేగాని వింటే నీకూ ఉంటుంది ఆమాత్రం గర్వం.

సుం : నాకు లేదని కాదు. నేను చెప్పినట్లు - మా ఆయనా వింటారు.

సరో : అయితే మీ అత్తారింట్లో ఎందు కన్ని కొట్లాటలు? మీ ఆయన చూస్తూ ఎందు కూరుకుంటాడు?

సుం : బావుందేవ్ ... ... పెళ్ళాం ఎంత బెల్లంముక్కయినా తల్లికీ తోడపుట్టినదానికీ ఎదుట చెప్పమంటావా!

మా ఆయన మంచివారు కాబట్టి వాళ్ళేన్నన్నా నన్ను పడమంటారు. చాటుగా నన్ను ఓదారుస్తారు.

సరో : అడుసు తొక్కడం ఎందుకు; కాళ్ళు కడగడం ఎందుకూ? ముందు పడమనడం ఎందుకూ? తరవాత ఓదార్చడం ఎందుకూ?

సుం : ఎందుకేమిటే సరోజా ...... మొగుడూ పెళ్ళాల అన్యోన్యం అంటే మరేవిటి?

సరో : ఓ యబ్బ... ఇదే అన్యోన్యమైతే అది పగవాళ్ళ కేనా వద్దు తల్లీ.

సుం : ఇదుగో నువ్విల్లా ఊసడిస్తావనే నేను చెప్పనన్నా.

సరో : ఫరవాలేదు – చెప్పు.

సుం : అంతా విని నవ్వుతావ్... నేను చెప్పను... పో.

సరో : నవ్వ నక్కయ్యా... చెప్పు.

సుం : చూడూ, నువ్వూ నేను కలిసి యీ సుశీల పొగరణ చాలి. ఏమంటావ్?

సరో : ఓ అణుద్దాం. పొగరు నిజంగా ఉంటే తప్పకుండా అణుద్దాం.

సుం : లేదంటావేవిటే, కళ్ళెదుకుగుండా కనపడుతూ ఉంటే!

సరో : సరే, ఎలా అణచడమో అదీ నువ్వే చెప్పు.

సుం : ఏముంది, ఇంకో గంటలో అన్నయ్య కోర్టుకెళ్ళి పోతాడు.

సరో : అవును వెళతాడు. లేకపోతే ఈ ఇల్లెలా గడుస్తుంది.

సుం : అబ్బ అదికాదే నే ననేది. అన్నయ్య కోర్టుకెళ్ళి పోతాడు, నాన్న మరోగంటదాకా రాడు.

సరో : రాడు. వస్తే ఇక్కడేం ఊసుపోతుంది.

సుం : నువ్విల్లా వేళాకోళం చేస్తే నేన్చెప్పను.

సరో : వేళాకోళం కాదు. ఉన్నమాట చెప్తున్నాను. సరే అన్నయ్యా, నాన్నా ఇంట్లో వుండరు! అప్పుడేం చేద్దాం.

సుం : అప్పుడు దీని పని పట్టిద్దాం.

సరో : ఎలాగ?

సుం : ఎలాగేమిటి? దెబ్బకి దెయ్యం దడుస్తుంది. చేంతాడు పట్టుకొని నువ్వూ, గొరకచీపురు పట్టుకొని నేనూ బాదుతే దీని పొగ రణుగుతుంది.

సరో : రైటో... చితక తందాం. పోనీ అక్కయ్యా, వాతలు పెడితేనో.

సుం : అవునేవ్...నాకది తట్టనే లేదు సుమా, మావదినగారూ మా అత్తగారూ నాకు ఎప్పుడూ వాతలు పెట్టలేదు.

సరో : అయితే మనమూ పెట్టొద్దులే, బడితపూజ చేద్దాం చాలు.

సుం : అమ్మ యింట్లో ఉంటే ఇబ్బంది! ఏం సాధనం ?

సరో : అమ్మని నేను ఒప్పిస్తాగా,

సుం : నీ అమ్మకడుపు చల్లగా, నీ అత్తకడుపు చల్లగా, అలా దార్లోకి రా...

సరో : కానీ, అక్కయ్యా, ఏ కారణం లేందే-ఎలా తన్నడం!
ఏదో ఒకసాకు కల్పించాలి కద.

సుం : ఆ -నన్ను మా అత్తగారూ ఆడబిడ్డా కారణంఉండే ఖాయిదాలో పెడుతున్నారా ఏమిటి; మనసుంటే లక్ష మార్గాలు.

సరో : అయితే నాకింకా టెక్నిక్ తెలీదు. ఎలా గిల్లికజ్జా పెట్టుకోడమో నువ్వే చెప్పు.

సుం : ఏముంది, కాఫీ తెమ్మందాం. అందులో ఈగో, దోమో ఉందని తిడదాం.

సరో : లేకపోతే—

సుం : ఉండాలా ఏవిటి, మనం వున్నాయంటే ఉన్నట్టే.

సరో : భేష్, లేకపోతే మేమన ఇంత చెత్తా చెదారం పోద్దాం.

సుం : అవునేవ్. నీది అచ్చంగా మా ఆడబడుచు పోలికలే.
ఆవిడగారికి తట్టినన్ని ఉపాయాలు నీకూ తడతాయి.

సరో : నా జన్మ తరించిందిలే. అంత గొప్పవాళ్ళ పోలికలు రావడం చాలా కష్టం.

సుం : కాదూ మరి. ఆవిళ్ళాగ ఉండామని నేనెంత కొట్టుకు చస్తున్నా ఆ ఊహాలు తట్టందే!

సరో : అవున్లే. పుట్టుకతోటే రావాలి. ఇవి చిన్నప్పట్నుంచీ తరిఫీదవాలి.

సుం . నీకు చిన్నప్పట్నుంచీ ఎలావచ్చాయే? ఒక తల్లి కడుపున పుట్టాంకదా, నాకు రాలేదేం?

సరో : దానికో కిటుకుంది లే.

సుం : ఏమిటో నాకూ చెబుదూ, నేనూ నేర్చుకొంటాను.

సరో : అది సులభంగా రాదు. సైకాలజీ అని ఒకటుంది లే. అది తెలిస్తేగాని రాదు.

సుం : ఏవిటీ ! కాలేజీలు గా ? కాలేజీలో ఆడబిడ్డల్ని సాధించడంకూడా నేర్పుతారా యేం ?

సరో : ఓ నేర్పుతారు.

సుం : చూశావా. నేను అయిదో క్లాసుతో చదువు మానేడం వల్ల ఎంత ముప్పొచ్చిందో.

సరో : స్ప్లెండిడ్, ఈ విధంగానైనా చదువుకోసందుకు విచారిస్తున్నావు, అంతేచాలు.

సుం : పోనీ నేనో నెల్లాళ్ళపాటు ఇక్కడుంటాగా, ఆ కాలేజీ ఏవిటో నాకు చెబుదూ నీకు పుణ్యముంటుంది.

సరో : నేను చెప్పడం ఎందుకూ, ఈ నెల్లాళ్ళూ నువ్వు సుశీల మీద ప్రాక్టికల్స్ సాధకం చెయ్.

సుం : లేదే, వచ్చేనెల్లో మా చిన్ని మరిది లేడూ—

సరో : ఎవరూ, ఆ పిలకా గిలకా ఉన్న పొట్టివాడేనా?

సుం : ఆ, ఆయనే, ఆయనకి పెళ్ళవుతుంది.

సరో : మేగాడ్ ఫర్ బిడ్.

సుం : అంటే, ఏవిటంటున్నావు?

సరో : ఏం లేదు.

సుం : ఎంత ఇంగ్లీషు రాకపోయినా నాకామాత్రం తెలీదా ఏమిటి? గాడ్ అంటే దేవుడు, దేవుడేదో చెయ్యాలంటున్నావు...

సరో : దేవుడు దయవల్ల అవాలంటున్నాను. సరే, అతనికి పెళ్ళయితే నీకేం?

సుం : కాదే, అప్పుడు మా అత్తారింటికి మూడో కోడలు కాపరానికొస్తుంది.

సరో : వస్తే?

సుం : అప్పుడు నేను ఇంటికి పెద్దకోడల్నవుతా.

సరో : సేచురల్లీ... ఊఁ-అయితే,

సుం : అప్పుడు మా అత్తగారితో, ఆడబిడ్డతోపాటు నేనూ దాన్ని అదుపాజ్ఞల్లో పెట్టాలి.

సరో : ఓహో ప్రమోషనొస్తుందన్నమాట! వెరీ యింటరెస్టింగ్! ఆ, చెప్పు.

సుం : అప్పుడు నాకిలాంటి కొత్త ఆలోచనొస్తే మంచిది కాదూ. మా అత్తారూ, ఆడబిడ్డా ముక్కుమీద వేలేసుకోరూ!

సరో : తప్పకుండా వేసుకొంటారు.

సుం : అప్పుడు వాళ్ళెదురుకుండా కాఫీగట్రా నేను తాగొచ్చు.

సరో : ఏవిటీ, వాళ్ళెదురుగుండా నువ్వు కాఫీ తాగకూడదా ఏమిటి?

సుం : తాగితే ఇంకేమైనా ఉందా?

సరో : చిన్నప్పట్నుంచి మనింట్లో అలవాటుకదా, ఎలాగే బతుకుతున్నావు.

సుం : పాపం ఆయన ఇస్తున్నారు కనక సరిపోయింది.

సరో : ఎవరూ ?

సుం : ఇంకెవరూ ... మాఆయనే. పొద్దున్నే గదిలోకి కాఫీ పట్టుకెళతాను. ఆయన తాగకుండా నా కిచ్చేస్తారు.

సరో : పూర్ బావ. పాపం బావకో...

సుం : ఆయన హోటళ్ళో తాగుతారు.

సరో : బావ చాలా మంచివాళ్ళాగున్నారే.

సుం : ఎంత మంచివారనుకొన్నావు. రోజూ రాత్రి నా అత్తగారూ ఆడబిడ్డా పెట్టే బాధలు చెప్పుకొంటూ ఉంటే కన్నీళ్ళు పెట్టుకొని ఓదారుస్తారు.

సరో : ఓ షూక్! రాత్రిపూట మొగుళ్ళు ఆపూత్రం ప్రేమ కనబర్చకపోతే ఎలా.

సుం : లేదే - ఆయనకి నామీద నిజంగా ప్రేమే.

సరో : మరైతే నువ్వలా బాధలు పడుతూ ఉంటే ఎందు కూర్చుకుంటున్నాడు ?

సుం : ఆయనమట్టుకూ ఏం చేస్తారు ? ఏదో పెద్ద ఉద్యోగం అయ్యేక వేరింటి కాపరం పెడదాం; అందాకా ఓపిక పట్టమంటున్నారు.

సరో : ఓహో-అదాసంగతి. అక్కయ్యా, మనం వదిన్ని సాధించాం అనుకో. ఆవిడ అన్నయ్యకి చెప్తే ఇబ్బందే.

సుం : సింగినాదం; ఏం ఇబ్బంది ?

సరో : అన్నయ్య అర్జనమీంద ఇంటిల్లపాదీ బతుకుతున్నాం గాని, నీ మొగుడులాగ గతిలేక తండ్రి పంచకింద అతనుండటం లేదు.

సుం : ఎంతమాట ఎంతమాట. ఎంతమాటన్నావే, మా ఆయనకి గతిలేకా ...

సరో : నువ్వే అన్నావుగా, బావకి పెద్దజీతం వచ్చేదాకా నీకాబాధలు తప్పవని.

సుం : అన్నాననుకో. అంటే, నువ్వే మాటపడితే ఆమాట అనెయ్యడమేనా.

సరో : ఉన్నమాటంటే ఉక్రోష మెందు కక్కయ్యా బావంటే నాకు జాలిలేక కాదు. తక్కువజీతం తెచ్చు కొనే ప్రతిఒక్కడూ విధిలేక, పెళ్ళాలు ఆడబిడ్డల ఆరడికి అల్లాడుతూ ఉంటే, చూస్తూ ఊరుకొం టున్నారు.

సుం : ఊరుకోక ఏం చెయ్యమన్నావేం !

సరో : నేను చెయ్యమన్నది ఎలాగూ చెయ్యరు. అయినా ఒకళ్ళతో అయేపనికాదు, కలిసికట్టుగా అంతా బాగు పడినప్పుడుగాని! సర్లేఇవ్వన్నీఎందుకుగాని నువ్వన్నట్లు వదిన్ని మనం బాధపెడితే ఎవరికి మోసమో, నీకు తెలుసా? నీకూ నాకూ...

సుం : మన కెందుకు మోసం...

సరో : అన్నయ్య - తన్నితగిలేస్తాడు. లేదా తను వెళ్ళి వేరే కాపరం పెడతాడు.

సుం : పెడితే లోకం ఊరుకోంటుందా ఏం. పెళ్ళాం మాట విని తోడబుట్టినవాళ్ళని న్యూనత పరిచాడని గడ్డి పెట్టరూ.

సరో : అక్కయ్యా, నువ్వనుకొనేలోకం ప్రస్తుతం ఇక్కడ లేదు. తీరికగాకూర్చొని పనీపాటూ లేక పొరుగువాళ్ళ విషయాలు మాట్లాడుకొనే ఓపికా తీరుబాటూ ఈ మహాపట్నంలో ఎవరికీ? పట్టించుకొనే వాళ్ళున్నా సెబాష్ అనేవాళ్ళేగాని చీవాట్లు పెట్టేవాళ్ళు లేరు.

సుం : ఇదే మా అత్తారూళ్లో అయితేనా...

సరో : అవడానికి ఇది మీ అత్తారిఊరుకాదుగా. అక్కయ్యా నువ్వింకా పెంకుటిళ్లోనే ఉన్నావ్. నీ దురదృష్టం కొద్దీ పాతికేళ్ళు వెనకబడ్డ మొరటువాళ్ళింట్లో పడ్డావ్.

సుం పడితే పడ్డా, వాళ్ళేం మొరటువాళ్ళు కారు. ఎంతో మంచివాళ్ళు.

సరో : అందుకే కాబోలు - నిన్నలా రాసి రంపాన పెడుతున్నారు.

సుం : అది వాళ్ళింటి ఆనవాయితీ. నా కోసం మార్చుకుంటారా ఏం...

సరో : అక్కయ్యా నిన్ను మార్చడం నా తరంకాదు. ఏదో సైకాలజీ తెలిసినదాన్ని - నీకు నచ్చచెప్పొచ్చు అనుకొన్నా.

ర : ఏవిటే సరోజా, దాన్తో వాదనేమిటి?

సరో : ఏం లేదమ్మా. అక్కయ్యకి బోధపరుద్దామని.

ర : నీ తరం కాదు.

సరో : వప్పుకొన్నా.

సుం : నన్నెవరూ మీరు మార్చక్కర్లా, నేనేం పసిపాపని కాను.

ర : అయినా బాగుండేది — నయానో భయానో చెప్పే వాళ్ళం.

సరో : పోనీ అమ్మా. ఇవాళ లాభంలేదు - తరువాత చూద్దాం. ఇంకా నెల్లాళ్ళిక్కడుంటుందిగా...

సుం : నే నుండను. ఇందాకనే వట్టేసుకొన్నా. ఈ సాయింత్రము బండికే వెళ్ళిపోతా.

ర : ఏం! అత్తారిల్లు విడిచిపెట్టేక బెంగపట్టుకొందా?

సరో : నిజమేనమ్మా, మూడేళ్ళాయి ఆ కత్తులబోనుకి అలవాటు పడ్డాది. ఆ వాతావరణం లేకపోతే ఒడ్డునపడ్డ చేపలాగ బాధపడుతూంది.

సుం : నేనేం బాధపడలేదు.

సరో : నువ్వు లేదంటే సరా... నీ మనసులో నీకు తెలియకుండానే నువ్వు బాధ పడుతున్నావు. ఈ యిల్లు మీ అత్తారిల్లు లాగ చేసి తృప్తిపడదామనుకొంటున్నావు.

సుం : అయితే తప్పా.

ర : తప్పా అని మెల్లిగా అడుగుతావేం... ...తప్పా, తప్పున్నరా... ...

సరో : మీ వదినగారు నిన్ను పెట్టే చిత్రహింసలు ఇక్కడ వదిన్ని నువ్వు పెట్టి నీ మనసులోని ఉబలాటం తీర్చుకొందా మనుకొంటున్నావు......

సుం : అనుకొంటున్నాను. అవకాశం వస్తే ఎవరుమట్టుకు చెయ్యరేం...

సరో : కొందరు చెయ్యరు.

సుం : ఆ...యీ మాటలకేం... వీలు చిక్కితే ఎవరేనా చేస్తారు.

సరో : మనఅమ్మ చెయ్యలేదు. అమ్మా, ఆ సంగతు లక్కయ్యతో చెప్పు.

ర : చెపితే తల కెక్కుతుంది గనకనా...

సరో : అయినా చెప్పు.

ర : సుందరం, నువ్వు చెస్తే నమ్మవుగాని, నేను నువ్వు పడుతున్న బాధలకన్నా హెచ్చు బాధలుపడ్డా. మీ నాయనమ్మా, మేనత్తా నన్ను పెట్టిన హింసలు నరకంలో యమదూతలుకూడా పెట్టరు. ఈ చేతి మీద మచ్చ ఏమిటో తెలుసా! నువ్వు ఏణ్ణర్థం పిల్లవిగా ఉన్నప్పుడు మా వదినగారు నాకు వాతలు పెట్టింది.

సుం : ఎందుకు పెట్టిందీ...

ర : నీకు పాలిస్తూ ఆవిడపిలిస్తే వినిపించుకోలేదట.

సుం : నువ్వు నిజంగా వినిపించుకోలేదా...

ర : నేను వినిపించుకోక కాదు. నువ్వు నన్ను ఒదల్లేదు. గుక్కపెట్టి ఏడవడం మొదలుపెట్టావు. నిన్ను ఏడిపించటంకన్న ఆవిడవేసే శిక్ష అనుభవించటమే మంచిదనుకొన్నా.

సుం : నా నుంచి నీకు వాతలు పెట్టించా అత్తయ్య!...

ర : వాతలే కాదు. ఎన్ని హింసలు పెట్టాలో అన్నీ పెట్టారు.

సుం : మరి నాకెప్పుడూ చెప్పలేదేం, సరోజ కెలా తెలుసు?

సరో : నాకు మట్టుకు చెప్పిందా! ఒకనాడు ఈ మచ్చలేవిటమ్మా అని అడిగితే చివరి కెలాగో చెప్పింది.

ర : చెప్తే ఏం లాభముంది... వాటినుంచి బుద్ధితెచ్చుకోవాలిగాని.

సుం : అమ్మా...

ర : నన్ను వెళ్ళనీ; వంటింటో పాపం సుశీలొక్కర్తే ఉంది. కొంచెం సాయం చెయ్యాలి.

సుం : సరోజా...

సరో : ఏవక్కయ్యా...?

సుం : అమ్మకూడా ఇన్ని బాధలు పడ్డాదటే...

సరో : అవును - పడ్డాది. కనుకనే వదిన్ని పల్లెత్తుమాటఅనదు. ఆడపుట్టుక పుట్టింది కనక అర్థం చేసుకోగలిగింది

సుం : అదికాదే, మా అత్తగారినికూడా వాళ్ళత్తగారుఎన్నో బాధలు పెట్టిందట... అందులో సూదోవంతు కూడా మమ్మల్ని పెట్టడంలేదట.

సరో : అత్తా ఒక యింటికోడలే... గానీ తనుపడ్డ బాధలు తనకోడలికికలిగించక పోవడంలోనే ఉంది గొప్ప తనం.

సుం : నిజమే ననుకో... ఇందాక నేను సుశీలని పిలుస్తూ ఉంటే అమ్మ నా మీద మండిపడ్డాది. ఎందుకు చెప్మా అనుకొన్నా...

సరో : ఎందుకేవిటి? తన కోడరికం రోజులు జ్ఞాపకంవచ్చి—

సుం : అయితే నేను పాపిష్టిదాన్నే సుమా... నా మూలకంగా అమ్మకి అత్తయ్య వాతలు పెట్టిందట.

సరో : నీ మూలకంగా కాదు. పెట్టదలుచుకొంటే నువ్వు కారణం కాకపోయినా పెట్టేది.

అన్నయ్య : సుందరం, సుందరం...

సుం : ఏవన్నయ్యా...

అ : మీ మరిది ఉత్తరం రాశాడు.

సుం : ఏం రాశాడన్నయ్యా... పెళ్ళి బట్టలు కొనడానికి పట్నం వస్తానన్నారు. ఎప్పుడొస్తారేవిటి?

అ : మనూరు రారట, బొంబాయి వెళతారట.

సుం : అక్కడ బట్టలు కొంటారేవిటి చెప్మా.

అ : బట్టలు కొనటానికికాదు– ఉద్యోగం చూసుకోడానికి.

సుం : ఇదేవిటి...

అ : వాడు పెళ్ళిచేసుకోడట

సుం : అయ్యో... అయ్యో... అదేం?

అ : ఏంలేదు. నిన్నూ నీ తోడికోడల్ని మీ అత్తగారు పెట్టే బాధలు చూసి తన పెళ్ళానికి కూడా అదేగతి పడుతుందని అక్కర్లేదన్నాడుట.

సరో : రియల్లీ ... పొట్టిబావగారికి ఇంతసాహసం ఎలా వచ్చిందో...

అ : ఎందుకురాదూ, మనిషన్న వాడికి ఆమాత్రం జ్ఞానం ఉంటుంది.

సుం : పెళ్ళవుతుందని ఎంతో సంతోషపడ్డానే—

సరో : సంతోషపడటం లేదు. నీ ప్రమోషను పోతుందికదా అని ఏడుస్తున్నావు.

అ : ప్రమోష నేవిటే...?

సరో : నీకు తెలీదులే అన్నయ్యా. అక్కయ్యకి ప్రమోషను రావలసింది, పోయింది.

అ : నీమొహం. సుందరానికి ప్రమోష నేవిటి; పోవడ మేవిటి... బావకి ప్రమోషనైతే...

సుం : ఏవిటి? నిజంగానా...?

అ : అవును.

సుం : నీ తల్లి కడుపుచల్లగా, నీ అత్తకడుపు చల్లగా ఎంత చల్లటిమాట చెప్పావు. నిజంగానేనా?

అ : అబద్ధమాడటానికి నాకేం పట్టిందే...

సరో : కంగ్రాచ్యులేషన్సు అక్కయ్యా... వేరింటి కాపరం పెట్టు.

సుం : అమ్మా, అమ్మా, సుశీలా... సుశీలా, ఇలారండి.

ర : ఏవిటే ఆ కేకలు.

సుం : ఏం లేదమ్మా, నువ్వూ సుశీలాపోయి కూర్చోండి. నేను వంటవండుతాను.

ర : ఏవిటే! ఏవిటిది...నువ్వెందుకూ వండటం...?

సుం : నీకు తెలీదులే – నువ్వూ సుశీలా, అమ్మా, సుశీలా నువ్ లే.

ర : ఏవిటే సరోజా... అక్కయ్యకేం పిచ్చిపట్టలేదుకద...

సరో : లేదమ్మా అక్కయ్యకి ప్రమోషనొచ్చింది.

—...—